# పఠాభి పేల్చిన ఫిరంగులు

ఫిడేలు రాగాల డజన్ 1939

కయిత నా దయిత 1978

పఠాభి పన్చాంగమ్ 1980





పఠాభి అమృతోత్సవ సమితి
కావ్యాలయం, 159/2 ఆర్.టి., విజయనగర్ కాలనీ;
హైదరాబాదు - 500 457

హక్కులు : పరాధి
ముఖ చిత్రం : చంద్ర

ముద్రణ :
అనుపమ ప్రింటర్స్,
హైదరాబాదు 500 028.
టైప్‌సెట్టింగ్ :
శ్రీ శ్రీనివాస గ్రాఫిక్స్
హైదరాబాదు 500 457




వెల : 111 రూపాయలు

సోల్ డిస్ట్రిబ్యూషన్ :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

# మన్దుగున్డు

డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి
అధ్యక్షులు : పరాభి అమృతోత్సవ సమితి

"పరాభి"గా అవతరించిన శ్రీ తిక్కవరపు పట్టాభిరామిరెడ్డి కారణ జన్ముడు ఆయన జన్మించింది అధికార ఐశ్వర్య సంపన్నమైన ఒక పెద్ద కుటుంబంలో వారి తండ్రి శ్రీ తిక్కవరపు రామిరెడ్డి గారు నెల్లూరు మండలంలో ప్రముఖులు, స్వాతంత్ర్య సమర యోధులు దక్షిణ బారత పర్యటన సందర్భంగా బాపూజీ నెల్లూరు వచ్చినప్పుడు తిక్కవరపు రామిరెడ్డిగారికి అతిధిగా ఉన్నారు రామిరెడ్డిగారు అసలైన గాంధేయవాది, సంస్కరణాభిలాషి, వితరణశీలి, నియమబద్ధ జీవి అన్నిటికీ మించి సాహిత్య ప్రియుడు, సాహిత్య పోషకుడు మొదట తిక్కన జయంతి పేరుతో, తర్వాత కవిత్రయ జయంతుల పేరుతో ఆనాటి జాషువా మొదలు యీనాటి డాక్టర్ సి నారాయణరెడ్డి వరకు సన్మానాలు చేసినవారు 1946లో స్కూలు విద్యార్థిగా నేను సుబాస్ చంద్రబోసు జీవితాన్ని, 'నేతాజీ అన్న పద్యకావ్యంగా రచించి ముద్రించిన సందర్భంగా నన్ను విశేషంగా అభిమానించి సన్మానించినవారు నేను 1957లో రచించిన 'కాంతి చక్రాలు" అనే కావ్యాన్ని కోరి అంకితం తీసుకొన్న రసజ్ఞులు తిక్కవరపు రామిరెడ్డిగారు

శాంతి నికేతన విద్యార్థి, స్వాతంత్ర్య వీరుడు సాహిత్యవేత్త - మద్రాసు రాష్ట్రంలో మంత్రి మొదలు, ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రిగా, కేంద్ర మంత్రిగా, యు పి గవర్నరుగా ఎన్నో

మహోన్నత పదవుల నలంకరించిన డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారికి, పరాభి స్వయాన మేనల్లుడు బావమరిది ఆనాడు నెల్లూరులో "సుదర్శన మహల్ అంటే పరాభి జన్మించిన మందిరం లక్ష్మి సరస్వతీ సుందరం సాంఘిక, రాజకీయ సంరంబ బంధురం ఇదీ "పరాభి' జీవిత నేపథ్యం అదే ఆయన పేల్చబోయే పిరంగులకు దట్టించిన మందు గుండు ఆనాటి సాంప్రదాయిక ఛాందస తత్త్వాన్ని వ్యతిరేకించి అందులోంచి వెలికివచ్చి తిరుగుబాటు జెండా ఎగరేసిన విప్లవ బావుకుడు అధికారాన్ని, ఐశ్వర్యాన్ని కాలదన్నిన త్యాగశీలి పరాభి ఆయన తండ్రిది ఒకే మాట, ఒకే బాట. పరాభిదీ అంతే ఆతండ్రి కొడుకుల్ని కలపాలని నేను చేసిన ప్రయత్నాలు పలించ లేదు తండ్రి తరం గతించింది కొడుకు తరం గతించబోతున్నది మధ్య అర్ధశతాబ్దిలో ఎంతో మార్పు వచ్చింది

జీవంతమయిన ప్రతీదీ మారుతుంది మారే ప్రతి దానికీ, జనన ముంటుంది జనించిన ప్రతిదీ మరణిస్తుంది నిజమేగానీ - ఈ జననాలూ, మరణాలూ కూడా, మార్పులే. ఎదీ ఎట్లా శాశ్వతం కాదో, ఎదీ అట్లాగే అశాశ్వతం కూడా కాదు "ఇది ఇంతే ఇల్లాగే ఉండాలి ఇల్లాగే ఉంటుంది ఇది మారడానికి వీల్లేదు" అని శాసించడం· అలా, శాసించే వారి అమాయికత్వానికీ, మూర్ఖత్వానికీ చిహ్నంగా బావించాలి

సాహిత్య పరిశోధకుల అంచనా ప్రకారం తెలుగు కవిత్వం ఉదయించి, సుమారుగా వేయి సంవత్సరాలయింది అంటే - అంతకు ముందు తెలుగులో అసలు కవిత్వమే లేదని అర్ధమా? శిలా శాసనాల్లోనూ, తామ్ర శాసనాల్లోనూ ఉన్న చాలా పద్యాలను,

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారూ, వేటూరి ప్రభాకర శాస్త్రి గారూ, దివాకర్ల వెంకటావధాని గారూ చాలా వెలికి తీశారు. నన్నయతోనే, ఆస్థాయి ఛందోబద్ధమయిన కవిత్వం అవతరించి ఉంటుందనడం, విమర్శకు నిలబడదు

నన్నయ పద్య రచనకూ, తిక్కన పద్య రచనకూ చాలా తేడా లున్నాయి అలానే, నన్నయ తిక్కనల పద్య రచనకూ, ఎర్రా ప్రెగడ పద్య రచనకూ చాలా తేడా లున్నాయి అయితే ఈ తేడాలు సామాన్య పరిత కనిపెట్ట గలిగినంత సులువుగా ఉండకపోవచ్చు పద్యం ఎత్తుగడలోనూ, ముగింపులోనూ, పద్యంలో వాడిన బాషలోనూ, ఈ బేదా లుండవచ్చు ఒక్కొక్కసారి, తను చెప్పదలచుకొన్న బావాన్ని స్పష్టంగా సుందరంగా చెప్పడానికి, తన మాతృ బాషలో అనువయిన పదం లేనప్పుడు అన్య బాషల నుండి, అందుకు తగిన పదాలను ఎన్నుకోవచ్చు ఈ అన్య బాషలు - ఇరుగు పొరుగు ప్రాంతాలవే అయిఉండ నవసరం లేదు అవి ఈ దేశానికి సంబంధించినవీ కావచ్చు; అన్య దేశ్య పదాలూ కావచ్చు

త్రాసు ' అన్న పదాన్ని, తిక్కన, శాంతి పర్వంలో ఉపయోగించాడు ఇది సామాన్యునికి సంస్కృత పదమన్న భ్రమను కలిగిస్తుంది ఇది సంస్కృత పదం కాదు సరిగదా దేశ్యం కూడా కాదు "తరాజ్" అన్న పర్షియన్ పదం, మన వాడుకలో "తరాజు" అయి, తిక్కన పద్యంలో "త్రాసు" గా సాక్షాత్కరించింది "అసలు" అన్న పదం యొక్క మూల రూపం అరబిక్ బాషలో 'అసల్' గా తప్ప మనకు కనిపించదు ఈ పదాన్ని శ్రీనాధుడు ఉపయోగించాడు 'ఖర్చు" అన్నది అరబిక్ పదమే. ఆ బాషలో ఇది 'ఖర్స' గా మనకు వినబడుతుంది పల్నాటి చరిత్రలో శ్రీనాధుడు ఈ "ఖర్చు"ను

కూడా వాడుకొన్నాడు అంతదాకా దేనికి? రోజూ మనం వాడే "రోజు" పర్షియన్ పదం "రోజ్" - ఇదిన్నీ పల్నాటి చరిత్రలో మనకన్నబడుతుంది "మేకు' అసలు రూపం "మేఖ్" పర్షియన్ పదం ఇది వరాహ పురాణకర్త ఉపయోగించాడు "ఖసి అన్న అరబిక్ పదాన్ని మనం హరవిలాసంలో చూడవచ్చు "తేజ' అన్నది పర్షియన్‌లో "తేజ్' గౌరన నవనాధ చరిత్రలోనూ, ధూర్జటి కాళహస్తీశ్వర శతకంలోనూ, మనం దీన్ని చూడవచ్చు ఎక్కడి దాకానో ఎందుకు? "కుందనం" తెలుగు పదం కాదే. "సరిహద్దు" తెలుగు పదం కాదే. కాగితం, చికిలి, జులుం వంటివేవీ తెలుగు పదాలు కావు ఆఖరుకు మనం రోజూ వాడే అలమరా, బాల్చీ, బొత్తాములు కూడా అన్య దేశ్యాలే.

ఇవన్నీ మనం ఇప్పుడు గుర్తు చేసుకోవడానికి కారణం - చెప్పదలుచుకొన్న అంశం - తానాశించినంత స్పష్టంగా, శక్తివంతంగా, సూటిగా, సుందరంగా చెప్పడానికి అనువయిన పదాలను - అన్ని కాలాల కవులూ, అన్ని బాషల నుండీ అంది పుచ్చుకొన్నారని చెప్పడం కోసమే

మన, ఫిడేలు రాగాల డజన్ పరాభి, చేసింది కూడా ఆ పనే.

పాతను చూడడానికి అలవాటు పడి, పాతను మాత్రమే చూడగల కళ్ళకు, ఎ కొత్త దృశ్యమయినా వింతగానూ, విడ్డూరంగానూ కనపడ్డం నిజం వింతను వికృతంగా చిత్రించిందాకా వారికి నిద్ర పట్టదు ఎ చిన్న మార్పునూ వారు ఇష్టపడరు కానీ కాలమన్నది - వీరి ఇష్టాల కోసం ఎదురు చూడదు వీటన్నింటి మీది నుంచి అది ప్రవహిస్తూ పోతుంది

నండూరి సుబ్బారావు గారు, సుందరమయిన భావాలను, సరళమయిన బాషలో "పాట" గా మలిచినప్పుడూ, ఆ పాటల సాయంతో ఒక ఎంకినీ, ఒక నాయుడు బావనూ 1917 లోనే తెలుగు పారకలోకాని కందించినప్పుడూ, అప్పటి పండితులూ, చాదస్తులూ నండూరి సుబ్బారావుగారి మీద విరుచుకు పడ్డారు. ఒక కృష్ణశాస్త్రి 'కృష్ణపక్షం" వెలువరించినప్పుడు, అపహసిన్తూ 'శుక్లపక్షం" అవతరించింది ఒక శ్రీరంగం నారాయణ బాబు, శిష్ట్లా ఉమా మహేశ్వర రావు, శ్రీరంగం శ్రీనివాసరావు, తిక్కవరపు పట్టాభి రామిరెడ్డి - పాతను తోసిపుచ్చి, కొత్త ప్రక్రియను చేపట్టినప్పుడు కూడా సంప్రదాయవాదులు విరుచుకుపడ్డారు, మండిపడ్డారు. ఈ కొత్త కవులకు ఛందోజ్ఞానం లే దన్నారు అన్నీ సంకరం చేశా రన్నారు అంటూ - వీరి రచనల నుండి చాలా సమాసాలను ఉదహరించారు. 'వాడి మయూఖముల్ " మంచి సమాసమా? ప్రాణగొడ్డం జీవగ్రర, తెప్పోత్సవం, కపిల కన్నులు, విత్తనోత్పత్తి, మూడ నమ్మకం, నైతిక విలువలు, సంపూర్ణ మద్దతు, ప్రతి రోజు, ప్రతి పూట, బహు చక్కగా, అనేకమంది వంటి మాటలన్నింటిలోనూ, పద సాంకర్యమూ వర్ణ సాంకర్యమూ కనబడుతుంది వీటిని నిషేధించి ప్రయోజనం లేదు "మార్పు అనివార్యం" అన్న సత్యాన్ని గ్రహించకా తప్పదు

సుమారుగా ఐదున్నర దశాబ్దాల కిందట, తెలుగు సాహితీ క్షేత్రంలో అడుగు మోపిన పరాభి గారి పిడేలు రాగాల డజన్, ఆ క్షేత్రాన్ని కుదిపి వేసింది అల్లకల్లోలం చేసి పారేసింది అధిక సంఖ్యాకులు పరాభిని దుమ్మెత్తి పోయగా, కొద్దిమంది - బహు కొద్దిమందే కావచ్చు - పరాభి పక్షాన నిలిచారు, ఆయనకు మద్దతు

పలికారు ఆయన కొత్త కవిత్వంలోని, కొత్త కొత్త అందాలను, ఆంధ్రులకు - యధాశక్తిగా తెలియ చేశారు పరాభిని ఆదర్శంగా బావించినవారూ ఆయనను అక్షరాలా అనుసరించినవారూ, ఆయననే ఆదర్శంగా తీసుకొన్నవారూ ఉన్నారు

తెలుగు విమర్శకులను రెండుగా చీల్చిన బహు కొద్దిమంది తెలుగు కవుల్లో పరాభి వొకరు ఇంతవరకూ వెలువడిన మూడు కవితా సంపుటాను కలిపి 'పరాభి పేల్చిన పిరన్గులు' గా, ఒకే పుస్తకంగా ప్రచురిస్తున్నాం తొలి రూపాలను యధాతధంగానే ముద్రించడం వల్ల, బావి పరిశోధకులకు ఎక్కువ ఉపయోగంగా ఉంటుందన్న అభిప్రాయంతో, కొన్ని కొన్నింటిని యధాతధంగానే ఉంచాం ఉదాహరణకు : పరాభి పన్చాన్గంలోని ఎప్రిల్ మాసానికి చెందిన 11వ అంశంలో ధర్డ్క్లాసు ప్రసక్తి వస్తుంది ఇప్పుడా మూడవ తరగతి రైళ్ళలో లేదు అయినా - ఒకప్పటి స్థితిని చిత్రిస్తున్నది గనుక అలానే ఉంచాం అలాంటిదే పిడేలు రాగాల డజన్లోనూ కనబడుతుంది

తొలి ముద్రణ పుస్తకం అట్ట మీద పిడేలు బొమ్మ ఉంటుంది రెండవ ముద్రణలో ఈ ముఖచిత్రం మారింది తొలి ముద్రణ ప్రతిని సేకరించడానికి యధాశక్తిగా కృషి చేసినప్పటికీ లాబం లేకపోయింది

వివిధ పత్రికలలో - పరాభి కవిత్వం మీద సువిమర్శలు, కువిమర్శలు, ప్రతి విమర్శలూ చాలా వచ్చాయి "ఆధునిక కవిత ప్రసక్తి వొచ్చిన ప్రతి సందర్భంలోనూ పరాభి ప్రసక్తి రాక తప్పనంత సాంద్రంగా ఆయన కృషి విస్తరించింది ఒకప్పటి వివాదాస్పద కవిత్వం ఇప్పుడు విశ్వవిద్యాలయాల

పరిశోధకులకు విషయం కావడం - కాలం మారుతున్నదనడానికి నిదర్శనం

పరాభి 75వ జన్మదినోత్సవ సందర్భంగా ఆయన మూడు పుస్తకాలనూ, ఒకే గ్రంధంగా ప్రచురించడం ఉచితంగా ఉంటుందని, అమృతోత్సవ సమితి అభిప్రాయపడింది మా యీ సంకల్పాన్ని ఆమోదించిన పరాభిగారికి కృతజ్ఞతలు

బృహత్తరమయిన ఈ కార్యక్రమంలో అడుగడుగునా సహకరించిన వారెందరో ఉన్నారు ముఖ్యంగా· శ్రీ రావెల సోమయ్య గారిని, శ్రీ యం యస్ రెడ్డి గారిని శ్రీ పర్వతరెడ్డి బాబుల్ రెడ్డి గారిని, శ్రీ తిక్కవరపు సుబ్బరామిరెడ్డి గారిని, డాక్టర్ రావూరి బరద్వాజ గారిని, హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను

ఈ సందర్భంలో ప్రత్యేకంగా పేర్కొనదగిన వదాన్యులు శ్రీమాగుంట సుబ్బరామిరెడ్డి గారు పరాభి గ్రంధత్రయాన్ని, ఒకే పుస్తకంగా ప్రచురించడంలోనూ అభినందన సంచికను వెలువరించడంలోనూ, వారంద చేసిన ఆర్థిక, హార్దిక సహాయం మరువరానిది ఈ శుభ తరుణంలో; నా పక్షానా పరాభి అమృతోత్సవ సమితి పక్షానా, శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి గారికి ధన్యవాదాలు తెలియచేస్తూ -

ఎన్దరో మహానుభావులు ( అన్దరికీ “వన్ద”నాలు చెబుతూ -

డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి
అధ్యక్షులు : పరాభి అమృతోత్సవ సమితి
కాంతాలయం' విజయనగర్ కాలనీ
హైదరాబాదు - 500 457

19 ఫిబ్రవరి 1994

పలికారు ఆయన కొత్త కవిత్వంలోని, కొత్త కొత్త అందాలను, ఆంధ్రులకు - యధాశక్తిగా తెలియ చేశారు పఠాభిని ఆదర్శంగా బావించినవారూ, ఆయనను అక్షరాలా అనుసరించినవారూ, ఆయననే ఆదర్శంగా తీసుకొన్నవారూ ఉన్నారు

తెలుగు విమర్శకులను రెండుగా చీల్చిన బహు కొద్దిమంది తెలుగు కవుల్లో పఠాభి వొకరు ఇంతవరకూ వెలువడిన మూడు కవితా సంపుటాను కలిపి పఠాబి 'పేల్‌చిన పిరన్‌గులు' గా, ఒకే పుస్తకంగా ప్రచురిస్తున్నాం తొలి రూపాలను యధాతధంగానే ముద్రించడం వల్ల బావి పరిశోధకులకు ఎక్కువ ఉపయోగంగా ఉంటుందన్న అభిప్రాయంతో, కొన్ని కొన్నింటిని యధాతధంగానే ఉంచాం ఉదాహరణకు పఠాభి పన్‌చాన్‌గంలోని ఎప్రిల్ మాసానికి చెందిన 11వ అంశంలో ధర్డ్‌క్లాసు ప్రసక్తి వస్తుంది ఇప్పుడా మూడవ తరగతి రైళ్ళలో లేదు అయినా - ఒకప్పటి స్థితిని చిత్రిస్తున్నది గనుక, అలానే ఉంచాం అలాంటిదే పిడేలు రాగాల డజన్‌లోనూ కనబడుతుంది

తొలి ముద్రణ పుస్తకం అట్ట మీద పిడేలు బొమ్మ ఉంటుంది రెండవ ముద్రణలో ఈ ముఖచిత్రం మారింది తొలి ముద్రణ ప్రతిని సేకరించడానికి యధాశక్తిగా కృషి చేసినప్పటికీ లాబం లేకపోయింది

వివిధ పత్రికలలో - పఠాభి కవిత్వం మీద సువిమర్శలు, కువిమర్శలు, ప్రతి విమర్శలూ చాలా వచ్చాయి 'ఆధునిక కవిత' ప్రసక్తి వొచ్చిన ప్రతి సందర్భంలోనూ పఠాభి ప్రసక్తి రాక తప్పనంత సాంద్రంగా ఆయన కృషి విస్తరించింది ఒకప్పటి వివాదాస్పద కవిత్వం ఇప్పుడు విశ్వవిద్యాలయాల

పరిశోధకులకు విషయం కావడం - కాలం మారుతున్నదనడానికి నిదర్శనం

పరాభి 75వ జన్మదినోత్సవ సందర్భంగా ఆయన మూడు పుస్తకాలనూ, ఒకే గ్రంథంగా ప్రచురించడం ఉచితంగా ఉంటుందని, అమృతోత్సవ సమితి అభిప్రాయపడింది మా యీ సంకల్పాన్ని ఆమోదించిన పరాభిగారికి కృతజ్ఞతలు.

బృహత్తరమయిన ఈ కార్యక్రమంలో అడుగడుగునా సహకరించిన వారెందరో ఉన్నారు ముఖ్యంగా· శ్రీ రావెల సోమయ్య గారిని, శ్రీ యం యస్ రెడ్డి గారిని, శ్రీ పర్వతరెడ్డి బాబుల్ రెడ్డి గారిని, శ్రీ తిక్కవరపు సుబ్బరామిరెడ్డి గారిని, డాక్టర్ రావూరి బరద్వాజ గారిని, హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను

ఈ సందర్భంలో ప్రత్యేకంగా పేర్కొనదగిన వదాన్యులు శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి గారు పరాభి గ్రంథత్రయాన్ని, ఒకే పుస్తకంగా ప్రచురించడంలోనూ, అభినందన సంచికను వెలువరిం చడంలోనూ, వారంద చేసిన ఆర్థిక, హార్దిక సహాయం మరువరానిది ఈ శుభ తరుణంలో; నా పక్షానా, పరాభి అమృతోత్సవ సమితి పక్షానా, శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి గారికి ధన్యవాదాలు తెలియచేస్తూ -

ఎన్దరో మహానుబావులు (అన్దరికీ "వన్ద' నాలు చెబుతూ -

డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి
అధ్యక్షులు పరాభి అమృతోత్సవ సమితి
కాంతాలయం విజయనగర్ కాలనీ
హైదరాబాదు - 500 457

19 ఫిబ్రవరి 1994

# ప్రకాశకుల మాట

అరవై అయిదేళ్లుగా ఒక గ్రంథాలయాన్ని నిర్వహిస్తూ, కవి పండిత సభలు జయంతులు జరుపుతూ సవ్వడిలేని సారస్వత సేవ చేస్తున్న నెల్లూరు వర్ధమాన సమాజం, ఈ దశాబ్దిలో వెలువరించిన ప్రచురణలలో - ఇంచుమించు 33 ఏళ్ళతర్వాత పునర్ముద్రణ పొందుతున్న ఈ పిడేలు రాగాల డజన్ మూడవది మొదటిది : Speeches and Essays of Dr C R Reddy (1979) రెండవది: వేమన - పాశ్చాత్యులు - మరుపూరు కోదండరామిరెడ్డి తెలుగుసేత (1971) దీనిని పునర్ముద్రించడానికి దయతో మాకు అనుమ తిచ్చిన శ్రీ వరాభి'కి మా కృతజ్ఞతలు ఈ ప్రచురణ ఈ రూపంలో వెలువడడానికి ప్రధాన ప్రేరకులు కారకులు మా సమాజ పూర్వ కార్యదర్శి బం గో రె ఇక ఇందులో మాకు తోడ్పడ్డవారు ఎందరో ఉన్నారు శ్రీ ఎన్ ఎస్ కృష్ణమూర్తి తయారు కేసిన పాత సాహిత్య పత్రికల వ్యాససూచి (index) నవిమర్శక ప్రస్తావనలను క్రోడీకరించడానికి 'రెడీ రెకనర్' మాదిరిగా తోడ్పడింది మిత్రులు కె వి రమణారెడ్డి, డాక్టర్ కాళిదాసు పురుషోత్తం, శ్రీమతి టి కృష్ణాబాయి చలసాని ప్రసాద్ తమ శక్తివంచన లేకుండా సాయపడ్డారు అర్థభరితమైన ముఖపత్ర రచన చేసిన చిత్రకారులు శ్రీ యం రెడ్డప్ప నాయుడు - వీరందరికి మా సమాజ పక్షంగా కృతజ్ఞతలు తెలియ చేస్తున్నాను

—గోపి

కార్యదర్శి

నెల్లూరు

15–12–72

# అనుక్రమణిక

*

## THIRTY FOUR YEARS AGO

It is quite a strange feeling to knock on the innermost doors of memory and be confronted with yourself just before the time these poems were written I had a surfeit of lyrical poetry of Gurudev Tagore in the romantic atmosphere of Santiniketan for nearly two years I joined the Calcutta University for my Literature M A and took up residence in the dingy rooms of lower Chitpur road in Calcutta The din the squalor and the human misery shocked me to the core The mad commercial activity of the city and the loathsome brothels of Chitpur road where innocence was exploited by avarice, disturbed me greatly Besides this the gathering war clouds in Europe completely shattered the misty moonlight influence of Tagore It was the year 1938

As I lay on my bed and looked through the window, I saw the full moon surreptitiously peering through the smoke filled sky All the thousand metaphors I had read in the Bhava Kavitvam, in Prabandhams and in Tagor s songs, suddenly lost all their meaning It was at that moment I found the point of view rather the angle of attack which later formed the basis of this book I remember, I distinctly felt sick inside me My heart was indeed an Asantiniketan I could no longer continue my studies at the University

I returned to Nellore

I reluctantly entered my family business of Mica export at Gudur I used to travel often between Madras and Nellore Business life least interested me, though the prospect of going to the U S A tempted me to stick to it

I used to meet Sri Sri and Mallavarapu Visweswara Rao whenever I went to Madras It is at this time that I wrote Ragala Dozen With the basic experience of Calcutta providing my viewpoint, I indented on my observations in Madras and Nellore to cull the material necessary for my first book of poems

The authors who influenced me most were Sri Sri and Chalam I read and re-read the prose poems of Walt Whitman Oscar Wilde s Ballad of Reading jail haunted me constantly The writings of Freud interested me a great deal Above all the negative influence of Tagore, had a great deal to do with the paten I envisaged for my book I consciously tried to break away from his imagery Another person who made a powerful impression on me was Albert Einstein both as a man and as a mathematician I was amazed by his daringly original thinking in propounding his theory of relativity

Earlier while in Santiniketan, I experimented a great deal with End Rhymes I was in search of a New Sound Tagore had discarded the Sanskrit metres and successfully tried various types of metres with end rhymes in Bengali But this was a singularly difficult task in Telugu because with most of the words ending in డు ము వు లు (du, mu, vu lu) practically every word rhymed with the other However I am glad, the experiments I did, did bear fruit as a considerable body of end rhyme poetry has now come to pass Of course the end rhymes were not meant to be an end in themselves It was more a way of trying to change the content as well

But for this book and for the agitated feelings I had, which I wished to convey I felt I had to find new weapons I wanted the readers of these poems to sit up and take note I was prepared for even abuse Abuse would have served my purpose admirably It is apathy that kills Only out of friction can progress be achieved This also explains why I wrote all the poems in first person singular Buffoonery, egoism and sex were all part of my arsenal

I had to find a rhythm that reflected the beat of the city with its cacophony of street noises mingled with human anguish This ruled out the traditional prosody and even the native metres of Geya kavitvam There is an aspect of prosody which is its incantatory effect Verse however revolutionary, lulls one to a sense of well being and satisfaction

The chaos of the external world could not brook a proper grammar Debunking of established values was essent al before a

new order could be built I wanted to peer behind the smug mask that society wears All these thought not explicitly as I mention, were within me when I composed these poems

If my poems had succeed in any small way in making some people at least realise the shackles which the society is fettered with I would consider my effort to have been worthwhile

I thank the Nellore Progressive Union, on whose steps I spent many a truant school hour, in bringing out this new edition of my book and including criticisms for and against it This certainly pleases me enormously

I thank also my friend B Gopal Reddy (Bamgorey) but for whose enthusiasm and tireless effort this edition would to have been possible

**—T. PATTABHI RAMA REDDY**

Bangalore,

Dec 5, 1972

# పకపకలు, వెకవెకలు

ఈ పొడుగాటి పాటల్లో నాకు
చిత్ర చిత్రాలు ఐనట్టి
భావాలు ఎన్నో
వాడి అయినట్టి కొనగోళ్ళతోడ
చురుకు మనునట్లు పెట్టిన
చక్కిలిగింత షోకు ఎమనను
తెలుగుదేశాన ఈ రాగాలడజను
డజను దెబ్బలుగా
అరడజన్ పూలుగాను
వేయి కన్నీటిచుక్కలు వేడిగాను
నూరు వెక్కిరింపుల నాలికల్
జాచినట్లు
దిక్కుదిక్కుల పకపకల్
వెకవెకల్ సగిలి
చెవుల ఘోషించి
కలవర పరచగలవు

☆ — చలం.

రాగాల డజన్ కాదు,
దీన్ని రోగాల డజన్ అనాలి

— బెజవాడ రామచంద్రా రెడ్డి.

# కవికోకిల దువ్వూరి రామిరెడ్డి

శ్రీ శ్రీ గారు కూడ వారు ఉద్దేశించిన నవకవుల పక్షమున మరొక MANIFESTO ప్రకటించినారు ఇది ఈ ఫిడేలు రాగాల డజన్‌కు INTRO గా ఉన్నది INTRO అంటే INTRODUCTION ఈ రాగాల డజన్ అనునది ఛందోబద్ధము కాని పద్యముల సంపుటి దీనిని రచించిన కవి మా వాడె

శ్రీ శ్రీ గారు ఉద్దేశించిన నవకవులు ఒకరిద్దరుతప్ప శ్రీ శ్రీ గారితో సహా నాకు మిత్రులు వారి సౌజన్యముపైన నాకు నమ్మకము కలదు ఒకవేళ వారు వచన పద్యాలనే దుడ్డుకర్రలతో పద్యాల నడుములు విరగదంతాము అని నిరాఘాటముగా చాటినప్పటికిని వారిలో ఎవ్వరిలోను ఇటువంటి గడుసుదనము నాకు కనిపించలేదు అందుచేత అభిప్రాయభేదములు నాగరకుల స్నేహమునకు భంగము కలిగించవని నా నమ్మకము

శ్రీ శ్రీ గారి INTRO లో ప్రతివాక్యము విమర్శకు పాత్రమగునంతటి బలహీనముగా నాకు గోచరించినది ఒక అక్షరమునకు లక్ష అర్థములుండిన కవులకు ఏమీ యిబ్బందిలేదు ఒక మాటకు పది పర్యాయపదము లుండిన ఏమీ చిక్కులేదు అవి అన్నియు వాడుకలో రూఢియైనవి కావు నానార్థ రత్నమాలను ముందు పెట్టుకొని ఏ కవీ కవిత్వము వ్రాయడు పూర్వము శ్లేష కావ్యములు వ్రాయు దినములలో అట్టి నిఘంటువులు ఉపయోగపడి యుండవచ్చును ఇప్పుడెవ్వరు శ్లేషకావ్యములు ద్వ్యర్థికావ్యములు వ్రాయుట లేదు ఆ ప్రస్తావనయే అనవసరము

నిఘంటువులో ఉన్నదన్నమాత్రమున కవి ఆ పదమును గ్రహింపడు కవి గ్రహించు పదము శ్రవణ సుభగముగను తన భావము ప్రకటించునదిగను ఉండును కావుననే తిక్కన కావ్యంబు సరసులైన కవుల చెవులకు నెక్కినగాని

నమ్మ డెందు పరిణతిగల్గు కవీశ్వరుండు" అని చెప్పెను దీనిలో శబ్దసారళ్యము సౌకుమార్యము ధ్వనించుచున్నవి చెవికి కూడ ప్రాధాన్యము. పింగళి సూరన 'పొసగ ముత్తెపుసరుల్ పోహళించిన లీల దమలోన దొరయు శబ్దములు గూర్చి' అని WORD HARMONY సూచించినాడు నానార్థ నిఘంటువు లుండినందువలన ఆంధ్ర మహాభారతము భాగవతము మున్నగు గొప్ప గ్రంథములను రచించిన పూర్వకవులకుగాని నేటి కవులకు గాని ఎలాటి యిబ్బంది కలుగుట లేదు నవకవులకు మాత్రము ఈ బాధ యెందుకు కలుగవలయును ?

ఒకవేళ నవకవులు నానార్థరత్నమాలాది నిఘంటువులు మునిసిపాలిటీవారి చెత్తదిబ్బల స్టోరు అని అనుకొను పక్షమున ఆ చెత్తదిబ్బలు మనము నడుచు రాజమార్గమున లేవు వానిని వెదకుకొని పోవువారికే కనపడును ఆ చెత్తదిబ్బల భారము ఎ కవియు మోయుట లేదు అందులో నవకవులు తాము మోయుచున్నామనియు భరింపలేమనియు అనుకొందురేని అది వారి భ్రాంతి

వాక్యమున కర్త కర్మ క్రియల అనుబంధానికి నవకవి విడాకులిస్తున్నాడు ఒక క్రియ మా తం నిరంకుశంగా విహరిస్తే కొందరు కళ్లు పొడుచుకోవడం ఎందుకని శ్రీ శ్రీ గారి ప్రశ్న చిన్నయసూరిగారి బాలవ్యాకరణాన్ని దండిస్తామని నవకవుల ప్రతిజ్ఞ చిన్నయసూరిగారిని విమర్శించవలసిన భాగములు వేరే ఉన్నవి అవి కర్త కర్మ క్రియలలో కాదు ఆ పని దక్షులైన పండితులు పూర్వమే చేసియున్నారు

మనుష్యులు అన్యోన్యము మాటలాడుకొనుటకు, తమ భావములను వెల్లడి చేయుటకు భాష పుట్టినది మనము వాక్యములతో మాటలాడుకొందుము ఒక వాక్యమునకు కనీసము ఒక కర్త ఒక క్రియ ఉండుట అవసరము ఈ నియమము అనుభవ జన్యమైన అక్కర వలన పుట్టినది

ఒకప్పుడు ఇద్దరు మనుష్యులు మాటలాడుకొనునప్పుడు ఒక క్రియనే ఉపయోగించవచ్చును "ఏంరా వస్తావా?" అంటే "వస్తున్నారా" అనవచ్చు

అప్పుడు కర్త తెలికగా ఊహించుకొనబడును మూడవవానిని గురించి చెప్పునప్పుడు వస్తాడురా' అని అంటే 'ఎవడురా?" అని అని రెండవవాడు ప్రశ్నించవలసి యుండును రాముడురా" అని మరల వీడు జవాబు చెప్పవలసి యుండును ఇట్టి సంశయము కాలహరణము ఇబ్బంది తొలగించుటకే ఒక వాక్యమున ఒక కర్త ఒక క్రియ అవసరమని చెప్పిరి ఈ నియమము మన భాషకే కాదు అన్ని భాషలలో నున్నది ఈ నియమమును బహిష్కరించి శ్రీ శ్రీగారి కోరిక ప్రకారము ఒక్క క్రియకే యేకచ్ఛత్రాధిపత్యము కట్టిపెట్టినయెడల, మనభాష మూగ చెవిటివారి భాషయగును ఇది క్రొత్త ఆవిష్కరణము కాదు ఒక గొప్ప సిద్ధియు కాదు

కవులకు భాషను పొదుపుచేయు గుణమున్నది కవి ఎన్ని తక్కువమాటలతో క్లిష్టాన్వయ దోషములేకుండ చెప్పగలడో, అన్ని తక్కువ మాటలతో తన భావమును వెల్లడించును అట్లు చేయలేనియెడల కవిదే దోషము ప్రకరణమును పట్టి కర్తనుగాని కర్మనుగాని ఊహించుకొనుట సులువైనయెడల వానిని పరిత్యజించును వచ్చెడువాడు ఫల్గుణు డవశ్యము గెల్తు మనంగరాదు' అని తిక్కన వ్రాసెను గెల్తుము అను క్రియ కర్మను అపేక్షించుచున్నది ఎవరిని గెల్తుము? పాండవులను తిక్కన పాండవులను అని వ్రాయలేదు ప్రకరణమునుబట్టి ఊహించుకొనవచ్చును

పూర్వము సిద్ధమైయుండినవి చక్కగ తెలుసుకొనకపోవుటచేత నవకవులకు ఇట్టివి అపూర్వసిద్ధులుగ తోచును ఇంతయేల? శ్రీ శ్రీగారు ఎంతవరకు తమ వాదమును ఆచరణలో పెట్టగలిగిరో తెలునుకొనుటకు వారు రచించిన NTRO ను ఉదాహరణముగ తీసుకొనవచ్చును. వారు తమ వాదము ప్రకారము పీఠికయంతయు క్రియలతో నింపియుండిన ఇతరులు విమర్శింప వలసిన యవసరము ఉండియుండదు. ఎలయన ఆ భాష మనుష్యులకు అర్థము కాదు శ్రీ శ్రీగారు కూడ విభక్తి విశృంఖలముగా షికారు పోజాలనందుకు సంతోషము విభక్తులులేని వాక్యము, అన్యోన్య సంబంధములేని పదసమూహముగా తోచునేగాని, భావము తెలుసుకొనుట దుర్లభము తామే అనుసరింపలేని 'తియరీ'లను ఇతరులపై

పారవేసి వారిని చికాకుపెట్టుట యెందుకా అని నా చింత అయితే దీనికొక సమర్ధనమున్నది నవకవులు, తమ కవిత్వమునకు, తమకు ఎలాటి సంబంధము లేదను నమ్మకముకలవారు కావున వారి 'థియరీ లు ఒకవంక వారిరచనలు మరొక వంక నడువవచ్చును

'కవులు స్వాతంత్ర్య దూతలు, స్వేచ్ఛా దాతలు' - నిజమే నిరంకుశాఃకవయ అనే పలుకుబడి పూర్వమునుండి వ్యాప్తిలో నున్నది అయితే ఒక్క బేదము మాత్రము కనబడుచున్నది పూర్వులది నియమబద్ధమైన స్వాతంత్ర్యము మనవారిది అరాజకమైన విశృంఖలత్వము కాళిదాసువంటి ప్రతిభాసంపన్నుడైన మహాకవికూడ ప్రాంశు లభ్యే ఫలే లోభా దుద్బాహు రివ వామన" అని అడకువచేత తన గొప్పతనమును తెలుపుకొనగా ఒకటిన్నరపేజి చక్కగా వ్రాయలేని మాబోటివారమూ దుడ్డుకర్రలెత్తుకొని బయలుదేరి నడుములు విరుగదన్నామనడము, అహంభావకవులమని కంచుగంట ప్రయోగించడము - ఇదీ ఒక నావల్టీగానే కనపడుచున్నది వారి సిద్ధులను విమర్శింతుమేని మిగులునది అహంభావమే, తక్కినది అభావమే

నవకవికి అనుకరణ అసహ్యమని వారన్నారు అనుకరణము నిస్సారమని అందరు ఒప్పుకొనతగిన విషయము కాని వీరికి మనదేశపు కవులను అనుసరించడము అనుకరించడము అసహ్యము పరదేశకవుల ననుకరించడము పరమార్థము ఈ వచనపద్యములు WALT WH TMAN పద్యముల కనుకరణము కాదని యెవరు చెప్పగలరు?

ఛందస్సుల చండశాసనానికి కాలం వెళ్లిపోయిందని శ్రీ శ్రీ గారు వ్రాసినారు ఇది కేవలం భ్రాంతి పదిసంవత్సరములకు పూర్వము భావకవి అని అనిపించుకొనుట ఒక గౌరవము నాడు భావకవులమని యనుకొన్నవారుకూడ నేడు ఆ పేరు వహించుటకు సిగ్గుపడుచున్నారు ఇప్పుడు ఆ నావెల్టీ పోయినది అంతే యీ కవుల వచన పద్యాల నావెల్టీ కూడ తెలుగుజాతి పరాయిది కానంతవరకు, తెలుగువారిహృదయమున రసజ్ఞత నశించనంతవరకు, తెలుగువారి

సాంఘిక జీవనప్రవాహమునకు గట్లుగా ఆంధ్రమహాభారతము, భాగవతము, రామాయణము జీవించి ఉండునంతవరకు, తెలుగుకవిత్వమునకు ఛందస్సునకు, విరహము కలుగదు ఎన్నిరాజ్యములు పుట్టి చచ్చినవి ? ఎందరు రాజులు గతించినారు ? ఎన్ని నాగరకతలతో మనకు సంబంధము కలిగినది ? అయినప్పటికని ఇప్పటివరకు తెలుగువారము తెలుగువారముగానే ఉన్నాము. బాగవతము చదివినప్పుడు ఒడలు పులకరింపని ఆంధ్రు డుండడు బారతము విని తలయూపని తెలుగువా డుండడు ఇవి మన జాతీయసిద్ధులు వీనిముందు తక్కిన నావెల్టీలు హనుమంతుని యెదుట కుప్పిగంతులు

నారాయణబాబుగారు తాము రచించిన వచన పద్యములను ఒకతూరి వినిపించిరి వాని యందు ఈ ఫిడేలు రాగాల డజన్ లో వలెగాక, ఉన్నతములైన బావము లుండినవి ఆయనకు ఏ పద్యమైనను చక్కగా చదువగలశక్తి కలదు ఆ పద్యములందు ఒకదానితో నొకటి పొంది పొసగని లయాఖండములు [MOSA C OF RYTHM] వినిపించినవి ఛందస్సును త్యజించితి మంటిరే వీనిలో లయాఖండములు గోచరించుటకు కారణమేమని యంటిని వానిలో ద్విపద పాదములు గీత పద్యముల తుంటలు కనబడినవి ఇవి కాంక్షితముగ పడినవని వా రనిరి

గుడిపాటి వెంకటచలంగారు రాగాలడజన్ పై అభిప్రాయము ఒక వచన పద్యమున వ్రాసిరి ఆ పద్యము చదివినప్పుడు, వీరు ఛందోబద్ధముగవచ్చు కవిత్వమును కేవలము నవత్వముకొరకు అవయవ విచ్ఛేదము చేసియుందురని నా యూహకు తట్టినది నా యూహ యధార్థము కాక పోవచ్చును ఈ నిదర్శనములు గమనింపుడు

"వేయి కన్నీటిచుక్కల నేడిగాను
చెవుల ఘోషించి కలవర పరచ గలవు '

ఇవి రెండును పరిపూర్ణముగ తేటగీతి పాదములు

'వాడి అయినట్టి కొనగోళ్లతోడ (నొక్కి)
చురుకుమనునట్లు పెట్టిన (షోకులాడి)

మొదటిపాథమున 'నొక్కి' అనియు రెండవపాదమున షోకులాడి' అనియు చేర్చిన తేటగీతి పాదము లగును

'నూరు వెక్కిరింపుల నాలికల్ (గ వెలికి)
దిక్కుదిక్కుల పకపకల్ (తేజరిల్ల)"

ఈ పాదములలో మొదటిదానికి 'గ వెలికి' అనియు రెండవదానికి తేజరిల్ల' అనియు చేర్చిన తేటగీతి పాదము లగును

వీరి హృదయములలో దేవుడు ప్రసాదించిన లయాశక్తి ఉన్నది నవత్వముకొరకు సహజశక్తిని అడగ్రతొక్కి పరిపూర్ణమైన ఆకారమునందు అవయవములు భేదించి వీరు సాధించిన ఆ మహాప్రయోజనమేది ? ఈ అపకారము వారికే కాదు, లోకమునకుకూడ ఒక చిత్రమును యిరువయి తుంటలుగ కత్తిరించి చీట్లప్యాకీ కలిపినట్లుకలిపి మరల మేజాపై నెరిపిన ఒక అసంబద్ధమైన [D S-HARMON US] చిత్రము కనబడును. ఈ విచిత్రసౌందర్యమేనా ఛందోవైకల్యము నందు వీరు ఆశించునది ?

ఈ నవకవులు రచించు వచనపు తుంటలకు పద్యములని ఎట్లు పేరువచ్చినది ? జామెట్రి వలన, ప్రోసుపేరాను లయిను ప్రకారము కత్తిరించి వివిధ పరిమితులుగా తుంటలుచేసి, ఒకదాని క్రింద నొకటి అతికించిన ప్రోసు, పొయిట్రీగా మారును ఇది జామెట్రి కవిత్వము ఈ కవిత్వమున, తిక్కన చెప్పినట్లు చెవి ప్రధానముకాదు, కన్ను ప్రధానము ఇది లను భంగము వలన గద్యమూ కదు ఛందోవిరహితమై నందున పద్యమూ కాదు; త్రిశంకునివలె నడుమంతరమున వ్రేలాడుచు రెంటికిం జెడిన రేవడ యైనది

ఎంతకాలమైనను తెలుగుకవిత్వమునకు ఆ వృత్తాలు ఆ సీసగీతపద్యములేనా వేరేమీ గతి లేదాయని యందురేని కలదని నేను మనవి చేయుచున్నాను క్రొత్త ఛందస్సులు ఆవిష్కరించుకొని కవిత్వము వ్రాయవచ్చును అవి శ్రవణసుఖముగా నున్నయెడల నిలిచియుండును. ప్రస్తారము వలన ఎన్ని వృత్తములు పుట్టలేదు ? అవి అన్నీ మనచెవికి రుచించుట లేదు రుచించినవి మాత్రము నిలిచియున్నవి

ఆడినదల్లా ఆటకాదు పాడినదల్లా పాటకాదు శిల్పమునకు సంయమనము (RESTRA NT) అవసరము వీనియందు అటువంటిది కన్పించదు

శ్రీ శ్రీగారు నవకవులు సాధించిన మహాసిద్ధియని తెలుగుదేశమునకు శిఫారసు చేసిన ఈ పిడేలు రాగాల డజన్‌నుగురించి రెండుమాటలు ఆ పుస్తకము చదివినప్పుడు నాకు కలిగిన భావమిది : యౌవన ప్రాదుర్భావ సమయమున కామోద్రిక్తుడయి కామార్తాహి ప్రకృతి కృపణా చేతనా చేతనేషు" అను కాళిదాసు సూక్తికి ఉదాహరణప్రాయుడయి, వలపు పస్తులతో నవసి మతి చెడిన యువకుని ఉన్మత్తప్రలాపములు (MAD RAV NGS) గా నాకు స్ఫురించినది బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు చెప్పినట్లు ఒక్క (CLEVERNESS) ఉన్నంతనే కవిత్వము కాదు

—"తెలుగుకవితలో క్రొత్త తెన్నులు"
కవికోకిల గ్రంథావళి : వ్యాసములు—4.

## బుర్రా వెంకట సుబ్రహ్మణ్యం

### త్రివేణి' ఆంగ్లపత్రికలో బుర్రా వి సుబ్రహ్మణ్యం సమీక్ష వ్యాసం

This small volume of prose-poems is perhaps the cleverest thing in modern Telugu literature after *Kanyasulkam* I mean naturally, that it is the cleverest thing in modern Telugu literature after the clever side of *Kanyasulkam,* for, to be frank, *Kanyasulkam* is the most uneven piece of

art that genius ever perpertrated There are portions of *Kanyasulkam* as the drama develops mechanically which make one not just yawn but weep The authentic voice of Gireesam disappears and Madhuravani somersaults into maud in sentimentality In this unbelievable transmutation of the soul of a prostitute *Kanyasulkam* descends to the level of dramas l ke *Chintamani* and *Vipranarayana* so dear to the pub ic of Mr Sthanam Narasimharao *Kanyasulkam* should have been l ke *Kubla Khai* an unfinished piece That it happens to be a completed drama is a tragedy of some magnitude to Telugu letters for it cannot be denied even by its most ardent admirers that the latter part of it is

Like some poor night-related guest
That may not rude y be dismist ,
Yet hath outstayed his welcome while
And tells the jest without the smile

*Phidelu Raagala Dazan* is all of a piece It contains twelve poems each of which is a masterp ece of fine observation felicity of expression and perfect execution Whether the poet writes about the season of spring in the City of Madras

I have heard that the season of spring
has visited the City of Madras
Where is this season of spring ?
I do not hear the songs of birds
I only hear the endless uproar of trams and buses
Is it really the spring ?

But, ook ,
In letters that pierce the eye
In front of Chellaram s shop
Is advertised
The Annual Spring Clearance
*Surely it must be that season of Spring*

Or, whether he compares the traffic policeman to a girl dancing the *Bharta Natya,* or moon ight in China Bazaar to *Badam-kheer,* he is always attempting to be clever and nearly always succeeding The majority of the poems deal with sophisticated life in Madras with telephone calls which lead to taxi rides which do not end there Prostitutes in half-dark

recesses of their Mint Street homes ladies in gold-bordered Mysore sarees with hand-bags and high heeled shoes and certa n unfortunate Anglo-Indian girls who as consideration for a nine-annas seat in a picture-house yield their surface for the adventure of exploration -all flit across the poems whatever the title or the theme of the poem wherein they occur There are rare places just one or two where the verses cease to be merely clever, and attain the serious dignity of poetry But generally speaking cleverness is the only claim of these poems to be noticed Like all modern st verse in other lands at least in the first stages of rebellion these verses too exhibit an anxiety to eschew all conventional metaphors similes and poetic associat ons in order to replace them by the material that modern life supplies When T S E iot discarded Wordsworth s description of a quiet evening sky as a nun breathless with adoration and ta ked in his turn of a patient etherised upon the table his merit lay, not so much in any immediate effectiveness of his own imagery as in his stern refusal to trade in imagery which was outworn and which was ceasing to have any intrinsic emotional value in modern life If poetry in the days of Mathew Arnold was in Arnold s phrase the *Criticism of Life* modernist poetry in the early stages had no creative value of its own but had value only so far as it could be construed as a species of *Criticism of the poetry that just went before* In England for instance this negative achievement was all that it could lay claim to and was perhaps content to claim for quite a long time But when something more positive is sought and achieved standardization begins standardization of rhythm standardization of rhyme-schemes and even standardization of imagery It is too early therefore to start hoping with the slender evidence in hand of the verses here reviewed that a new moment in Telugu Poetry is on the horizon and that the illusory dawn heralded by Messrs Krishna Sastry and Viswanatha Satyanarayana and men of their ilk has died out It may even be that in the succeeding decades poetry must yield outright to prose There is however, a valient band of pioneers in young poets of real merit like Mr Srirangam Srinivasa Rao and Mr Mallavarapu Visweswara Rao struggling to do something different but their hour has not yet struck Meanwhile Mr Pattabhi Rama Reddi may congratulate himself on his own peculiar significance in this context But, before he can achieve anything really worth while he must shed his cleverness

-BURRA V SUBRAHMANYAM

(TRIVENI quarterly)

July-Sep 1940 pages 97-99)

# నోరి నరసింహశాస్త్రి

ప్రత్యక్షశాస్త్రాలు మనము ఇంత వృద్ధిచేసినాము మనకు పూర్వులకు లేని కొత్తశక్తి ఉన్నది కవిత్వములోనూ కళలలోనూ మాత్రము ఎందుకు పూర్వులను ఒక్కసారిగా మించలేము ? భూమిమీదనూ ఆకాశంమీదనూ పూర్వులు ఎగరలేని వేగముతో కుంటివాళ్లనుకూడా పరుగులెత్తిస్తున్న మనము మన కవిత్వముతోనూ కళలతోనూ పూర్వులకు సాధ్యము కాని రీతులతో వాళ్లకు తెలియని వేగముతో, ప్రజలహృదయాలను పరుగెత్తించలేమా ? ప్రజల ఆత్మలను నూతనాకాశ వీధులలో విహారాలు చేయించలేమా ? ప్రత్యక్ష విషయజ్ఞానము వృద్ధి ఐనట్లుగానే ఒక్కసారిగా కవిత్వమూ, కళలూ ఎందుకు వృద్ధిచేయలేము ? ఈవిధమైన ఆవేదన - కాక, 'అహం భావము' అనవచ్చును - నవ్యకవులను బాధిస్తున్నది మన పరాభి 'ఫిడేలు రాగాల డజను'లో అందుకనే, తాను అహంభావ కవిని అని చెప్పుకున్నాడు ULTRA MODERNS అనే పదమును మనస్సులో ఉంచుకొని వీరిని అతి నవ్యకవులు' అందామనుకున్నాను కాని, ఆలోచించగా అహంభావ కవులు అనేపదము ఎక్కువ సరసముగాను సజీవముగాను ఉన్నదని అంగీకరించాను కాని వారిని అపహసించుటకు మాత్రము కాదు

ఫిడేలు దేశీయమైన జంత్రము కాదు, పాశ్చాత్యులది ఫిడేలుమీద గాయకులు కర్ణాటక సంగీతముకూడా చక్కగా పలికిస్తున్నారు దానిమీద మన సంగీతము పలికించడము సాహసకృత్యమనీ అనుచితమనీ సంగీత విద్వాంసులుగాని సామాన్యజనులుగాని అనుకోవడం లేదు ఇక కవిత్వసాధనాల్లోకి ఫిడేలువంటి పాశ్చాత్యసాధనాలు తీసుకువస్తే పండితులకూ, పాఠకులకూ తగాదా ఎందుకు ? గాయకుల కిచ్చిన స్వాతంత్ర్యము కవుల కియ్యకూడదా ? - ఈవిధంగా సూచించినాడు ఫిడేలు రాగం' అనే చివరకావ్యంలోనూ, కావ్యసంపుటి నామకరణంలోనూ, కవి చివర కావ్యములో ఫిడేలు తీగధ్వనిని అనుకరించడానికి పదాలకు సామాన్యవర్ణక్రమం మార్చి అచ్చువేసినాడు . .

. శ్రీ శ్రీ 'ఇంట్రో' వాక్యాలలో ఎక్కువభాగం సత్యమేనని సరసులంతా ఒప్పుకుంటారు అయితే ఇందులో ముఖ్యంగా 'విచిత్రమే సౌందర్యం . సౌందర్యమే విచిత్రం .' అన్న వాక్యాలలో సత్యమెంత?

–['ప్రతిభ' పత్రిక, జూలై, 1940;
"అహంభావ' కవిత్వధోరణి–చిత్ర కవిత్వము"
అనే వ్యాసంనుండి.]



# శ్రీపాద గోపాలకృష్ణ మూర్తి

గ్రాంధికభాషా శిష్టవ్యవహారికమూ మాత్రమేకాక వాడుకలోవున్న ఏ జాతీయమైనాసరే కావ్యరచనకి పనికివస్తుందని నిరూపించడానికని నండూరి సుబ్బారావుగారు యెంకిపాటలు రాస్తే, పద్యాలూ పాటలూ మాత్రమేకాక ఏ వరస అయినాసరే కవిత్వానికి వాహకము కాగలదని నిరూపించడానికి 'పరాభి' గారు ఫిడేలు రాగాల డజన్' రచించారు ఇందులో పన్నెండు ఖండా లున్నవి మొట్టమొదటి ఖండము 'ఆత్మకథ'లో తమ ఆదర్శాల్ని చెప్పుకొచ్చారు నా ఈ వచనపద్యాలనే దుడ్డుకర్రల్తో పద్యాల నడుముల్ విరగదంతాను' అనే ప్రతిజ్ఞను గమనించినప్పుడు విచిత్రమైన ఆ ఆశయానికి రిచ్చపడతాము 'చిన్నయ్‌సూరి బాలవ్యాకరణాన్ని చాల దండిస్తాను' అని చదివి, ఈయన లేఖిని సాధనం మాత్రమే కాదు; ఆయుధంకూడా కాబోలు, అనుకొంటాము 'నా యిష్టం వచ్చినట్లు జేస్తాను'తో వీరియత్నం పూర్తిగా తిరుగుబాటే ననిపిస్తుంది అనుసరిస్తాను నవీన పంథా' అనగానే వీరిది తిరుగుబాటు కాదనీ, అందులో కొత్తరకపు కట్టుబాటుకూడా ఉన్నది కాబోలు అనీ ఆశ పుడుతుంది

అవును ఫిడేలు రాగాల డజన్' పరిస్తే తిరుగుబాటూ కొత్తరకపు కట్టుబాటూ కూడా కనిపిస్తాయి తిరుగుబాటులోని ప్రధానపు పెత్తుని 'ఆత్మకథ'లో కవిగారే చెప్పుకున్నారు 'ఈ నా వచన పద్యాలనే దుడ్డుకర్రల్తో పద్యాల

నడుముల్ విరగదంతాను' అని ఈ పుస్తకములోని పన్నెండు ఖండాల్లోనూ మొత్తపునడక ఫక్తు వచనపు నడక పంక్తులన్నీ గాలిస్తే, అన్ని ఖండాల్లోనూ చేరి

'కడగంటి చూపయిన పరపరోసీ శశీ'
మిలియను జనములు మిణుగురుబువ్వల'
'గాంధీటోపీ జవ్హార్ జాకెట్'

వంటి పంక్తులు పదికన్నా ఎక్కువలేవు ప్రత్యేకంగా యత్నించి పూర్తిగా విరగదన్నేరు పద్యగతిని కవిగారు ఎక్కడైనా ఒక్క చోట తమ రచన నీ గుండ్రని మోమందపుతరహా సయితము' అనీ, వినూతన పద్యప్రేమికులు మహాకాముకలు అనీ గతి నలవర్చుకున్నట్లుగాని కనబడితే వెంటనే, 'మాకేమీ నచ్చనే నచ్చదు, అన్యోన్యమగు దంపతులు కూడ' లాంటి వచనపు దడ్డు కర్రల్తో ఆగతిని విరగగొట్టి పారేశారు పద్యానికి జీవము గతిమాత్రమే అని నమ్మి గతిని పూర్తిగా విరిచిపారేశి వీరు తమ ప్రజ్ఞని నిలబెట్టుకొన్నారు కాని యతిప్రాసలు మాత్రము ఆకాశంలో చుక్కల్లాగా వీరి ఫిడేలు రాగాలన్నిటిలోనూ మెరుస్తున్నాయి పద్యత్వము యతిప్రాసల్లోనే నిలిచి వుంటుందని నమ్మడము చేతనే కాబోలు తమ రచనలకి వచన పద్యా' అని పేరు పెట్టుకొన్నారు

చిన్నయ్‌సూరి బాలవ్యాకరణాన్ని చాల దండిస్తాను' అన్నది వీరి తిరుగుబాట్లులో రెండో ప్రతిజ్ఞ వ్యాకరణ సమ్మతమైన పలురంగు వలువలుగట్టుకొని లలనలు ప్రదర్శించుకొనుచున్నారు, తొమ్మిదణాల సినిమా టిక్కటునకు తమ బహిర్దేహము మీద యాత్ర చేయుటకు హక్కునిచ్చే(?) కొంద రాంగ్లో ఇండియన్ అభాగినులు, 'చిటపట చిటపట చినుకులు పడుచున్నవి కడు నిడిచి నది మనుష్యుల నడక, వంటి పంక్తులు చాలాచాలా వాడినప్పటికీ, 'ఎవర్నని' 'అతగాడు' దోస్తాను', వొత్తుకుంటూ' నాగరీకులు లాంటి వాడుక మాటలు చివరవరకూ వాడుతూ గ్రాంథికసూత్రాల్ని పాటించక పోవడముతో ఊరుకోక, ఉపజ్ఞ నాకున్ లేదని 'ప్రదర్శనము చేతన్ స్థంభీభూతంబయిన', 'పోసినట్లుం గురిసేటి', 'లోనన్ మాట్లాడుటకు' అని కశితో నకారపు పొల్లును పదేపదే ప్రయోగించి వ్యాకరణాన్ని

ఉడికించి తల్రవాల్చే పరిగిస్తున్నా, పరిమార్చుట, వినుబడలేదే, అధికమగుచుంది' అనే కృతకప్రయోగాల్తో వెనక్కి తిరిగి వెళ్లిపోయే వ్యాకరణాన్ని వెక్కిరించి మరీ వదిలారు మొత్తంగా రచనలన్నిటినీ పరికిస్తే, నా యిష్టం వచ్చినట్లు జేస్తాను' అని ఈయన ప్రధమఖండములో చెప్పినది కూడా జ్ఞాపకము వస్తుంది భావకవిని మాత్రము కాన్నే పోగా, వయిటవేసులోకీ తిరుగుచుంది' హంగ్రీకనులు', మేమాసము మూత్తో క్యాజ్జేయ మొదలైన కుదిరీకుదరని స్వతంత్రపు ప్రయోగాలు బ్లడీ' హయిహీలు యాన రుమాన్టిక్గా వంటి ఇంగ్లీషు మాటలూ, గరం గమ్మత్ కులాసా నాజూకు వంటి హిందూస్థానీ పదాలూ పరిష్వంగ గ్రస్తము చంద్రాగమనము సత్యనారాయణకృత రామాయణము వంటి సంస్కృత సమాసాలు మాత్రమే కాక విశాఖా గోదావరీ, గుంటూరూ, నెల్లూరూ మాండలికాలు కూడా ధరాళంగా వాడడం ఇష్టం వచ్చినట్లు చెయ్యడమూ కాకపోతే మరేమిటీ? జర్మనీ యుద్ధానంతరము యూరోపులో బయల్దేరిన నియమభంగ చాపల్యము కూడా వీరి రచనలలో, 20 అయిటమ్సు అంచి ఇన్గ్లీష్టానిని నన్ నుస్టేపట్ట వద్ దని గద్దిన్చినా కూడ వంటి ప్రయోగాల్లో కనపడుతూంది ఉచ్చారణని బట్టి వర్ణక్రమము మరాలని సూచించడానికి కాబోలు చైనా, పైన, సౌందర్యము, మౌనము వంటి ఐత్వ ఔత్వ పదాల్ని చయినా పయిన సవుందర్యము అని విరిచేశారు 'త్రుప్తీ హ్రుదయమూ అని ఎందుకు రాయలేదా అని అనిపించింది నాకు ఫిడేలు రాగాల డజన్' అనే పేరులో అట్టమీద ఫిడేలు కి బదులు ఫిడేలుబొమ్మ వేయడమూ అంకితములో మృణాళినికి కాదు కళ్యాణికి కాదు ఇరువురికి అని ఆలోచన చూపించడమూ కూడా వీరి స్వంత పద్ధతికి ఉదాహరణలే ఈ పద్ధతిని బి వి సింగరాచార్యులుగా రిలాగ,

ఆ మాసిన నల్ల మసిష్టం
లో వచ్చి మెల్లగా
గదిలో light ను తగ్గిస్తే
ఎట్లాగుంటుందో బోలో
ఈ beauty worshipper కి'

అని ఎభాషలోని పదాలు ఆ భాషలోనే వేసి, శ్రీ శ్రీ చెప్పినట్లు

న-న-న-నత్తి మాటలు కూడా

మ-మ-మ-మన కవిత్వం ఉండొచ్చు'

గనుక కొన్ని నత్తిమాటలు కూడా చేర్చివుంటే, ఇంత చిన్నపుస్తకంలో అన్ని మార్పులు చెయ్యగలిగిన పరాభిగారి జాగ్రత్త ఇంకా నిండుగా ఉండియుండును

మనకి సాధారణంగా తెలిసిన కవితాసామగ్రిని వాడక అంతా సరికొత్తసరుకు వాడడము 'పరాభి' గారి తిరుగుబాటు మూడోయెత్తు బందరు వీధుల్లో బేహారి అమ్మిన కవితాసామగ్రి, కపురంపుం బలుకుల్ తుషారజలముల్ కల్వాల్, పికధ్వాన మచ్చపు బంగారము జ్యోత్స్నల్ చల్లగాలుల్' కూడా ఈయన నాగరిక దృష్టికి నచ్చనే నచ్చవు బాదంఖీరూ, డీలక్సు కుషన్ సోఫాసనమూ, అమృతాంజనపు పూతా, కనిమారాలో టీపార్టీ - ఇవీ కవికోరే సుఖానుబవాలు కామాక్షి స్పర్శవల్ల 'పరాభి'కి కలిగేది గగుర్పాటు కాదు, 'అపూర్వంబగు మజా · మైమరపు కలగదు; 'నోరూరుతుంది' లీల్ అధరాలలో సుధారసము కాదు ఆయనకు గోచరించేది; జహంగీరు తీపు బ్రహ్మానందమూ కాదు ఆయనకు కలిగేది బలే సరదా, బలే గమ్మత్తు· నయనోత్సవమూ, పులకరింతలూ ప్రాణులకు కాదాయన ఆరోపించేది; ప్రాణంలేని కామాక్షి కోకకి, కర్ణపేయత్వమూ, కీరవాణులూ, హిమాలయమూ, మినుకుమినుకుమనే దీపికలూ, ముఖచంద్రుడూ వీరి కావ్య ప్రపంచంలో తొంగిచూస్తున్నాయే అంటే అది యతిప్రాసల్ని సర్దుబాటు చెయ్యడానికి మాత్రమేకాని అంతకుమించిన పనికి కాదు వీరు సృష్టించే పాత్రలకు కూడ విచిత్రంబగు భావాలు కలవు'

యెలక్ట్రిక్కు దీపాలకుమల్లే ఈ మూన్లయిటుకూడా స్విచ్చుండిన ఎం బాగుండును అని 'పరాభి' అంటే 'జిలేబీలాగా ఈ చంద్రచక్రాన్ని మింగివేయాలనిపిస్తున్నది' అంటుంది కామాక్షి నాయగ్రోడ్డునపోయే నవ్యస్త్రీ యందం శాఖాహారుడగు పరాభికి మాంసాహారం మీదికి బుద్ధి పోనిచ్చిందట భువి కార్చిన కన్నీటి చుక్కల్లాగ తారకలు గగనములో రగులుచున్నవట మిలియను జనములు మిణుగురుబుర్వ్వల కొరుకుచున్నటులున్నదట మేఘధ్వని లీల 'నాతో సమానమయిన లావుం గల్గి దిట్టంగా జంతువట్లుంటుం'దట 'అమెరికన్ కార్లు

ఉబ్బుకొనివచ్చే సెక్సుఅప్పీలు'తో 'అమెరికన్ స్త్రీలరకం వున్న'వట!ఇవన్నీ చూస్తే 'ఇంట్రో'లో శ్రీ శ్రీ ఉద్ఘాటించిన 'విచిత్రమే సౌందర్యం సౌందర్యమే విచిత్రం.' అన్న సూత్రాన్నే గాఢంగా నమ్మి 'పరాభి' గారు ప్రతీ అడుగులోనూ కశితో ఈ విచిత్రాన్నే సాధించారా అనిపిస్తుంది అంత మాత్రమే అయితే ఈయన ప్రయత్నమంతా సంప్రదాయాల విరగబాటు కోసమే అని నిశ్చయించవచ్చును

కాని వీరి విచిత్రంబగు బావాలనన్నిటినీ పేర్చుకుని విజ్ఞాన శాస్త్రజ్ఞుడిలాగ వాటిని పరిశీలిస్తే చిత్రమైన ఒక కట్టుబాటు గోచరిస్తుంది. ఈ కట్టుబాటే వీరిని ఆధునిక కవికుమారులలో చేరుస్తుందని కూడా అంటాను నేను ఎమిటీ కట్టుబాటు అంటారా? మనవి చేస్తున్నా.

వీరి కవితాదృష్టి అంతా నగరిక (urban) దృష్టి మద్రాసు నగరంలో మందయానలూ, మలయానిలమూ, కోకిలాగానమూ ఎక్కడనించి వస్తాయి-బాటా హయిహీలు యానలూ, బంగాళాఖాతం మీదినుండి వచ్చేగాలి, విధివిరామంలేని బస్సు ట్రాములగోలా తప్ప? మరి అనుభవాన్ని బట్టి రచించే మద్రాసుకవికి ఏది కవితాసామాగ్రి కాగలదు? రోజల్లా ఎ ఆఫీసులోనో అకవుంట్లతో అనంతమగు యుద్ధంసాగించే నగరీకుడికి, డ్రాయింగురూములో గోడకి తగిలించే చిత్రాలూ, నాగరికకన్యల పవుడర్ పూయబడిన ముఖాలూ, సోయగముకల అమెరికన్ కార్లూ, రవికందున గుచ్చబడిన లేడీస్ పార్కర్కలంబులూ, కమానులతో డోములతోనున్న ముఘల్ స్టయిలు దేహంపు కట్టూ కాక ఆకర్షించి పట్టగల సౌందర్యమేముంటుంది? అందుకే 'పరాభి'గారు తగిలింపబడియున్నది జాబిల్లి చయినాబజారు గగనములోన' పయిన అనీ క్వీన్మేరీసులోని కీరవాణుల పొడి పాము కొనబడిన ముఖాలు చూస్తూవుంటే నోరూరుతుం'దనీ 'యమెరికన్ కార్లూ ఉబ్బుకొనివచ్చే సెక్సు అపీలుతో అమెరికన్ స్త్రీలరకం వున్నవి' అనీ, 'రవికయందు గ్రుచ్చబడి' స్వర్గద్వయం మధ్య నూగాడుచున్న, ఆ స్త్రీ వక్షముమీది, లేడీస్ పార్కర్కలంబుగానున్న నేను నా రక్తాన్నే సిరాగా పోస్తాను' అనీ ముఘల్ స్టయిలు దేహంపుకట్టు జూచుట నాకు అమృతాంజనం పూసినట్లుంది' అనీ రాశారు నగరములో రంగులన్నీ ఉన్నప్పటికీ, పల్లెపట్టులోవలె పచ్చని వృక్షరాజములూ,

నక్షత్ర ఖచిత నీలాకాశ సౌందర్యమూ, వర్ణకుసుమావృత లతా నికుంజములూ, శాద్వలస్థలుల నడుమ మెల్లగా సాగిపోవు నదీనదములూ, సంధ్యాబుణాంబులూ నిర్మల స్థితిలో గుర్తించుటకు వీలుండదు కనుక నగరీకకవికి రంగులతో కంటే చలనముతోనే ఎక్కువ పరిచయము కాబట్టి అతని కావ్యాలంకార సామగ్రిలో భ్రాంతిమంతమూ ఉత్ప్రేక్షా రూపకము కంటే స్వభావోక్తే ఎక్కువగా కనపడుతుంది 'పిచ్చి ఉబలాటంతో మనుష్యులు, మోటార్లు, ప్రాణాలు, యంత్రాలు భుజాలు రాసుకొంటూ ఉన్మాదంతో త్రోసుకొంటూ నొత్తుకుంటూ పోతున్న వట 'పలురంగు వలువలగట్టుకొని లలనలు ప్రదర్శించుకుంటున్నారట మరీనా లో మర్యాదస్థులు గూడ అంగళ్లందున కళ్లకు అగపడిన వరండాలందున తమ దుస్తులు తడుస్తాయని హొదుక్కొనుచున్నా'రట నీళ్ళు పారుచుండే వీధుల్లో జలాంచలమును ఇరువంకల విరజిమ్ముచు బస్సులు మాత్రము బుస్సని పోతున్నవట చల్లారామ్సు షాపుముందు వసంతకాలంపు టఖండ అమ్మకాలని అడ్వర్టయిజు చేయబడి' యుండడాన్ని బట్టి (చెట్లు చిగిర్పడమునుబట్టి కాదు ) మద్రాసు సిటీలోకి వసంతర్తువు వచ్చియుండాలట స్వభావోక్తిని పట్టి యిచ్చేస్తుంది ఈ ఉదాహరణ చూడండి ఉడతలు ఎలుకలు మిడతలు చచ్చిపడియున్న చవిటికాల్వలనీరు పొంగి, మురుగు గబ్బుగల గాలి వడితోడ చిటపట చినుకులు పడుచున్నవట పరాభి'గారి వర్ణనలు చాలమట్టుకు యధార్థమాత్ర వర్ణనలే

అయితే ఈ ఫొటోగ్రాఫుల మధ్యన అక్కడక్కడ కవిగారి కల్పనని చూపించగల పెన్సిలు స్కెచెస్ కూడా కనబడక పోలేదు సగం కాంతి సగం చీకటిగల యిండ్లలోపల భోగంచానలు ఫ్యాన్సీమార్కెట్లోని జపాన్ సరుకుల్లా మవునంగా కూర్చొనున్నారట మద్రాసుపట్టణపు టశాంతంలో నవ్యస్త్రీమీద కళ్లు నిల్పుట డీలక్సు కుషన్ సోఫాలమీద కూలబడినట్లుంటుందట నవ్యస్త్రీ కన్నులు క్రాస్వర్డు పజిల్సులాగున్నవట ఆమె చేతులు బిగ్‌బ్రాకెట్లట వీటిలో కవి మానసమేకాని హృదయమంతగా బింబించడము లేదు ఎట్లు బింబించును? వెండిరూపాయ ఘలంఘలా శ్రావ్యసంగీతము కర్ణపేయముగా కర్ణాలలోనూ గుండియలందు గూడ ముఖరించుచున్నదాయెను మరి వేరు సౌందర్యమెట్లు ప్రవేశించగలదీ నగరీకుని గుండెలోనికి?

రోడ్డు దాటటానికి వేచియుండే రెండు మూడు నిముషాల్లోనూ మద్రాసు వాసునికి గోచరించే అపూర్వదృశ్యం ఇది - చూడండిః

నటరాట్టులాగా నతండుకూడ
మృత్యుంజయ నృత్యంబును
సల్పుచుంటాడు సతతము
బల్బు హారన్ల తాళంతోడి
యలక్ట్రిక్కు హారన్ల రాగానికిన్ని
మోటారు సయికిళ్ళ మృదంగానికినీ
అనుగుణ్యంగా నర్తిస్తుంటాడు
తటాల్మని ఇటూ అటూ తిరుగుచు
హస్తాల నందమ్ముగ ద్రిప్పుచు

ఇందులోనూ వైచిత్రియే.

అయితే మద్రాసువాడయేది, న్యూయార్కులో స్కైస్క్రేపరు వాసుడయ్యేది మానవుడన్నవాణ్ణి ఆకర్షించి లాగేది ఒకటున్నది వెండిరూపాయ ఘలంఘలలూ, అమెరికన్ కార్ల సోయగమూ, అమృతాంజనపు ఫూతా దానిదగ్గర తీసికట్టు

దాని బంగారు గంటల చిరుసంగీతము మద్రాసు వాసి గుండెలోకూడా మార్మోగుతుంది దానికి నగరీకకవి జవాబేమిటి? అందులో అతని అంతరాంతరాలు పెల్లగిలి తీరాలి పెల్లగిలాయి కూడాను చూడండి అంకితములోనే మృణాళినికి, కాదు కల్యాణికి; కాదు ఇర్వురికి, అని తటపటాయించినాడు 'ఆ స్త్రీ హస్తములోని హ్యాండుబ్యాగయ్యున్న నేను ఎం బాగుండును అంటున్నాడు తడిసిన ఎనాద్దాని పయ్యంటా, జాతికన్నయ రొమ్మూ చూస్తూ చూస్తూ తన్మయుడైనాడు సహాధ్యాయిని సీతా, లీలా కామాక్షీ మృణాళినీ, కళ్యాణి (మిసెస్ మాధ్యూసో)?; - ఇందరూ చాలక, మింటుస్ట్రీటు ప్రవేశించి అక్కడికివచ్చే అన్ని విధాల మనుష్యుల

మూకని చూచి, వేదాంతిఅయి కవిత్వం చెపుతున్నాడు చూడండి ఇంతవరకూ పెట్టుకున్న నియమాలు పటాపంచలై పోయి, వచన పద్యం నదీప్రవాహమై పోయింది

'అంతా బూటకం అంతా నాటకం
గొప్ప అబద్ధం పూజారి యబద్ధం
పరపురుషునిజూచి తలవాల్చే
పతివ్రత సతీత్వ మబద్ధం
యోగులబద్ధం అందరూ అబద్ధం సర్వమబద్ధం
కానీ నీవు మటుకు ఓ భోగందానా
ముసుగులేని నిష్ఠురమగు నిజానివి'

కదామరి నగరీక అహంబావకవిచేత గేయకవిత్వంకూడా చెప్పించింది పరాభిగారి ఉపజ్ఞకి గొప్ప ఉదాహరణం 'కామాక్షికోక ప్రాణంలేని కోకకి కామాక్షి నగ్నాంగమ్మునుచూపి ప్రాణం తెప్పించారు శ్రోణీవక్షోపీరభూముల్ను డయిరక్టుగా ఆక్రమించి పులకరించిపోయిందట కోక ఇక విద్యార్థుల్, దొంగలు, త్రాగుబోతులు లీడర్లు, ప్లీడర్లు, పూజారులు జారులుమాట చెప్పేదేమిటి?

నగరీక కవి సందేశము వినండి
'నీవు మటుకు ఓ బోగందాన
నీడ పడనటువంటి నిర్మలమగు నిజానివి'

–[కిన్నెర' పత్రిక, 1948 నవంబరు; 'పరాభి'
(సంప్రదాయాలమీద ఆధునిక కవుల తిరుగుబాటు)]

ఇదే శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు 20 ఏళ్ళ అనంతరం 1963 డిసెంబరు 'భారతి'లో అర్ధశతాబ్దపు ఆంధ్రకవిత్వము నవ్యాధునికులు అనే ధారావాహి ని శీర్షికక్రింద మళ్ళీ 'పరాభి'ని గూర్చి కొంత ఆ పాతదానితో మరికొంత కొత్తదీ కలిపి ఇట్లా వ్రాశారు:

వీరందరూ పద్యాన్నివదలి స్వేచ్ఛారీతినీ, మాత్రాచ్ఛందాల్నీ పట్టి రచించారు తిక్కవరపు పట్టాభిరామరెడ్డిగారు యత్నించి నా వచనపద్యాలనే దుడ్డుకర్రతో పద్యాలనడుములు విరగదంతాను' అన్నారు అయితే వీరికి సమలయ మీద కోపమున్నట్లు లేదు బంగాళీ పాటల వరుసలు కాబోలు కొత్తగా నడిచేపాటలు వీరు చాలా వ్రాశారు (ఇవి 'కైత నాద్వైత అన్నవారి వ్రాతప్రతిలోనివి ఈ పరిచయవ్యాసపూర్ణతకు లోభించి వారి యుపేక్ష ననురోధిస్తూ కొన్ని ఇస్తున్నాను.) అంత్యప్రాసలు వీటి ప్రత్యేకపు టందము నాయికల భేదములు వీటి వస్తువు

'ప్రియుని గలయుకోరిక
లాగగ సుడి రీతిని
రయమున నభిసారిక
పోవు విజన వీధిని
సంతోషితాత్మ స్వాధీనపతిక
రమణీయ నవ్య లావణ్యలతిక'
'విదియరాతిరి జాబిల్లి
విధముగ కడు సన్నగిల్లి
తగ్గియుండ తనూవల్లి'
'విడిచి ప్రణయకోపము
సఖీ
చంద్రముఖీ నీదు
నవ్వుమోము జూపుము'
'పుడమియంత పుష్యమాస
రాత్రకాలిక
శీతమం దణంగియుంది
శవము పోలిక' -

శ్రీ శ్రీ ప్రాసక్రీడలలో

తురాయికంటె ఆ
కురాయికంటె కీ
చురాయికంటె హిమాంశురాయి గొప్పవాడు-' లోలాగ ప్రాసలు క్రీడకోసమే ప్రవేశిస్తాయిగాని అర్థాన్ని సాగించవు పరాభిగారి ప్రాసక్రీడలలో అర్థము ఇరుకున పడదు

రా శ్రవణము
లా జీవనము
తో జాంగలము
నా జీవనము అంటారీయన లాఘవము పాలపై నురుగులాగ పైపైనే కాని, లోతులలో ఉండదు వీరి రచనలలో

దేవా
నీ సేవా శ్రీనీవా?
నీ చిత్తమందు గ్రావా
మయ భావార్పిడ వేలర?
నన్నేలర?' అంటారు ఈ క్రీడలలో అందము సాధించా రీయన శ్రీ శ్రీకంటె జాస్తిగా

కురుస్తూంది కురుస్తూంది
కుంభవర్షం కురుస్తూంది
గగనమే దగ్గరకు వచ్చి
బిగ్గరగా అరుస్తూంది'

'ఎగురగొట్టబడి
విడిన జుట్టుముడి
నల్లగట్టులాగు గనబట్టు

గిరుల నట్టనడి
దుముకునట్టి వడి
గలిగి అట్టహాస్యనది పుట్టు
రగులు నాట్యమాడ నటరాట్టు

సఖి నీ కలహా
స మాలిక లహో

వసంత కుసుమా
ల సంతలు సుమా

బ్రతుకు ముళ్ళబాటలలో
చీకటిలో చిచ్చులలో
పాటుబడీ వాటుబడీ
పోతున్నది నాబండి

వచ్చివచ్చి అనిబద్ధకవిత్వానికి చేరేరు ఇది చదువరిగుండెకు అనుభవపు ఇంజక్షను

పట్టాభి రామరెడ్డిగారు మేధావులు ఆధునిక కవిత్వపు రీతుల్ని పరిశీలించుకుంటున్నారు కవుల యత్నాలన్నిటి మంచిచెడ్డలూ గుర్తించుకున్నారు పద్యం తెలుగుకవిత్వంలో హక్కులేని అధికారం చెలాయించింది పన్నెండు శతాబ్దాలపాటు ఈ అడ్డును తీసెయ్యాలని వచనపద్యాలు రచించారు ఇతరులు చెప్పని ఆశయాన్ని వీరు చెప్పేరు పద్యం కవిత్వానికి అడ్డా? ఆహా అడ్డే అయితే తిక్కనాదులెందుకు రాశారు? ఆ అడ్డులో రాయడం గొప్ప అనుకునీ.' నిర్వచనోత్తర రామాయణం వ్రాశారుకదా ఆయన మళ్ళీపాతపద్ధతికి ఎందుకు దిగేరూ? వ్యర్థపదాలూ అక్కరలేని విశేషణాలూ వాడకుండా ఎ తెలుగుకవైనా వ్రాశాడూ? సంస్కృతకవులు వ్రాశారు వాల్మీకాదులు మరి సంస్కృతంలో లేని వ్యర్థ పదాలూ, పద్యమంతా ఆక్రమించే సమాసాలూ, యతిప్రాసల సంకెళ్ళూ, గణ ఛందస్సులూ తెలుగు నెత్తిమీదికి ఎందుకు తెచ్చిపెట్టారూ?

ఎప్పుడు తెలివిడివస్తే అప్పటినుంచి మారడము చైతన్యవంతుల లక్షణం పఠాభిగారు ఫిడేలు రాగాల డజన్'లో వచనపద్యాలు వ్రాశారు (ఇక్కడ పద్యాలు' అన్నది కావ్యరచనా సాధనము' అన్న అర్థముతో వాడేరు కులకము (poem) అన్న పేరు పెట్టుకున్నాసరే ) వాటిలో పద్యానికున్నట్లుగా నడక ఎక్కడైనా స్ఫురించిందా, వెంటనే ఆ నడకని విరిచిపెట్టారు పిడేలు రాగమ్ పిడేలు రాగమ్ అన్నారు ఎదో నడక స్ఫురించింది, ఫిడేలు రాగంబులు' అని విరిచారు 'వినూత్నపద ప్రేమికులు మహాకాముకులు' అనగానే మళ్ళీ నడక స్ఫురించింది; అన్యోన్యమగు దంపతులు గూడ అని మళ్ళీ విరిచారు అయితే, వీరిపద్ధతి వీరిదే కనుక వచనపద్యాల శైలి కోసము కాబోలు 'కాన్నేను', కవిన్నేను', నాకున్', 'బందిపోటున్' 'మోమందము వంటి పదాల్ని వాడారు

వీరి కవిత్వములోని పోలికలు నగరవాసుల అనుభవము లోనివి వీరి రచన అంతా ఆధునిక నగరవాసి ధనికస్వామి కళ్ళజోడు ధరించి చూచి రచించి నట్టిది

పట్టాభిరామరెడ్డిగారితో కవితా సంప్రదాయాలమీది తిరుగుబాటు చాలా మట్టుకు పూర్తి అయిపోయింది వృత్తాల్ని అర్థానికి అనుగుణంగా విరిచి అచ్చువేశారూ పుటకి ఒక గీత పద్యమూ, పూర్తిగా పద్యాలూ అచ్చువేశారూ, వ్యాకరణాన్ని పద్యాల్నీ వదిలేశారూ, పలువురు కవులు వచనపద్యాలు వ్రాశారూ, . . ననన నత్తి . మాటలూ కక కవిత్వంలో ఉండవచ్చన్నారూ, గడ్డిపరక మొదలు గగన కుసుమాలు దాకా పదార్థాలన్నీ - కామాక్షి కోకతో సహా - సామాగ్రి అయినాయీ, అలంకార సంప్రదాయాలూ అనుభవ సంప్రదాయాలూ అచ్చువేసే సమ్‌ప్‌రద్ ఆయ్ ఆల్ ఊ ఇంకా నేను మరిచిపోయి చెప్పని సంప్రదాయాలూ అన్నీ విరిగేయి ఇక ముందు? ఇక ముందేమిటి?

ఎ నియమాలూ లేవు కనుక అనిబద్ధమైన శుద్ధమైన కవిత్వం రావాలి దాని మచ్చు పటాకీలు పేలేయి యిదివరకే

## సి.నారాయణ రెడ్డి

తిరుగుబాటు స్వభావము . (1930-40లమధ్య) ఈ స్థితిలో క్షీణదశోన్ముఖమైన భావకవిత్వమునకు వ్యతిరేకముగా తిరుగుబాటుచేసి, సరిక్రొత్త ప్రయోగములను చేసినకవులు శిష్ట్లా ఉమామహేశ్వరరావు, శ్రీ శ్రీ శ్రీరంగం నారాయణబాబు పరాభి ఛందస్సులో శిష్ట్లా, పరాభి వస్తుభావములలో శ్రీ శ్రీ, . నారాయణబాబు తిరుగులేని తిరగుబాటును లేవదీసినారు .

శ్రీ శ్రీ నారాయణబాబు స్రరియలిజముచేత ప్రబావితులై అనేక గేయములు రచించిరి శ్రీ శ్రీ , లెఫ్ట్-వింగర్స్' మార్గంలో పయనించి తెలుగులో మార్క్సిస్టు ప్రభావముగల గొప్ప గేయములను సృష్టించినాడు ఇక పరాభిపై ఫ్రాయిడ్ ప్రతిపాదించిన 'సెక్సు' బలవత్తరమైన ప్రభావము వేసినది, స్రరియలిజములోని రచనాసంవిధానక్రీడలను, ఇ ఇ కమింగ్స్ వంటి చమత్కార కవుల గమ్మత్తు' లను , శబ్దముల కసరత్తులను శిష్ట్లా పరాభి స్వీకరించినారు పరాభి ఆరుద్రలపై ఇలియట్ నగరజీవనచిత్రణము చెరిగిపోని ముద్రవేసినది ఫ్రాయిడ్ ప్రతిపాదించిన 'వ్యక్తావ్యక్తము'లోని భావములను వదలిపెట్టి, కేవలము కామోద్రేక ప్రధానమైన గేయములు పరాభి రచించినాడు

శ్రీ శ్రీ 1933లోనే భావకవిత్వ వలయమునుండి బయటపడి, మార్క్సిజముచేత ప్రబావితమైన గీతములు రచించినాడు ఇంచుమించుగా శ్రీ శ్రీతోపాటె గొంతు మార్చుకొన్న ప్రతిభాశాలి నారాయణబాబు. శిష్ట్లా 1931 ప్రాంతమునుండియే అతి నవ్యరచనలు చేసినను అది విష్ణుధనువు' రూపములో 1938లోగాని రాశికి రాలేదు ఈయన 'నవమి చిలుక' 1938లో వెలువడిన గేయసంపుటి ఇక పరాభి 'ఫిడేలు రాగాల డజన్' 1936-37ల మధ్య వెలువడిన అతి నవ్యకవితా సంపుటి ఈ నలుగురి దారులు వేరు కావున ఎవరి ప్రబావ మెవరిపై కలదను ప్రసక్తి లేదు నలుగురును పాశ్చాత్య కవితా ధోరణులచేత ప్రభావితులైనవారే పైగా నలుగురు నాలుగు త్రోవలు త్రొక్కినారు ఈ నలుగురికి తిరుగుబాటు మాత్రము సమాన లక్ష్యము సరికొత్త ప్రయోగములతో సాహిత్యజగత్తును సంభ్రమ చకితమొనర్పవలెనను కోర్కె ఈ నలుగురికుండినది.

పరాభి 'అహంభావము పరాభి పూర్తిపేరు పట్టాభి రామరెడ్డి పట్టాభి అను శబ్దమును 'పరాభి' గా మార్చుకొనుటలోనే ఇతని నవ్యతాప్రీతి కనిపించుచున్నది ప్రమాదినామసంవత్సరములో ఇతని కవితాసంపుటి 'ఫిడేలు రాగాల డజన్' అనుపేర ప్రకటింపబడినది ఈ సంపుటి ముఖపత్రముపై ఫిడేలు అను అక్షరములకు బదులుగా ఫిడేలుబొమ్మ చిత్రింపబడినది దీనిక్రింద లో రాగాల డజన్ అను అక్షరములు ముద్రింపబడినవి ముఖపత్ర ముద్రణములోగూడ ఈ కవి నవ్యత చూపినాడు ఫిడేలు పాశ్చాత్యవాద్యము పాశ్చాత్యవాద్యమైన ఫిడేలుపై ఆధునిక కాలమున కర్ణాటక సంగీతము పలికించినట్లుగా, ఇంగ్లీషు కవితా రీతులను తెలుగుభాషలో ప్రదర్శించవచ్చునను ఉద్దేశముతో కవి ఈ నామకరణము చేసియుండును 'రాగాల డజన్' ఈ సంపుటిలోని పన్రెండు గేయములకు ప్రతీకగా వాడబడినది శ్రీ శ్రీ ఇంట్రో'లో పేర్కొన్న విచిత్రమే సౌందర్యం, సౌందర్యమే విచిత్రం' అన్న అభిప్రాయమునకి కవితా సంపుటిలోని ప్రతిగేయము ప్రత్యక్ష సాక్ష్యము ఈ యభిప్రాయము ఆస్కార్ వైల్డు వెల్లడించినాడు (వక్రోక్తి కావ్యజీవితమన్న ప్రాచీనుల అభిప్రాయము దీనితో సంబంధించుచున్నది) కళలన్నియు ప్రయోజన రహితమైనవని, వైచిత్రమే కళల ప్రయోజనమని ఆస్కార్ వైల్డు ప్రవచనము ఇతడు 'కళ కళకొరకే' అన్న సిద్ధాంతమును బలపరచిన కవి పరాభిపై ఈ సిద్ధాంతప్రభావము ప్రగాఢముగా నున్నది పైగా కర్త, కర్మ క్రియలకు విడాకులిచ్చినాడితడు భావకవిత్వమున కెదురుతిరిగి తాను అహంబావకవి' నని చెప్పుకొన్నాడు కాంగ్రెసు రాష్ట్రపతి స్థానానికోసం, బాబూ సుభాసుబోసుతో పోటీ చేసి ఓడిపోయిన డాక్టర్ పట్టాభిని గాన్నేను మరో పట్టాభిని అని అనవసరముగా పట్టాభివంటి జాతీయనాయకుని ఎత్తిపొడిచినాడు తనకు విచిత్రమైన భావములన్నవని కన్నులలో టెలిస్కోపులు, మయిక్రాస్కోపులున్నవని చిత్రముగా చెప్పికొన్నాడు

'నా ఈ వచనపద్యాలనే దుడ్డుకర్రల్తో
పద్యాల నడుముల్ విరుగదంతాను;
చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని
చాల దండిస్తాను '

అని తెలుగువ్యాకరణముపై, ఛందస్సుపై దాడిచేసినాడు ఇంగ్లీషుభాషా భాండారములోనుండి ఇష్టము వచ్చినట్లు మాటలు దోచుకొందునని ఘంటాఘోషముగా చెప్పికొన్నాడు చివర కిట్లనెను

అనుసరిస్తాను నవీనాపంథా॰ కానీ
భావకవిన్ మాత్రము కాన్నే, నే
నహంబావకవిని '

ఈ చరణములలో పరాభికిగల అహంకారము, విశృంఖలత్వము , వైచిత్రీప్రియత్వము గోచరమగును అనుటతోనే ఊరకుండక అన్నంతపనిచేసిన తిరుగుబాటు దారీతడు తెలుగులో ఇంత నిర్భయముగా, నిరంకుశముగా తిరుగుబాటు ప్రకటించినవారు లేరు ఈ సంపుటిలోని గేయములన్నియు వచనగేయములే ఈ గేయములలో ప్రధానవస్తువు కామము (సెక్సు)

ఈ సంపుటిలో కవి పద్యముల నడుములేగాక, గేయముల నడుములు గూడ విరుగదన్నినాడు వచనగేయములను నడిపించుటలో గూడ ఇతనికొక నియమము లేదు అంతర్లయ ఊపు , విరుపును మొదలైన వచనగేయ గుణములీ సంపుటిలో కొరవడినవి వచనములోని కర్త కర్మ క్రియలను తలక్రిందులు చేసి గేయరూపములో పేర్చినట్లు కనిపించును

'ముఖరింపుచున్నది మా కర్ణాలలో
గుండియలందుగూడ వెండిరూపాయి
సులంఘులా శ్రావ్యసంగీతము కర్ణపేయముగా'

కొన్ని చోట్ల వట్టి వచనము వ్రాసినట్లుండును

'భ్రూ విక్షేపము చేతనే బండ్లన్
బలవంతముగా నడుపగల మహా
సామర్థ్యంబున్న దతడికి '

ఈ లక్షణములన్ని పరాభి తిరగుబాటు ధోరణికి నిదర్శనములే ఈ సంపుటిలోని భాష గూడ ఒక పద్ధతిలో లేదు గ్రాంధిక రూపములు, వ్యావహారిక రూపములు, చెట్టపట్టాలు పట్టుకొని పోవుచుండును గ్రాంధిక బాష నవహేళనచేయు దృక్పధముతో 'బరతనాట్యం బాడుచున్న' నన్నుం ధరించినది', తీవ్రాతితీవ్ర తపస్సుం జేయుచున్నాడో మున్నగు ప్రయోగములు బుద్ధిపూర్వకముగా చేసినాడు విడిగా యధేచ్ఛగా ఇంగ్లీషుమాటలను ప్రయోగించుటతో ఆగక సమాసములలో గూడ ఇంగ్లీషుపదముల నిరికించినాడు దుస్సాధ్య కాంపిటీషను మే మాస మధ్యాహ్నకాలము హంగ్రీకనుల, ప్రభాతరేజరు' మున్నగున విట్టివే భాషాచ్ఛందస్సుల విషయములోనే కాక వస్తువులో గూడ గొప్ప ప్రయోగములు చేసినకవి యీతడు నగరజీవన చిత్రణమునకు నాంది పాడినదీతడే ఆధునిక జీవితములోని వివిధ పుట్టములను గూర్చి కవిత్వము వ్రాయుటలో తెలుగులో నగరజీవితమును వస్తువుగా తీసికొన్న అతి నవ్యులలో ప్రధముడితడే వస్తుబావ పదవై చిత్రికి పరాభిని చెప్ప ఇంకొకరిని చెప్పవలెను ఫ్రాయిడ్ ప్రతిపాదించిన సెక్సు ప్రాధాన్యమును తెలుగు కవిత్వములో తొలిసారిగా ప్రవేశపెట్టినవాడితడే శ్రీ శ్రీ ఇంట్రో లో వెలిపుచ్చిన అవ్యయం అనాచ్ఛాదితంగా ఆకాశమధ్యంలో ఊగవచ్చును విభక్తి విశృంఖలంగా షికారు పోవచ్చును' అను మాటలను 'అక్షరాల నిరూపించినవాడీ కవి ఈతడు వ్రాసిన నే నహంబావకవిని' అన్నమాటను పురస్కరించుకొని ఈ తెగకు చెందిన కవిత్వమునకు అహంబావ కవిత్వము' అని నోరి నరసింహశాస్త్రిగారు నామకరణము చేసినారు కాని తిరుగుబాటు చేసిన కవులందరు అహంభావ' మును ప్రదర్శించువారే కావున ఈ పేరు ప్రత్యేక కవితాధోరణికి చెల్లదనుదృష్టితో నేను దానిని స్వీరించలేదు

'పరాభి'తోనే అంతరించింది 'ఫిడేలు రాగాల డజన్'లో ఫ్రాయిడ్ 'సెక్సు సిద్ధాంత ప్రోద్బలమే ఉద్వేలముగా కనిపించుచున్నది కామ ప్రాధాన్యము స్ఫుటముగాగల అతి నవ్యకవితా సంపుటి ఇది ఈ సంపుటిలో ఒకటి రెండు గేయములలో తప్ప మిగిలిన తొమ్మిది పది గేయములలో కామోద్రేక నగ్నప్రకటనమే ప్రధానముగా కన్పించును ఈ సంపుటికి చలం వ్రాసిన ప్రశంసా గేయమున తాను ఈ పాడుగాటి పాటల్లో చిత్రచిత్రాలు ఐనట్టిభావాలు ఎన్నో'

వాడి అయినట్టి కొనగోళ్ళతోడ చురుకుమనునట్లు పెట్టిన చక్కిలిగింత షోకు ననుభవించి' నట్లు చెప్పబడినది ఈ ప్రశంసలోనే కావ్యవస్తువు సూచితమైనది భావకవుల అమలినశృంగారమును, లలితసంయోగ భావమును త్రోసిపుచ్చి యీ కవి కేవల కామోద్రేక ప్రధానమైన ఆంగిక శృంగారము నభివర్ణించినాడు

కవీశ్వరులఖండముగా వినుతించిన చంద్రబింబము తనకు నచ్చదని, 'నాగరిక కన్యల' పౌడరు పూయబడిన ముఖములను' చూచినచో తనకు నోరూరునని, ఆ ముఖములను'-

'మా కళ్ళ పిడికిళ్ళతో గట్టిగాపట్టి'
తిండిబోతుల్లాగా తినివేస్తాము'

అని యన్నాడు కన్నులతో-చూపులతో-ముఖలావణ్యమును గ్రోలుట ప్రాచీనకవుల - భావకవుల సంప్రదాయము దాని నీ కవి యిట్లు వికారమొనర్చెను. మరీనా' అను శీర్షికతో మెరీనాబీచిలో విహరించు 'హంగ్రీకనుల' గల జవ్వనులను వర్ణించుటతో తృప్తిపడక, రోడ్డుమీదగల మోటారు కారులుగూడ ఉబ్బుకొనివచ్చే సెక్సు' అపీలుగల అమెరికన్ స్త్రీలవలె నున్నవనెను సీత' అను గేయములో కవి ప్రేయసి సీత' రామయ్యకు సతిగా నుండుటకన్న రావణుని ప్రియురాలిగా నుండుటయే తనకిష్టమని ఆమె యనును, అప్పుడు కవి తాను రావణుడనై, 'పది మూతులతోను, నీ పెదవులను' మృదుశరీరమును, వదనమును అదుముతా'నని యనును ఈ అసురభావన కామోల్బణ జనితమేకదా

బోగందాన' అను గేయము సమాజముపై కవి విసరిన పరిహాసచంద్ర హాసము బోగము చాన ముసుగులేని నిష్ఠురసత్యమని; పూజారులు యోగులు పతివ్రతలవలె వెలికి కనిపించు సతులు నాటకమాడు సతులు నాటకమాడుచున్నారని యెత్తిపొడిచి కవి సంఘములోని కుళ్లును బయటపెట్టినాడు. ఇంతటి సాంఘిక ప్రయోజనమున్న గేయములో గూడ బోగముచానల చనులు బూందీపొట్లాలవలె ఊగుచున్నవని కవి అనవసరమైన ఆంగికవర్ణన పాలైనాడు.

నవ్యస్త్రీ' యను గేయములో నవ్యస్త్రీ కుచయుగళము స్వర్గద్వయమని తాను వాని నడుమ ఊగాడు పార్కర్ కలముగా మారిపోయిన బాగుండునని, నవ్యస్త్రీమీద చూపులు నిలుపుట యనగా డీలక్స్ కుషన్ సోఫాల మీద నట్లుండునని వస్తువైచిత్ర్య ప్రవాహమునబడి కాను శృంగారమునకు దాసుడైనాడు

'కామాక్షి కోక యన్నరచన నగ్నశృంగారమును చిత్రించు గేయము కవి 'కామాక్షి' యను పేరుగల ఒక కామాక్షికి ఆమె జన్మదిన సందర్భమున కోకను సమర్పించినాడు ఆ పిమ్మట కామాక్షి సమస్తాంగముల నాకోక యేవిధముగా ఆలింగనము చేసికొన్నదో, కామాక్షీకవుల సంయోగసమయమున తనకు (కోకకు) గలిగిన యనుభూతులేవో దాని స్వగతరూపమున వచ్చి పచ్చిగా ఉల్లేఖింపబడినది ఈ విధముగా పైన పేర్కొన్న గేయములన్నియు పాశవిక శృంగార క్రీడలకు, అసంపూర్ణ కామవాంఛలకు పతాకలవంటివి ఈ ధోరణి పరాభితోనే అస్తమించుట తెలుగు కవితలోని ఆరోగ్యవంతమైన లక్షణములలో నెన్నదగినది

నగరజీవిత చిత్రణము టి ఎస్ ఇలియట్ ప్రబావముతో తెలుగులో పరాభి మున్నగు వారు నగరజీవిత చిత్రణము ప్రారంభించిరి

తెలుగు ప్రబంధములలో పురవర్ణన సంప్రదాయమున్నది అది యష్టాదశవర్ణనలలో ఒకటి అయినను మన ప్రబంధకవులు పురములను వర్ణించునప్పుడు వానిలోని అంబరచుంబి సౌధములను, పాతాళమునంటు అగడ్తలను, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది చతుర్వర్ణములను వేశ్యలను, పుష్పలావికలను వర్ణించిరే కాని పురములలోని ప్రజల జీవితములపై తమదృష్టిని కేంద్రీకరించు లేదు ఆముక్తమాల్యద మున్నగు ఒకటి రెండు ప్రబంధములలో ప్రజాజీవిత చిత్రణమున్నను అదిరాశికి వచ్చునది కాదు పాశ్చాత్యుల యేల్బడిలో ఆధునిక విజ్ఞానఫలితముగా మన దేశములోని నగరముల స్థితి మారిపోయినది నగరజీవితము యాంత్రికతా వలయములోపడి గుడుసుళ్లు తిరిగినది ఇలియట్ క్షోభపడినట్లుగా భౌతిక సౌఖ్య లాలన పెరిగిపోయినది కృత్రిమతకు పూజ్యత యేర్పడినది

నగరజీవులు కాలమునకు బానిసలై పోయినారు వారి బ్రతుకులను గడియారములే నడిపించసాగినవి నగర జీవితములోని యీ కృత్రిమత్వమును అతి నవ్యులు చమత్కారముగా వెల్లడించినారు మద్రాసు నగరములోని చంద్రుని చూచి పరాభి,

తగిలింపబడియున్నది జాబిల్లి,
చయిన బజారు గగనములోన

అని వాపోయినాడు రంగురంగుల విద్యుద్దీపముల ముందు శశి వెలవెలబోవుట గమనించి

కనిపిస్తావు నీవు స్పెన్సర్సు కంపెనీ
లేక పయిటవేసులోకి
దారితప్పి ప్రవేశించి
తందరాడుచున్న దరిబేసి గ్రామస్థుల్లాగ'

అని చమత్కరించినాడు నాగరకత ముదిరిన వ్యవస్థలో చంద్రుడు మున్నగు నిసర్గ రమణీయములైన వస్తువుల కెట్లు విలువ తగ్గిపోయినదో కవి పై పంక్తులందు ధ్వనింపజేసినాడు ప్రాచీనులు వర్షర్తువును వర్ణించిన విధము వేరు అతి నవ్యకవి చిత్రించిన తీరు వేరు పరాభి మహానగరముపై వాన కురిసినప్పటి దృశ్యము నీరీతిగా వర్ణించినాడు-

మహా నగరము మీద మబ్బుగమి గర్జిస్తున్నది
దేవుని ఎరోప్లేనుల్ భువికి దిగుచున్నట్టుల'

జలద గర్జను పర్జన్యుని రథచక్రఘోషయని ప్రాచీనులు వర్ణించగా పరాభి 'దేవుని ఎరోప్లేనులు' దిగునప్పటి ధ్వనితో పోల్చి ఆధునికత ప్రదర్శించినాడు ఉదయము పదిగంటలకు వర్షము ప్రారంభమైనది ఆఫీసునకు పోవు సమయమైనది ఆస్థితిలో ఉద్యోగికి తన పై అధికారి జ్ఞాపకమునకు వచ్చి 'పోకుండిన నాబాస్ మేఘంలాగ

ఉరంతాడు' అని యనుకొన్నట్లు పరాభి చిత్రించినాడు 'పోలీస్ వానిపై వ్రాసినగేయము నగరజీవితచిత్రణకు చక్కని యుదాహరణము ఆధునిక పరిపాలనావ్యవస్థ ఫలితముగా గ్రహించిన వస్తువిది నగరములోని 'చీలుదారులలో నిల్చుండి త్రోవ చూపించు పోలీసు బటుడు బరతనాట్యం బాడుచున్న నటర్షి చూడామణి' వలె కన్పించుచున్నాడట, అతడు

బల్బు హార్నల తాళంతోడి
యలక్ట్రికు హార్నల రాగానికిన్ని
మోటారు సైయికిళ్ల మృదంగానికిన్ని
అనుగుణ్యంగా నర్తిస్తుంటాడు '

భ్రూ విక్షేపము చేతనే బండ్లను బలవంతముగా నడుపగల సామర్థ్యముగల 'పోలీసుభటుణ్ణి చాలా నేను స్తుతి చేస్తాను అని యన్నాడు ఇవిగాక పరాభి మద్రాసులోని రోడ్లను దుకాణములను, మెరినా బీచిని హొటళ్ళను, బాల్ రూం నృత్యములను వస్తువులుగా తీసుకొని నగరజీవితమును చిత్రించినాడు పరాభి ప్రభృతులు నగరములోని మధ్యతరగతి మనుష్యుల బ్రతుకులను చిత్రించుటకన్న నగరములోని కృత్రిమ వాతావరణములోని కుళ్లనే అధికముగా బయటపెట్టుటకు ప్రయత్నించినారు.

వైచిత్రీ ప్రియత్వము - అతి నవ్యకవులకు వైచిత్రి ధ్వజము వంటిది వీరు హృదయము కన్న మెదడుకే అగ్రస్థానమిచ్చిరి భావనకన్న ఊహింపులకే ప్రాధాన్యమిచ్చిరి అందువలన క్రొత్తదేదో చెప్పి పాఠకులను విస్మయ విద్యుత్తాడితులనుగా చేయవలెననుకోరిక వీరి రచనలన్నిటిలో కనిపించుచున్నది అందుకు వారు వస్తు వరణములో, బావ వ్యక్తీకరణములో పద ప్రయోగములో, ఛందస్సులలో వైచిత్రికొరకు ప్రాకులాడిరి 'కవిత్వ హ్రస్వలిపి'ని ప్రవేశపెట్టుటకు ప్రయత్నించిరి. పరాభి 'నవ్యస్త్రీ', 'పోలీసు జాబిల్లి' మున్నగునవి అతి నవ్యకవుల వస్తువైచిత్రికి ఆదర్శప్రాయములైన గేయములు తర్వాత ఈ మార్గమున ఆరుద్ర ప్రభృతులు యథేచ్ఛముగా సంచరించినారు

వ్యక్తీకరణ వైచిత్రి చెప్పదలచుకొన్న విషయమును భావనా బలముతోగాక ఊహాలంబనముతో చెప్పుట, ఆ చెప్పెడిరీతి నూటిగా హృదయమునకు హత్తుకొనునట్లు కాక మేధకు గిలిగింతలు పెట్టునట్లుండుట అతినవ్యులు సాధించిన ప్రత్యేకత దీనినే నేను వ్యక్తీకరణ వైచిత్రి యనుచున్నాను ఈ వ్యక్తీకరణ వైచిత్రి నూతనతా ప్రీతివలన వచ్చినగుణమే భోగము చాన సంఘములోని కొందరు వ్యక్తుల కామవాంఛను దీర్చుసాధనము కాని ఆమెకు సంఘములో విలువలేదు ఈ విషయమును దృష్టిలో పెట్టుకొని పఠాభి-

'ఓ భోగంచానా నీవు
సంఘానికి వేస్టుపేపరు బాస్కెటువా'

అన్నాడు వక్రోక్తిద్వారా, ఆధునిక పదజాలముల ద్వారా కవి వైచిత్రి సాధించినాడు ప్రాచీదిశలో ఉదయించిన సూర్యబింబము ప్రభాత రేజరు నిసినట్లని చీకట్ల గడ్డంబును షేవ్ జేయన్ పడినకత్తిగాటు'వలె కనిపించిందని అన్నాడు ప్రభాతమును రేజరుతో పోల్చుట చీకట్లను గడ్డముతో పోల్చుటలోని వైచిత్రి ఆధునిక కాలములోని పదజాలము వలన సాధింపబడినది

శబ్దవైచిత్రి తెలుగులో శబ్దములద్వారా గారడీలు చేసిన కవులలో పట్టాభి ప్రధముడు 'హైహీలుయాన' వంటి కొత్త సమాసములనే సృష్టించినాడీతడు ఇంగ్లీషుపదములను గ్రుమ్మరించిన తొలి కవియును ఈతడే ఇంగ్లీషు మాటలకు తెలుగు మాటలకు సంధికార్యము నిర్వర్తించినదీతడే catch + చేయ అనుమాటల నీతడు క్యాజ్జేయ' అనెను మద్రాసు + సిటీ అను మాటలను సకారంతశబ్దము తర్వాత వచ్చు సవర్ణమునకు జరుగు సంధికార్యమును దృష్టిలో పెట్టుకొని మద్రాస్సిటీ' యని ప్రయోగించెను 'దుస్సాధ్య కాంపిటీషను' వంటి మిశ్రమ సమాసములు సృష్టించెను. మౌనంగా అనుటకు 'మవునంగా' అని విడదీసి వ్రాసెను శాకాహారులకు 'శాఖాహారు'లని ప్రయోగించెను పఠాభి చేసిన శబ్ద చమత్కారములకు 'ఫిడేలు రాగం' అను గేయము చక్కని నిదర్శనము ఇందులో అతడు మామూలు

వర్ణక్రమమును మార్చివేసెను ప్రేమికులు అనుటకు 'ప్రేమికులు' అని 'అన్యోన్యము' అనుటకు 'అన్ యోన్ య' మని ప్రశ్నించినది అనుటకు 'ప్రశ్ నిన్ చినది' అని అక్షరములను చీలదీసి ప్రయోగించెను చిత్రగుప్తలో ప్రచురించబడిన గేయమున పరాభి అచ్చులో ఈ చమత్కారము చేసినాడు

అడ్డము తిరిగెను [illegible]
తలక్రిందులైనది [illegible]

భావమున కనుగుణముగా అచ్చులో మార్పుచేయుట దీనిలోని విశేషము ఇది ఒక విధముగా ఇ ఇ కమ్మింగ్స్ ప్రబావముగల ధోరణియే ఇవిగాక అతినవ్యులలో కొందరు జీవన అశ్వము' అనుచిత విసంధులను అయస్కాంతించు' వంటి సరికొత్త క్రియారూపములను, లెక్కలేనన్ని మిశ్ర సమాసములను బుద్ధిపూర్వకముగా ప్రయోగించినారు విమర్శకులు కొందరు ఇది వ్యుత్పత్తి దారిద్ర్యమువలన సంక్రమించిన దోషమని బావించిరి కాని వీనిని వైచిత్రీ ప్రియత్వమను మైకములో పడిపోయి విశృంఖలముగా చేసిన ప్రయోగము అనవచ్చునేమో?

ఛందోవైచిత్రి అతి నవ్యులు ప్రధానముగా వాడిన ఛందస్సు వచనగేయము కొందరు మాత్రాఛందస్సులను గూడ వాడిరి వృత్తములను వృత్తములని పేర్కొనకుండ ప్రయోగించుట వీరు చేసిన చమత్కారము పరాభి 'నర్తకులు' అను శీర్షికతో తేలిక లతాంతముల తూలికలు వ్రాయు విధి యను రీతిలో లయగ్రాహి రచించినాడు వృత్తములను చమత్కారము కొరకు ప్రయోగించి మాత్రాచ్ఛందస్సులను కొంతవర కాదరించి వచనగేయమును జవనాశ్వమువలె మత్తేభమువలె, కురంగివలె సివంగివలె బహురీతులలో నడిపించినారీ అతి నవ్యులు వచన గేయము వీరి సృష్టికాదు దానికి కవికొండల, మల్లవరపు పరాభి, శిష్టా ప్రభృతులెన్నడో పాదులు తీసినారు పరాభి ఫిడేలురాగాల డజన్'లోని గేయములన్నియు వచన గేయములే కాని కృత్రిమ గ్రాంధిక

రూపములను చేర్చుటవలన, అంతర్లయను పాటించక ఒక్కొక్కమాటు శుద్ధ వచనపుతుంటలనే చేర్చినందున, ఇవి ప్రామాణికమైన వచన గేయము లనిపించుకొన లేదు

సంప్రదాయ ప్రభావము : అతి నవ్యకవు లెంతగా నియమోల్లంఘనము చేసి తెలుగులో పాశ్చాత్య కవితాధోరణులను దిగుమతి చేసినను పూర్తిగా సంప్రదాయమునుండి విడివడినవారు కారు

వచనపద్యాలనే దుడ్డుకర్రల్తో పద్యాలనడుమల్ విరుగదంతా'నని దారుణ ప్రతిజ్ఞచేసిన పఠాభిసైతము సంప్రదాయప్రభావమునుండి విడివడలేకపోయినాడు ఇతని మృణాళిని అన్న గేయము అనంతరప్రబంధకవుల చిత్ర కవిత్వధోరణిని స్ఫురింపజేయును

'మృణాళినీ నీ చూడ్కులు చంద్ర కి
రణాలనీ నీతోనుండు గంటలు
క్షణాలనీ నీ నవ్వులు తాప హ
రణాలనీ--

గేయములో నున్నదనుటతప్ప ' హా యను తనయా యను' వంటి పద్యములకు దీనికిభేదము లేదు 'పిడేలు రాగాల డజన్'లో ప్రధానముగా పాశ్చత్యవాసనలే గుబాళించినను బానల్తోడ పోసినట్లుం గురిసేటి వాన' యన్నప్పుడు కుంభవృష్టి స్ఫురించును రంగురంగుల చీరలు ధరించిన నాగరిక స్త్రీలు వికసిత లతాకుంజాల్లాగా' కన్పింతురన్నబావముపై సంప్రదాయముద్ర స్పష్టముగా గోచరించును

. అత్యంత వినూత్న ప్రయోగములతో ఆంధ్రకవితాలోకమును సమ్ముగ్ధమొనర్చిన పఠాభి ప్రభృతులగొంతులు ఆ తరువాతికాలమున చాలవరకు మూగపడిపోయినవి. అబ్బూరి ఛాయాదేవిగారు ప్రచురించిన కవిత' అను పేర రెండు సంపుటాలలోని పఠాభి 'యాత్రాచ్ఛందస్సు'లు ప్రత్యేకత కలవి 'సిలోనుపిల్ల'

'స్కాచిపిల్ల', 'హెూయల', చయినా యువతీ అను శీర్షికలతో తనకు అజానజమైన శబ్దార్థ వైచిత్ర్యము ప్రదర్శించినాడు 'స్కాట్లాండు సరోరుహాక్షి నీదు సోయగమ్ము సాక్షి' కన్నుగుట్టు నిన్ను జూచినంత త్రాగినట్లు స్కాచి అన్న ధోరణిలో గిలిగింతలు పెట్టు విచిత్ర కవిత్వమిది

—[ఆధునికాంధ్ర కవిత్వము (సంప్రదాయములు; ప్రయోగములు). థీసిస్ గ్రంధం, 1967]

## కరుగంటి సీతారామయ్య

ఈ ('ఫిడేలు రాగాల డజను'లోని) మార్గం బావకవిత్వం కాదని యీన (పరాభి) కంఠోక్తిగా చెప్పాడు వందనాలు కొన్ని కొత్త 'ఫాషన్లు' తెచ్చిపెట్టాడు చూశారా?

'క్రాస్వర్డు ఫజిల్సు లాగున్న
నీ కన్నులను సాల్వుచేసే మహాబాగ్యం
ఎ మానవునిదో కదా?

ఇది నజానే బోక్తారం కమిహ సముపస్థా స్యతివిధి' అనే కాళిదాసు వాక్యాని కనువాదం ఇలాగే కొత్త కవిసయాలు కల్పనలు

ఓ బోగంచానా నీవు
సంఘానికి వేస్టు పేపరు బాస్కటువా?'

ఈన చేసినపనిలో ఒక బేదముంది ఇంగ్లీషు పదాలను తెనుగులిపిలోనే రాాడు ఈన ఎట్లారాశినా అడగడానికి వీల్లేదు.

ఫిడేలు రాగం' అనే ఆఖరిగేయంలో అచ్చుపద్ధతి - tricks with in-offensive print

'అన్ యోన్ య మగు దమ్పతులుకూడ'
'మ్యారేజ్జేసుకొన్ నావుగదా. స్వీట్ హార్ట్

అచ్చుకూడా మామూలు పనికిరాదన్నమాట కొందరికి. ఈ గ్రంధకర్తగారు మొదట మొదట మృణాళిని రాసినప్పటి పట్టాభి'గా వుండి నవ్యుల్లో నవ్యుడై పరాభి అయినాడు ఈ 'వచనపద్యాల సంపుటి' ప్రతిభ పత్రికవారే దీన్ని చూసి దిగ్రభము చెందారు
—[నవ్యాంధ్ర సాహిత్యవీధులు,హైదరాబాదు ఆంధ్రసాహిత్య పరిషత్ ప్రచురణము (1942)]

## కె.వి.రమణా రెడ్డి

'నాకు శ్రీ శ్రీ కవిత్వభిక్ష పెట్టాడనుకుంటున్నారు లోకులు కాని నిజానికి నా కవిత్వదీపం వెలిగించింది పరాభి ఆయన పాటలు విని అలాంటివే నేనూ కట్టాలని మోజుపడ్డాను అని ఒక బహిరంగసభలో ఆరుద్ర ఇటీవల ప్రకటించారట కవిగా ఆరుద్రను లోకప్రసిద్ధుణ్ణి చేసేందుకు శ్రీ శ్రీ పాటుబడి ఉండవచ్చు కవిగా ఆరుద్రను మలచింది ఎక్కువగా పరాభి

ఒకప్పుడు పరాభి పేరు అతి నవ్యతకు మారుపేరు అతి నవ్య కవిన్నేను' అని ప్రారంభించ గలిగిన ఈ కవికుఠారం పద్యాల నడుములు విరుగదన్ని బూనుకొంది నారాయణబాబు రావణాబాంబై నాగరికతమీద పాషాణవర్షం కురిపించేవేళ, పరాభి నాగరికతమీద కాగితాల అమ్ములు ఎక్కుపెట్టసాగాడు అధివాస్తవ కవియొక్క వ్యక్తిలోకంతో వికటించి స్పర్థించి వైదొలగి చనినప్పుడు, పరాభి కవియొ క్కవ్యక్తి పరమ నిరంకుశమై, ప్రభువై, కిందుపడిన లోకంమీదుగా నిదారుగా నిల్చుంది భావంలో అధివాస్తవికత కలిగించిన కల్లోలంనుంచి బయల్దేరిన

అభావం, పరాభిలో శరీరి కాగలిగింది బావకవిని కాను నే నహంబావ కవిని -అని తానే చెప్పలేదా?

సమాజం వలయంలో కవి వ్యక్తి కేంద్రబిందు వైనప్పుడు, అంచులలో తప్ప నట్టనడుమ కవిత్వానికీ, సమాజ తత్వానికీ సంయోగం లేనప్పుడు ఆత్మాశ్రయ కవిత్వం వెలువడింది సామాజిక చింతనమే రూపుమాసి కవివ్యక్తి ప్రతి ఒకటీ ఒక్కొక్క వలయమై ఈ వలయాల కూడికలోనే సమాజచిత్రం తయారైనప్పుడు, అహంభావకవిత్వం వెలువడింది అహంకారం అహంబావమంత ప్రమాదకారి కాదు ఒకటి, పరులతో పుర్షించనైనా పుర్షిస్తుంది మరొకటి తననే తప్ప తదితరులను గుర్తించదు ఒకటి అరణ్యం అందులో మానవుడు మృగాల పజ్జనైనా బతుకుతాడు రెండవది శ్మశానరాజ్యం అందులో మానవుడు మహాకాలుడై విహరిస్తాడు ఆత్మాశ్రయ కవిత్వంలో ప్రేమ అనే ఛద్మవేషం ధరించి కామం తిరుగాడుతుంది అహంబావ కవిత్వంలో కామం పట్టపగ్గాల్లేకుండా ర్రంకెవేస్తుంది అంకుశంలేని క్రియాపదాలు, విభక్తులు, ఆత్మాశ్రయ కవిత్వంలో కనిపించవు 'నీవు' అనే అంకుశాన్ని ఆత్మాశ్రయ కవి, బయాసహ్యాలతో నైనా దర్శిస్తూనే వుంటాడు అక్కడ 'నీవు' తెరమరుగులోనైనా ఉంది ఇక్కడ అహంభావ కవిత్వంలో 'నీవు' కు అబావమే ఎదురౌతుంది

ఈ విపరీత వ్యక్తివాదం పరాభిలోనే గాదు, పాశ్చాత్యసంపన్న యువకులలోగూడా భాసించినట్లు రోజర్ గరాడీ రాసిన 'లిటరేచర్ ఆఫ్ ది గ్రేవ్ యార్డ్'లో మనం చూడగలం నీ ముందు షడ్రసోపేత బోజనం అమర్చిన విస్తరి కాని నీకు తిండితో వెగటు కొట్టింది ఏ తిండితో? ఏర్పాటు చేసిన తిండితో, నీక్కావలసింది అప్రయత్నంగా లభించే తిండి సిద్ధాన్నమైనా అది దూష్యమే; పాయసమైనా విషతుల్యమే నీక్కావలసింది వేటతిండి నీ వడక్కముందే నీసన్నిధిలో నిలిచే నవ నిధులున్నాయి కాని ఎవరిక్కావాలి? నీ క్కావలసింది సాదాతనం జయంతుడు మాసినతలతో కనిపిస్తే ఎంత నిరాడంబరుడు అంటాం కుబేరుడు మాసిన వుడుపులు ధరిస్తే ఎంత సరళవర్తనుడు అంటాం మనకేం

తెలుసుగనక వాళ్ళబాధ : బహుశా వాళ్లు సిరితో విసిగి పోయారు తృప్తితో విసిగిపోయారు అనుభవదాహం వారిని పెద్దమ్మ ఇంటికి లాగివేసింది ఆనందతృష్ణ వారిని సానికొంపకు చేరవేసింది ఈ సంపన్న యువకుల విసుగుదల (బూర్జువా బోర్డమ్) నుంచే అభావ అహంభావ కళారూపాలు వెలువడినై

పఠాభిగారి ఫిడేలు రాగాల డజన్ లోగూడ ఈ విసుగుదల మహోకార్యలం పటత్వంగా కనిపిస్తుంది ఇది, అది, ఇంకొకటి ఇక్కడ అక్కడ, ఇంకొక కడ చలనమేగాని నిలుపులేదు. గవేషణమేగాని ఇష్టఫలసిద్ధి లేదు. తృష్ణేగాని తృప్తి లేదు ఉన్నది సరిపోదు లేనిదే కావాలి ఉన్నదానితోనే ఈసడింపు, లేనిదానితో తగనివలపు అందుచేతనే భావంలోగాని భాషలోగాని నిత్యనవీనత, అపూర్వత, లక్ష్యమౌతుంది వైచిత్రి' ఆరాధ్యమౌతుంది భాష నాజూకుగా లేదు కాబట్టి, అవసరంకొద్దీ కాకుండా నాజూకుకోసం ఇంగ్లీషుపదాలను తెచ్చి తెలుగుపదాలకు తోకలు తగిలించు సాంప్రదాయికభావం కిట్టదు కాబట్టి అరువుతెచ్చుకొని సొంతపరచుకొన్న నవీన పాశ్చాత్యభావాలను దేశవాళీ జనబాణీ భావాలకు ఎరువుపెట్టు తమ తమ నెలవులు దప్పిన' వస్తువులు శోభాదరిద్రాలు ఉపయోగదూరాలు అనర్థదాయకా లౌతాయని విస్మరించు

నగరజీవితం ఎన్ని అరలున్న బోను? ఎన్ని అంతస్తులున్న మేడ? అహంభావకవి వీటినన్నిటినీ చూశాడా? అతని అనుభవం సమగ్రమా? అమంగళంలో మంగళాన్ని, దారిద్ర్యంలో దీక్షాసంకల్పాన్ని, నిత్యశ్రమలో గౌరవాన్ని, పడుపువృత్తిలో కన్నీళ్ళజాలును గమనించాడా? జీవితాన్ని ఒక కోణంనుంచి మాత్రమే చూడగలిగాడు చీకటిలో చీకటేగాని, వెలుగురేక కనిపించలేదు వెలుగులో వెలుగేగాని చీకటిపోగు కనిపించలేదు బందిఖానాయేగాని విడుదల లేదు అరణ్యమేగాని నిష్క్రమణమార్గం లేదు పుండుమీది ఈగ వలె పుండు గుచ్చిగుచ్చి రసికను పీల్చి హాయ్ హాయ్ మనడమేగాని, దానిని కడిగి, కోసి, మందుపూసి, కట్టుకట్టడం మాన్పు జూడడం లేదు కాబట్టి కవి ధర్మానికి అతగాడు రాజీనామా చేశాడు అమంగళాన్ని, వికారాన్ని, మనస్తాపాన్ని చిత్రించేటప్పుడు దానికి రంగు ఎక్కువపూసి, దానిని ఆకర్షవంతంచేస్తే, ఫలితం ఎమిటి? నరకమే స్వర్గంగా

మోహింపజేస్తుంది దుర్గుణమే పటుతరంగా గుప్పెట్లో జీవితాన్ని నొక్కివేస్తుంది వ్యసనం నాజూకౌతుంది ఇంద్రియాలు మనస్సును శాసిస్తయి ప్రపంచం మానవాధీనంగాక, మానవుడు పంచభూతాల బందీ అవుతాడు. కాబట్టి నవీనత' మారువేషం ధరించిన ఆదిమతం కాగలుగుతుంది మనిషి దైవసన్నిభుడు కాగోరుతున్నాడు గాని రెండువేల యేళ్ళుగా నడిచివచ్చిన రాచబాట నిడివిని కొలుస్తూ తిరిగి ఆదిమ అరాజక అరణ్యజీవనానికి పోగోరటంలేదు అహంబావకవి ప్రతి ముందడుగులోనూ కాచుకొని ఎన్నో ప్రపాతాలున్నాయి అతను వేసే ప్రతి పైఅడుగులోనూ వేచి ఎన్నో అధఃపతనాలున్నై అతనికి పతనమే ఆరోహణం తిరోగమనమే పురోగమనం, వ్యసనమే ఫేషన్, వికల్పమే కల్పం

పరాభి చాలా గడుసైనకవి ఆరుద్ర అతనికంటె గొప్ప కాని గడుసుదన మొక్కటే కవిత్వమౌతుందా? కవిత్వం ముఖ్యంగా హృదయవ్యాపారం మెదడు కూడా పని చేయవలసిందే చెప్పేదానిని చమత్కారంగా వీలైనంత పరోక్షంగా చెప్పవలసిందే నవీనజీవితంలోని వాస్తవాలను అలంకారాలుగా ఉపయోగించవలసిందే కాని, ఉద్రేకాలకు అతీతమైన శుద్ధ మహాబావాల పేర్పు కాగూడదు కవిత అది 'కదిలేది కదిలించేదీ' కావలసినప్పుడు, తానుమట్టుకు కదిలి అవతలివారిని కదిలించలేక పోగూడదు పరాభిలోనూ, ఆరుద్రలోనూ ఈశుష్క మనోవిలసనమేగాని, హృదయ ప్రచాలనం దాదాపు లేదనే చెప్పాలి ఫొటోగ్రాఫరు వ్యక్తిప్రతిభ నాశ్రయించుకొని, వాస్తవాన్ని కళాత్మకంగా చూపగల ఫొటోలవంటివేగాని, వాళ్ళరచనలు గాఢమైన వర్ణాలను తేలికరంగులతో కలగలిపి అంతరాలుచూపి, న్యూనానున్యూట వర్ణవిన్యాసంద్వారా, ఒక దృశ్యాన్ని హృదయంలో తాపగల వర్ణచిత్రాలు కావు 'ఎయ్యది హృద్యమపూర్వం బెయ్యది' అనే పద్యంలో, అపూర్వత మాత్రం సిద్ధించి హృద్యత లోపించిన రచనలు

ఎందుచేతనంటే, వర్ణించే వస్తువుతో వారికి హృదయసామీప్యం తక్కువ ఉదాహరణకు ఒక ఆంగ్లో - ఇండియన్ అమ్మాయినే తీసుకోండి సినిమాహాల్లో తొమ్మిదణాల సీటుకు ప్రలోభపడుతున్నదంటే ఆ అక్కరలబతుకు మన కళ్లకు కట్టవచ్చు కాని ఈ సహాయం చేసిన యువకునికి కృతజ్ఞతాసూచకంగా తన

శరీర తలాన్నంతా పరిశోధనకు సమర్పించుకొంది అన్నప్పుడు ఆ అమ్మాయిమీద క్రోపానికి బదులు జాలి కలుగుతుంది కాని, ఆ యువకుడిమీదనో? ఆ భావాన్ని నిర్వచించలేము అది వర్గక్రోధం కాదు అతను షోదాకాదు, సంస్కారి విద్యావంతుడు ఇటువంటి తొమ్మిదణాల సీట్లు రోజుకో తొంభై ఇప్పించగల శ్రీమంతుడు. అయినప్పుడు అతనిమీద మనకు అసహ్యం కలుగుతుంది అతనితోగాని, అలాంటివారితోగాని, సాహచర్యం, సహజీవనం కూడా అవాంఛనీయ మౌతాయి ఆ అమ్మాయి అక్కరను ఎంత గొప్ప ప్రయోజనంకోసం వినియోగపెట్టుకున్నాడు ఈ దాత బాధలు తొలగించడం కాదు అతని పని, బాధలు వీలుగా సుఖం పొందడం అతను కవి అయితే బోర్డ్ కాసేకాడు అతని నుంచి చేర్చుకోవలసిందేదీ లేదు

ఈ మనస్తత్వం ఒక వ్యాధిలక్షణం ఆవ్యాధికి జన్మదాత, హెచ్చు లొచ్చులు హస్తిమశకాంతరంగా వున్నవర్గ సమాజం పనిపాటలు లేని సోమరి శ్రీమంతులు, పనిలో అచ్చుబాటు లేని దరిద్రులు 'అలకాపురానికీ, అలగాజనానికీ' నడుమ జరిగే ప్రత్యక్ష పరోక్ష స్పర్ధలోని కవి ఎదో ఒక పక్షం కాకతప్పదు కాని అహంభావ కవి నిష్పాక్షికుడు పక్షాతీతుడు కాబట్టి వాస్తవ ప్రపంచానికి కట్టుబడని శుద్ధ స్వేచ్ఛాజీవి తన కొక్కడికే తాను బానిస తనలోని మంచితనానికి మాత్రం కాదు తనలో పేరుకొని పోయిన జిడ్డువంటి అసంయమిత క్షుద్రోద్రేకాలకు బానిస

–['విశాలాంధ్ర' పత్రిక. 1961 (?) 'అక్షర తూణీరం' సాహిత్య శీర్షిక క్రింద 'నగరం ఫిడేలు పాటలో రోగాలరాగాలు' అనే వ్యాసం]



## ఆరుద్ర

1947 ఉదయించగానే మదరాసులో పెద్ద సాహిత్య తిరుణాల జరిగిందన్న భోగట్టా .. శ్రీ శ్రీగానీ, నారాయణబాబుగానీ, పరాభిగానీ ఆసభల్లో

లేరు.వీళ్ల ముగ్గురే ఆనాటి అతి నవ్యకవులకు ఆచార్యులు, ఆరాధ్యులు శ్రీ శ్రీ ప్రచారం చేసిన మాత్రాఛందస్సులూ పరాభి దిమ్మరించిన వచనపద్యాలు, నారాయణబాబు కనిపెట్టిన మధ్యేమార్గాలూ మాకు నచ్చాయి అప్పటికే పరాభి తెచ్చిన మార్పులకు ప్రతిధ్వనించినట్టు కొన్ని మణిప్రవాళ రచనలు చేశారు.

1947 నాటికి పరాభి ప్రముఖుడు అతని కావ్యవస్తువులు అందరికీ జీర్ణమవని వింత వంటకాలు పరాభి అతి నవ్యుడు అతని కవితనిండా నాగరిక వాసనేగాని పల్లెటూరి వాతావరణం లేదు శ్రీ శ్రీ సైతం కూటికోసం గుడ్డకోసం పట్టణంలో బతుకుదామని బయల్దేరే పల్లెటూరి బాటసారుల్నే వర్ణించాడుగాని అతని కవిత్వం నగరంలోనే కాపురం పెట్టలేదు పరాభి అలాకాదు, నగరం తప్ప మరోటి కావ్యవస్తువు కాలేదు అయితే అతని టెక్నిక్ చమత్కారాలకు తిరుగుబాటు తెంపరితనానికీ విస్తుబోయిన లోకం అతనిలోని సీరియస్‌నెస్‌ని అర్థం చేసుకోలేదు ఆధునిక జీవితంలో నగరం ఒక బాగమైనప్పుడు కవిత్వంలో దానికి ఇవ్వవలసిన వాటా ఇవ్వవద్దా అని అతని ప్రశ్న

అయితే ఆనాడు తెలుగువాళ్ళు దానికి జవాబు చెప్పలేదు అప్పుడు వాస్తవానికి తెలుగు వాళ్ళకు నగరం లేదు బెజవాడ వైజాగువంటివి సైతం పెద్ద పల్లెటూళ్ళే అందుచేత తెలుగు కవులపై ఆధునిక యాంత్రిక నాగరికతా ప్రభావంతోపాటు పరాభి ప్రభావం కూడా పడలేదు (నా ఒక్కడి మీదనే ఎక్కువగా ఆ ఇన్‌ఫ్లుయన్సు పడింది) 1956లో మనకు హైదరాబాదు రాజధానిగా విశాల రాష్ట్రం ఎర్పడ్డాక మన సాహిత్యజీవనంలో క్రమేణా మార్పు వచ్చింది కుందుర్తి, తిలక్ వంటి తొలితరం నవకవులు కూడా నగరాన్నే కావ్యవస్తువుగా తరచు తీసుకొనసాగారు ఇరవై సంవత్సరాలకు పరాభి విప్లవం పాతపడింది నగరం లేకపోతే ఇవాళ మనకు దిగంబరకవుల ఉద్యమం వచ్చేది కాదు .

–['నేటికవిత్వంలో కొత్తపోకడలు' సారస వ్యాసావళి, ఆగస్టు, 1967, మదరాసు]

# త్రిపురనేని మదుసూదన రావు

భావకవిత్వం మీద తిరుగుబాటు చేసిన నాటి యువకుల్లో శ్రీరంగం నారాయణబాబు కూడా ఉన్నాడు. శ్రీ శ్రీ, శిష్ట్లా, పరాభి మొదలయినవాళ్ల తిరుగుబాటు కవుల్లో ప్రముఖులు

పరాభి నగరవాతావరణాన్ని వర్ణించడంలోనూ, విచిత్రమైన భావప్రతిమల్ని వ్యూహించడంలోనూ, సెక్సును స్వేచ్ఛగా వివరించడంలోనూ కొత్తదనాన్ని సాధించాడు వ్యక్తిగత అరాచక వాదం, 'ఆధునికత' పరాభి కవితలో కనిపిస్తాయి ఈ కవి మనస్సులోతుల్లో ఆధారశక్తుల్ని విశ్లేషిస్తే ఆత్మాశ్రయ ఇనుపకవచంలో వుండిపోయిన వైనం కనిపిస్తుంది ఉపరితలంలో మార్పే కాని లోతుల్లో భావకవితా బంధువే కాకపోతే కాస్త అరాచకధోరణి వుంది అందుకే ఒక శిల్పవిధానాన్ని అభివృద్ధి చేసుకొని భావకవిత్వేతరమైన నవ్యతను సాధించిన కవిగా వీరిని పరిగణించవచ్చు

శ్రీ శ్రీ, శిష్ట్లా, పరాభి . మొదలయినవారు తమ మార్గాల్ని తాము నిరాఘాటంగా యెన్నుకున్నారు ఒక్క నారాయణబాబుకే స్పష్టమైన మార్గంలేదు వీళ్లు (శ్రీ శ్రీయేతర తిరుగుబాటు కవులు?) సాధించిన వచన కవితాప్రక్రియ ఒక్కటే

-[' శ్రీరంగం నారాయణబాబు – రుధిరజ్యోతి' సమీక్షావ్యాసం, 1972 సెప్టెంబరు, 'సృజన'పత్రిక]



## విశ్వనాథ సత్యనారాయణ

పరాభి అని ఒక కవి వున్నాడు ఆపేరులోనే అతని లక్షణం తెలుస్తున్నది కదా? పట్టాభి అన్నది పరాభి అయింది రెండు టాలు ఎందుకని ఒత్తురా పెట్టాడు ఆయన పుస్తకం చూడాలి ఆయన పుస్తకంలో చివరిపాట ఉన్నది ఆపాటలో వర్ణక్రమం విపరీతంగా వుంటుంది కల్కి అని వుందనుకో నీవు లీ కింద క వత్తు ఇస్తావు ఆయన కలి విడిగా రాసి కి విడిగా వ్రాస్తాడు ఇది సరేకాని కొన్ని కొన్ని ఇట్లా వ్రాస్తే తెలుగు పద్యాలు హిందీ అక్షరాల్లో వ్రాసినట్లు ఇంగ్లీషు అక్షరాల్లో వ్రాసినట్లు వుంటుంది అదొకమోస్తరు విప్లవం విప్లవం అన్న తర్వాత ఇది ఔను ఇది కాదు అన్న నియమమెక్కడ?

పరాభి కూడా పెద్ద విప్లవకారుడా?

ఆయన విప్లవమంతా పూర్వ కవితా సమయాల మీద జార్జిటౌనులో చందమామని వర్ణించాడు వీళ్లందరూ పూర్వకవిత్వ సంప్రదాయాలమీద దాడి ఎత్తినవాళ్ళు పూర్వకవిత్వంలో చంద్రుడు, మలయానిలం, మన్మధుడు కోకిల వీటిని ఆశ్రయించి వాళ్ళు పద్యాలల్లుతారు ఈ కొత్తకవులకు అవంటే ఒళ్ళుమంట

—[తెలుగుసాహిత్యం : హేతువాదయుగం.
(రేడియో ప్రసంగాలు) భారతి పత్రిక, 1962 జూన్]



ఈ గ్రంథంలోని విశిష్టత, కవీ కవిత్వమూ గలిసి ప్రచ్ఛన్నవేషంతో నవీన నాగరికతా రంగంలో, గూఢసంచారం గావించడానికి అంగీరించడం మాత్రమే ఈ గుర్తింపే వివేకమే ఈ కవికుమారుని పావురాయి పల్టీ' కవిత్వానికి శ్రీ రామరక్ష.

—ఆంధ్రప్రభలో 'విశ్వం' సమీక్ష (తేదీ తెలియదు)



'నవ్యస్త్రీ' అనే కావ్యంలో కవి నవ్యస్త్రీని సంబోధించి ఇట్లాఅన్నాడు
క్రాస్వర్డు పజిల్సు లాగున్న
నీ కన్నులను సాల్వుజేసే మహాభాగ్యం
ఏ మానవునిదో కదా '

సరిగ్గా ఈ కావ్యాలలో కవిత్వం కూడా అలాగే వుంది అన్నీ క్రాస్వర్డు పజిల్సు కవిత్వమే కాకుండా చివరకావ్యంలోని అచ్చుకూడా క్రాస్వర్డు పజిలుగా ఉన్నది

యాదృచ్ఛికముగా చూచేవారికి ఈ గ్రంధము వేళాకోళము కోసము వ్రాసినదా అనిపించవచ్చు కాని అది సరికాదు ఇది ప్రయత్నపూర్వకముగా కొత్త విధమైన శిల్పముతో వ్రాసిన కావ్యము ఆ శిల్పస్వభావము 'ఆత్మకధ' అనే కావ్యములో కవే చక్కగా వర్ణించినాడు

కవిపేరు నవ్యం· కావ్యాల సంపుటిపేరు నవ్యం· ఖరీదు నవ్యం (డజన్ అర్ధణాలు) అచ్చు నవ్యం· ఛందస్సు (లేక పోవడము) నవ్యం· వ్యాకరణం (లేక పోవడము ) నవ్యం· అంకితము నవ్యం; కొత్తరకమైన మణిప్రవాళమైన భాష నవ్యం· అంకారాలు నవ్యం;

శ్రీ శ్రీ 'ఇంట్రో'లో కొత్తశక్తులు కొత్తరూపంలో సాక్షాత్కరించాలి' అన్నాడు శ్రీ ఉమామహేశు కావ్యాలలో ఉన్నంత కొత్తరూపము ఇందులో ఉన్నది ఇంట్రో' కారులు కొత్త శక్తులు మాత్రం ఈ కావ్యమాలలో మృగ్యముగా ఉన్నవి కొత్తదనముకోసము చేసిన ప్రయత్నము వల్ల ఈ కవి కొంత చిత్రరచన చేయగలిగినాడు· జాబిల్లి అనే కావ్యములోమాత్రము ఈ చిత్ర రచన చిత్రత్వగుణ మాత్రాన్ని కొంతవరకు దాటగలిగింది ఈకవి అహంకారము వదిలిపెట్టక కొత్త శక్తికూడా ఉన్న కావ్యాలు ముందుముందు వ్రాయగలడనుకొంటాము అయితే ఈ కవిని అనుకరించి ఇతరులెవరైనా కావ్యాలు వ్రాస్తే వాళ్ళను విశాఖపట్టణం పంప వలసివస్తుంది

–[ప్రతిభ సంపుటి 4 (గిడుగు స్మారకసంచిక)లో
నో.న.శ.సమీక్ష]

## శ్రీ శ్రీ

పరాభి 'ఫిడేలురాగాల డజన్' తన్ను చాలా చాలా ప్రభావితం చేసిందని ఆరుద్ర స్వయంగా ఒప్పుకొంటాడు ఛందస్సులమీద పరాభి కున్నంత అధికారం శిష్ట్లాకుగాని, నారాయణబాబుకిగాని లేదు

ఈనాడు ఆరుద్ర ముద్ర అంటారే అది (ఫోర్జరీ అనబోనుగాని) నిస్సందేహంగా పరాభి ముద్రే అది దాటియిప్పటికీ యింకా ఆరుద్ర బైట పడలేదు

–[నగ్నముని 'తూర్పుగాలి'కి శ్రీ శ్రీ పీఠిక. 17–5–1972.]



# డాక్టర్ వెల్చేరు నారాయణరావు

భావకవిత్వం మీద పనిగట్టుకుని దండయాత్ర చేసినవాడు పఠాభి ఫిడేలు రాగాల డజన్ భావకవిత్వ హేళన ప్రతిభావంతంగా చేసిన కావ్యం శుక్లపక్షంలా జడ దృక్పధంతో బావకవిత్వాన్ని హేళనచేసిన కావ్యం కాదిది భావకవిత్వంవల్ల ఏర్పడిన జడత్వాన్ని తొలగించే దృక్పధంతో చేసిన ప్రాణవంతమైన హేళన ఇది

కలకత్తా విశ్వవిద్యాలయంలో చదువుకుంటున్న పఠాభికి 1938లో ఇలా అనిపించిందిట

**As I lay on my bed and looked through the window, I saw the full moon surreptitiously peering through the smoke filled sky All the thsousand metaphors I had read in Bhava Kavitvam, in Prabandhams and in Tagore s songs, suddenly lost all their meaning.**

అనుసరిస్తాను నవీన పంథా; కానీ
భావకవిన్మాత్రము కాన్నే· నే
నహంభావ కవిని

అని ప్రకటించుకుని ప్రకటించిన ఫిడేలు రాగాల డజన్ వెల డజన్ అర్ధణాలు ఇత్యాది ముఖపత్ర చమత్కారాల వల్లనే కాకుండా, కవిత్వంగా ఆనాటి కవిత్వానికి విద్యుత్ చికిత్స అయింది భావకవిత్వంలో ఎవి సున్నితంగా చెప్పుకుంటారో వాటినన్నింటినీ హేళన చేసిన anti-poem పఠాభి రచన తెలుగు కవిత్వంలో చిరకాలంగా కవితా వస్తువులుగా అలవాటయిన ప్రతి వస్తువునూ, భావాన్నీ, శైలినీ అకవిత్వాంశాలుగా ప్రదర్శించడం కనిపిస్తుంది ఇందులో

తగిలింపబడియున్నది జాబిల్లి
చయినా బజారు గగనములోన; పయిన
అనవసరంగా అఘోరంగా.

అని కవిత్వంలో సుప్రతిష్ఠితుడయిన చంద్రుణ్ణి ఎలెక్ట్రిక్ దీపంతో సమానంగా చూసి, వెండి రూపాయి కన్న, రంగుల ఎలెక్ట్రిక్ దీపాల కన్న, 'నాగరీక కన్యల



పవుడర్ పూయబడిన ముఖాల'కన్నా చంద్రుడు తక్కువ వాడుగా చెప్పడం - పాతబడిపోయిన కవిసమయాన్ని బయటపెట్టడం కోసం ప్రబంధ కవిత్వంలో విసుగు లేకుండా వర్ణితమైన స్తన సౌందర్యాన్ని నిర్మొహమాటంగా -

అహో జాతికన్నియ చిక్కని నిక్కబొడుచుకొని
వచ్చునట్టి గట్టి రొమ్ము

అని కల్తీలేని అకవితారీతిలో చెప్పేస్తాడు కవి కార్లనీ సిగరెట్లనీ, మసాలా దోసెనీ కవితా వస్తువులు చెయ్యడంతో మలయా నిలమూ, మల్లెపువ్వులూ మట్టికొట్టుకు పోయాయని చెప్పకుండా చెప్తాడు కూడా వెతికినా సున్నితమైన భావం, సున్నితమైన పలుకుబడీ లేని తనానికి ఈ కవి పనిగట్టుకుని ప్రయత్నిస్తాడు గ్రాంధికభాషని మాత్రమే కాదు, ఆ భాషలో అలవాటుగా కవిత్వపు భాష వేసుకుని తిరిగే పలుకుబడిని బట్టబయలు చేశాడీయన

భావకవులది అమలిన శృంగారం కాగా పరాభిది నూటికి నూరుపాళ్లు మలిన శృంగారం భావకవులది సుకుమార శృంగారం కాగా పరాభిది సుతరామూ సుకుమారతలేని మోటు శృంగారం

అరటిపండున్ పక్కతీసి తినేలా
మింగివేశాన్నేనా నగ్నాంగమ్మును

ఇత్యాది రీతిలో వుంటాయి పరాభి శృంగార' వర్ణనలు పురాణ స్త్రీల పాతివ్రత్యాన్ని కూడా నిర్దాక్షిణ్యంగా భగ్నంచేస్తాడు పరాభి. సీత రాముడి భార్యగా కన్న రావణుడి ప్రియురాలిగా వుండాలనుకుంటుంది

భావకవిత్వం ఆత్మాశ్రయ కవిత్వం కాగా పరాభి కవిత్వం కపట ఆత్మాశ్రయ కవిత్వం. ఈ కవిత్వంలో నేను' కవితో తాదాత్మ్యం గల 'నేను' కాదు ఆకారణం చేతనే, పాఠకుడు తాదాత్మ్యం పొందగల 'నేను' కాదు కూడా. ఎదుటివారిని హేళన చెయ్యడానికి వారి రూపం తనమీద ఆరోపణ చేసుకునే ఎత్తుగడ ఫలితమైన

ఆత్మాశ్రయత్వం మాత్రమే ఇది ఈ పద్యాలలో వచ్చునట్టి 'పరాభి' అను పేరుగల పాత్రకు గ్రంధకర్తకు ఏమాత్రం సంబంధం లేదని గమనింపు" అని ప్రకటించి - కృష్ణపక్షంలోని కృష్ణ'కును దాని గ్రంధకర్త నామంలోని కృష్ణ'కును ఎలా సంబంధం లేదో అలాగే- అని పోలిక తేవడం వెక్కిరింపుకోసం నిజానికి కృష్ణపక్షంలో కృష్ణకీ, కృష్ణశాస్త్రిలో కృష్ణకీ సంబంధం వుంది ఉన్న సంబంధం సున్నితంగా వ్యక్తం కావడానికి వదిలేసి దాన్ని స్పష్టంగా అవును – కాదు అని చెప్పకుండా వుండడం భావ కవిత్వపు పద్ధతి కొన్ని బావాలు అలాగా ఊహకి వదిలెయ్యాలి. మాటల్లోకి తెచ్చామంటే చాలు అవి దెబ్బతింటాయి అనేది భావకవిత్వపు తరహా కావాలని బాహాటంగా పరాభి అనే పేరు కవితంలో వాడి, ఆ పరాభీ, కవి పరాభీ ఒకరు కారనడం – ఆ తరహాని వెక్కిరించడం కోసం

ఆఖరికి ఫిడేలు రాగాల డజన్ అంకితం కూడా భావకవిత్వం మీద వెక్కిరింపు కోసం చేసిందే మృణాళినికి – కాదు కళ్యాణికి, కాదు ఇరువురికి'- అని ఇద్దరికి అంకితం చెయ్యడం బాహాటంగా ఇద్దరిపట్ల ఇష్టం చూపించడంకోసం. ఒక ప్రియురాలు వుండడం, ఆమె ఏకైక ప్రియురాలు –

నా యంతరంగ శాంతిదేవత

నా తపః కల్పవల్లి'

ఇలా ఆమెని గురించి ప్రతికవీ పూజాభావంతో చెప్పడం, ఆమెతో అనుబంధం జన్మ జన్మాలయాత్ర' కావడం భావకవిత్వంలో ప్రసిద్ధం ఆ అలవాటుని వేళాకోళం చెయ్యడం ఈ అంకితంలో కనిపిస్తుంది

ఆర్జవం, అనుభూతి, సెంటిమెంట్ – ఇవి పరాభి కవిత్వంలో వెతికినా కనిపించని విషయాలు కవిత్వపు వేషం వేసుకుని అకవిత్వం తిరుగుతున్నప్పుడు, కవిత్వం అకవిత్వపు వేషంలో రావలసివుంటుంది సరిగ్గా ఈపనే చేసింది పరాభి కవిత్వం సారం నశించిన ఆకారాలు కాలం చెల్లిపోయినా రాజ్యం చెయ్యకుండా వాటి వికృతిని బయటపెట్టిన విధ్వంసకుడు iconoclast, పరాభి ఫిడేలురాగాల డజన్ భావకవిత్వానికి దహన సంస్కారం చేసింది. ఇంక ఆ తరవాత ప్రతిభావంతు లెవ్వరూ భావకవిత్వం రాయలేదు. అలవాటుని ఆశ్రయించుకున్న రెండవ తరగతి కవులు ఎప్పుడూ వుంటారు

అయితే పరాభి కవిత్వం మీద న్యాయమైన విమర్శ ఇంతవరకూ రాలేదు దువ్వూరి రామిరెడ్డి ఫిడేలు రాగాలని తీవ్రంగా ఖండించారు యౌవన ప్రాదుర్భావ సమయమున కామోద్రిక్తుడు కామార్తాహి ప్రకృతి కృపణా శ్చేతనా చేతనేషు' అను కాళిదాసు సూక్తికి ఉదాహరణ ప్రాయుడయి వలపు వస్తువులతో నవసి మతిచెడిన యువకుని ఉన్మత్త ప్రలాపముల' స్ఫురించాయి పరాభి పద్యాలాయనకి భావకవిత్వంపై వచ్చిన తిరుగుబాటు బావకవులకి ఎంత కోపం తెప్పించిందో చూడడానికి ఈ అభిప్రాయం ఉపకరిస్తుంది దాదాపు అంతకోపమూ వచ్చింది సి నారాయణరెడ్డిగారికి 'పాశవిక శృంగార క్రీడలకు, అసంపూర్ణ కామవాంఛలకు పతాకలవంట' వని ఈ గేయాలన్నిటినీ ఖండించి, 'ఈ ధోరణి పరాభితోనే అస్తమించుట తెలుగు కవితలోని ఆరోగ్యవంతమైన లక్షణములలో నెన్నదగినది" అని రాశారాయన

వీళ్ళకి ఎందుకింత కోపం వచ్చిందో తెలియదు కాని ఫిడేలు రాగాలలో కామపరతంత్రత లేదు నిజానికి ఫిడేలు రాగాలు ఎ ఆవేశాన్నీ కలిగించే రచన కాదు ఈ రచనాధోరణి ఆవేశవ్యతిరేకమైన ధోరణి అపహాస్య ధోరణి బావకవిత్వపు 'అకామ' తత్వాన్ని వెక్కిరించడానికి పరాభి చేసిన ఈ కామవర్ణనలు ఎవీ నిజంగా కామాన్ని రెచ్చగొట్టేవి కావు ఇందులో నాయికా నాయకులపట్ల కవికి గూడా హాస్యదృష్టే వుంటుంది ఉదాహరణకి ఆరోజు' అనే పద్యంలోనాయకుడైన పరాభి' శర్కర స్వరం (కర్కశ స్వరాన్ని జ్ఞాపకం తెచ్చే పదం) నాయిక అతనితో 'సమానమయిన లావుంగల్గి/దిట్టంగా జంతువట్లుంటుంది' ఫ్లోరింగదిరేలా/బాటా హయిహీలు బూట్సులు మీదన్/సవారీ జేస్తూ వస్తుంది వారిద్దరూ 'ఎనుంగు గున్నల్లా' గుంటారు. వాళ్ళు '20 అయిటమ్సు అంచి హిమాలయమంత' భుజిస్తారు ఈ పద్యంలో 'ప్రాచీదిశ సూర్యచక్రం రక్తవర్ణంతో/కన్పట్టింది' ఇందులో 'బీడావర్ణిత అధరాలు' అపూర్వంబగు మజా' ఇలాటివి, బావ కవిత్వంలోనూ సంప్రదాయ కవిత్వంలోనూ అలవాటుగా ఒక భావాన్ని చెప్పే సందర్భాలలో వాడే మాటలకి వికృతీకరణలు ఒక కామ భావాన్ని ప్రవర్తింప జెయ్యాలనే దృష్టి కవికి వుంటే, ఆయా ఘట్టాలలో ఈ వికృతీకరణవల్ల కలిగే అపహాస్య భావానికి

ఆస్కారం లేదు పరాభి పద్యాలలో కామోద్రిక్తతను చూడడం పద్య ప్రదేశాన్ని అతిక్రమించడం వల్ల జరిగిన పొరపాటు కాగా భావకవితా మర్యాదల పట్ల అశేష అభిమానాదరాలు గమనించవలసి వుంటుంది; అంతే

(ఇంతకు మించి, 'ఫ్రాయిడ్ ప్రతిపాదించన సెక్సు సిద్ధాంతము' పరాభి కవిత్వంలో వుందని సి నారాయణరెడ్డిగారూ, వాల్ట్‌విట్‌మన్ పద్యములకు పరాభి వచన పద్యాలు అనుకరణ'లు అని రామిరెడ్డిగారూ అన్నారు, కాని ఆ మాటలు పరిశీలనకి నిలవవు వ్యక్తిగా పరాభికి ఫ్రాయిడ్, వాల్ట్‌విట్‌మన్ అభిమాన రచయితలన్నమాట ఆయనే చెప్పుకున్నాడు కాని ఆయన కవిత్వంమీద ఆ ప్రభావాలుండడానికి అంతమాత్రాన ఆస్కారం లేదు ఇలాగే పరాభిమీద ఇలియట్ ప్రభావం వుందని ఆరుద్ర అన్నమాటకూడా పరిశీలనకి నిలవదు నగర జీవిత చిత్రణ చేసిన మొదటి తెలుగుకవి పరాభి అని ఆరుద్ర అన్నారు అక్షరాలా ఇది సరికాదు పరాభి చేసినది ఎ జీవిత చిత్రణా కాదు. కాని పరాభి ఫిడేలు రాగాలలో నగర వాతావరణం వుంది. నిజమే కాని అంతమాత్రాన ఇలియట్‌కీ ఈయనకీ పోలిక చూపించడానికి పూనుకోవడం సరికాదు తెలుగుకవుల మీద ఇంగ్లీషు కవిత్వపు ప్రభావాలు చెప్పడంలో ఇంతకన్న ఎక్కువ మెలకువ అవసరం )

భావకవితా పక్షపాతంతో రామిరెడ్డి, నారాయణరెడ్డిగార్లు పరాభిని చూడగా, రమణారెడ్డిగారు అభ్యుదయ కవితాదృష్టితో చూశారు పరాభి అహంభావ' కవిత్వాన్ని విపరీత వ్యక్తివాదంగా పరిగణించి, అది బూర్జువా బోర్‌డమ్ నుంచి పుట్టిన కళారూపంగా భావించారాయన

చలనమేగాని నిలుపు లేదు. గవేషణమేకాని ఇష్టఫలసిద్ధి లేదు తృష్ణేకాని, తృప్తిలేదు ఉన్నది సరిపోదు లేనిదే కావాలి. ఉన్నదానితోనే ఈసడింపు, లేనిదానితో తగని వలపు అందుచేతనే భావంలోకాని భాషలోకాని 'నిత్య నవీనత' 'అపూర్వత' లక్ష్యమౌతుంది 'వైచిత్రి' ఆరాధ్యమవుతుంది భాష నాజూకుగా లేదు కాబట్టి అవసరం కొద్దీ కాకుండా నాజూకు కోసం ఇంగ్లీషు పదాలను తెచ్చి తెలుగు పదాలకు తోకలు తగిలించు సాంప్రదాయిక భావం కిట్టదు కాబట్టి, అరువు తెచ్చుకుని సొంతపరచుకున్న నవీన పాశ్చాత్య భావాలను దేశవాళీ జనబాణీ భావాలకు ఎరువుపెట్టు

బలంగా ప్రతిపాదించిన తన విమర్శలో రమణారెడ్డిగారు చేసే ముఖ్యమైన ఆరోపణ పరాభిది వైచిత్రీ ప్రియత్వం కోసం వచ్చిన నవ్యత అని రెండవ

ఆరోపణ ఇందులో శుష్క మనోవిలసనమేకాని హృదయ ప్రచాలనం దాదాపులే దని మూడవ ఆరోపణ పరాభి కవిత్వం ఎమీ బోధించదని నాలుగవ ఆరోపణ అతను పక్షాతీతు' డనీ, అలకా పురానికీ - అలగా జనానికీ జరిగే పోరాటంలో ఎ పక్షమూ వహించడనీ ఈ కారణాలు చూపించి ఈ మనస్తత్వం ఒక వ్యాధి లక్షణం అనీ, తనలో పేరుకుపోయిన జిడ్డు వంటి అసంయమిత క్షుద్రోద్రేకాలకు బానిస' అనీ నిర్ణయించారు రమణారెడ్డిగారు తమ అభిప్రాయాలకు పాశ్చాత్య కవిత్వ విమర్శలో కూడా తోడ్పాటు వుందని రోజర్ గరాడీ రాసిన లిటరేచర్ ఆఫ్ ది గ్రేవ్ యార్డ్‌ని ఆధారంగా చూపించారు

అసలు రోజర్‌గరాడీ చేసిన విమర్శనీ బూర్జువా బోర్‌డమ్ సిద్ధాంతాన్నీ పరాభి కవిత్వానికి వర్తింపజెయ్య వచ్చునా అన్న సంగతి చూసే ముందు రమణారెడ్డిగారు పరిగణించని అంశాలు రెండున్నాయి 1 పిడేలు రాగాలు ప్రచురితమైన సందర్భం· చారిత్రకంగా అప్పటి కవిత్వంలో ఈ పుస్తకం వల్ల నెరవేరిన ప్రయోజనం· 2 ఫిడేలు రాగాలలో కామా నికున్న పాత్ర వీటిలో మొదటి అంశం ఈయన పూర్తిగా విస్మరించారు రెండవ అంశంలో రామిరెడ్డి, నారాయణరెడ్డి గార్ల లాగానే పూర్తిగా అతినైతిక దృష్టి అవలంబించారు

ఫిడేలురాగాలు ప్రధానంగా హేళన కావ్యమనీ బావకవితా కాలంలో ప్రసిద్ధ మైన శైలినీ అభిప్రాయాల్నీ, దృష్టినీ, ధ్వంసం చేయడం దానివల్ల నెరవేరిన ప్రయోజనమనీ రమణారెడ్డిగారు గమనించలేదు అందులో ఇంతగా కోపగించు కోవలసిన కామ విశృంఖలత నిజానికి లేదనీ, ప్రతిపద్యాన్నీ ఉన్నది ఉన్నట్టుగా పరిశీలిస్తే కలిగేది అపహాస్య కామమే కాని కామోద్రేకం అందులో లేదనీ ఆయన చూడలేదు

ఇక ఇందులో వైచిత్రీప్రియత్వస్వరూపం ఎలాంటిదో చూద్దాం ఇందులో ఇంగ్లీషుపదాల వాడిక, అసాంప్రదాయక బావాల కూడిక, ఈ రెండింటికీ, విధ్వంసక తత్త్వమే ప్రధాన ప్రేరణలు వీటికి కేవల వైచిత్రీప్రియత్వం కారణాలుగా ప్రతిపాదించడం సరికాదు ఇందులోని ప్రతి కొత్త ప్రయోగమూ, వూహా, అంతకు ముందు కవిత్వంలో ఒక నిస్సారమైన అంశానికి హేళన ప్రయోజనరహితమూ, తదేక పరమార్థమూ అయిన కొత్తదనమే వైచిత్రీప్రియత్వం అవుతుంది అలాంటిది బూర్జువాబోర్‌డమ్ ఫలితమని అనవచ్చును కాని పరాభి రచన ఆ నిందకి తగదు

ఎమన్నా అయితే ఇది పాకీ సాహిత్యం'; literary scavenger పఠాభి సామాజిక ప్రయోజనం దీనివల్ల ప్రత్యక్షంగా లేదు కాని జడతామయమైన సాహిత్యరూపాల్ని ధ్వంసం చేసిన రచన ఇది.

రోజర్ గరాడీ విమర్శనకీ తెలుగు సాహిత్యంలోని ఈ పరిస్థితికీ పోలికలేదు యూరప్‌లో తాత్త్విక పరమార్థాల, ఆచరణమార్గాల ఘర్షణలో, గతితార్కిక భౌతిక వాదాన్నీ, కమ్యూనిష్టు రాజకీయాలనూ విడనాడి, తెగనాడి, ఒక అరాజక అనిబద్ధ స్వేచ్ఛాజనిత క్షోభనీ గత్యంతర రహిత అశక్తతనీ అవలంబించి, దానికి విశేష ప్రచారం, ప్రాముఖ్యం కలిగించిన ఒక వర్గం రచయితలు ఎర్పడ్డ పరిస్థితిలో రోజర్ గరాడీ ఈ పుస్తకం రాశాడు ఆ పరిస్థితుల్లో వర్తించే వాదనలను పఠాభి పుస్తకానికి పట్టించడం సమర్థం కాదు

అహంబావకవిని అని పఠాభి చెప్పుకున్న పేరు రమణారెడ్డిగారు కూడా వాచ్యార్థంలోనే గ్రహించారు ఈ అహంభావం నిజానికి ఈ కవిత్వపు లక్షణం కాదు భావ కవిత్వపు లక్షణం; సంప్రదాయ కవిత్వపు లక్షణం

ఎవ్వరిని యెంతురో నన్ను ఎ ననంత
శోక భీకర తిమిర లోకైక పతిని

అని అతిలోకమైన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించుకుంటాడు భావకవి ఇక సంప్రదాయ కవులైతే కవిత్వవ్యక్తి చాటుకూడా లేకుండా నేరుగా తమను గురించి తామే గొప్పలు చెప్పుకోడం ప్రత్యేక కళగా సాధన చేశారు భావకవిత్వం నుంచి అప్పుడే విడిపోయి ఒక కొత్త ప్రాచీన సంప్రదాయ మార్గానికి ఆచార్యత్వం వహించబోతున్న విశ్వనాథ సత్యనారాయణగారు తాము - అలఘు స్వాదు రసావతార ధిషణాహంకార సంభార దోహల బ్రాహ్మీమయ మూర్తి" నని చెప్పుకున్నారు ఈ లక్షణం మీద సాముదాయకంగానూ, భావకవి అహంకార ప్రదర్శనం మీద ప్రత్యేకంగానూ ఈసడింపు ప్రకటించే పేరు -పఠాభి పెట్టుకున్న 'అహంబావకవి' అనే పేరు దీనికి వాచ్యార్థం పొసగదు అంతేకాదు, ఫిడేలురాగాలలో ఒక విలక్షణమైన ఆత్మనిరాకరణతత్వం వుంది ఇది భావకవిత్వంపట్లా, సంప్రదాయక కవిత్వంపట్లా పరిహాసదృష్టిని కల్పించడమే కాని, తన రచనామార్గంపట్ల అనుయాయిత్వాన్ని ప్రోత్సహించదు

పరాభిని చూసి ఇంగ్లీషు - తెలుగు కలగాయభాషతో రచనలు చేసినవారు పరాభి కవితామార్గాన్ని అనుసరించడం లేదు అతనిలో ఉపరితలం మీద కనిపించే లక్షణాలను అనుకరిస్తున్నారంతే నిజానికి పరాభికి ఇతరులు అనుసరించదగిన కవితామార్గం లేదు ఎలా రాయకూడదో చెప్పడమే అతని పుస్తకం చేసే పని

తాత్వికంగా పరాభి అరాచకవాది ఆమేరకి అతనిలో కాల్పనిక తత్వం వుంది అభ్యుదయ కవితాయుగంలో వచ్చిన చైతన్య కవిత్వానికి పరాభి ప్రత్యక్షంగా సాయపడింది ఏమీ లేదు కాని అతని పరోక్ష ప్రయోజనం విస్మరించదగినది కాదు

[1987లో వెలువడిన 'తెలుగులో కవితా విప్లవాల స్వరూపం' అనే పరిశోధన గ్రంథంనుండి]

# ఇంట్రో

ఒక మాటకు ఒక అర్థం అదీ న్యాయం, కాని ఈ ప్రపంచంలో చూడండి ఒక మాటకు పది అర్థాలు ఒక అక్షరానికే లక్ష అర్థాలు శ్రీ అనే అక్షరం, లేదా మాట చూడండి - ఎన్ని అర్థాలో చూ నానార్థ నిఘంటువు

ఇక రెండో కొసను . ఒక అర్థానికే కోటి పదాలు ఉదాహరణ, స్త్రీ స్త్రీ వాచకానికి పర్యాయ పదాలు ఇంతవరకు సంపుటీకరించిన శాస్త్రిగారెవరూ నాకు కనబడ లేదు

ఈ పదార్థాల నిరంకుశత్వం భరించ లేదు నవకవి ఒక పదం అనేక అర్థాలను అంత పురంలో దాచుకొనే వివాహం, ఒక అర్థం అనేక పదాలతో విచ్చలవిడిగా విహరించే వ్యభిచారం, రెండూ నచ్చవు నవకవికి

వ్యాకారణం మాత్రం ? వాక్యానిక కర్త కర్మ క్రియల అనుబంధం విధిస్తారు కాదూ? వీటికి నవకవి విడాకులిస్తున్నాడు. కర్త లేకుండా ఒక్క క్రియమాత్రమే నిరంకుశంగా విహరిస్తాంటే కొందరు కళ్లు పొడుచుకుంటున్నారు కాని కవి సర్వతో ముఖ స్వాతంత్ర్యదూత స్వేచ్ఛాదాత అవ్యయం అనాచ్ఛాదితంగా ఆకాశ మధ్యంలో ఊగవచ్చును విభక్తి విశృంఖలంగా షికారు పోవచ్చును. ప్రతిఫలం విచిత్ర సౌందర్యం

విచిత్రమే సౌందర్యం సౌందర్యమే విచిత్రం

ఛందస్సుల చండశాసనానికి కూడా కాలం వెళ్ళిపోయింది కవిహృదయంలోని రాగాలాపన ఎట్టి తీగలుగా సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలి లయ గ్రాహిలో వసంత వర్ణన మహోగ్రస్రగ్ధరలో యుద్ధగీతం ఒకప్పుడు బాగానే నడిచాయి నవకవికి అనుకరణ అసహ్యం క్రొత్త శక్తులు క్రొత్తరూపం సాక్షాత్కరించాలి

ఇవన్నీ ఋణపక్షాన నవకవుల తిరుగుబాటు వారు సాధించిన ధనం ఏమైనా ఉన్నదా అని ప్రశ్నిస్తారా?

చదవండి సిడేలురాగాల డజన్

మదరాస్

ప్రమాది అధిక శ్రావణ శుక్లద్వాదశి. శ్రీ. శ్రీ.

అంకితము :

మృణాళినికి ,

కాదు కళ్యాణికి;

కాదు ఇరువురికి.

అక్కడక్కడ ఈ పద్యాలలో
వచ్చునట్టి పరాభి అను పేరుగల పాత్రకు
గ్రంధక ర్తకు ఏమాత్రం సంబంధంలేదని గమనింపు.
'కృష్ణపక్షం లోని 'కృష్ణ' కును దాని గ్రంధక ర్తనామం
లోని 'కృష్ణ' కును ఎలా సంబంధం లేదో అలాగే

# ఆత్మ కథ

ఎవర్నని యనుకొంటిరో మీరు నన్ను?
ఎను పరాభిని .. ...
కాంగ్రేసు రాష్ట్రపతి స్థానానికోసం
బాబూ సుభాసుబోసుతో పోటీజేసి
ఓడిపోయిన డాక్టర్ పట్టాభిని
గాన్నేను, మరో పఠాభిని;
అయితే అతగాడి కున్నంత
ఉపజ్ఞ నాకున్ లేదని తలంపకండీ,
గాంధీటోపీ జవ్వారుజాకట్
మీసాలు లేకున్నంత మాత్రాన.
పయిజమ్మాలు వేస్తాను కాబట్టి
నన్ను మీరు షోదాయని సోషలిస్టని
తిట్టబోకండి, ప్రఖ్యాతంగానున్న
కవిన్నేను;
నాకు విచిత్రంబగు బావాలు కలవు
నా కన్నులందున టెలిస్కోపులు
మయిక్రాస్కోపు లున్నవి.
నా ఈ వచన పద్యాలనే దుడ్డుకర్రల్తో
పద్యాల నడుముల్ విరుగదంతాను;
చిన్నయ్‌సూరి బాలవ్యాకరణాన్ని
చాల దండిస్తాను;

ఇంగ్లీషు బాషాబాండారంలో నుండి
బందిపోటుం జేసి కావల్సిన
మాటల్ను దోస్తాను.
నాయిష్టం వచ్చినట్లు జేస్తాను
అనుసరిస్తాను నవీన పంధా; కానీ
బావకవి న్మాత్రము కాన్నే, నే
నహంబావ కవిని



# జాబిల్లి

తగిలింప బడియున్నది జాబిల్లి
చయినా బజారు గగనములోన; పయిన;
అనవసరంగా అఘోరంగా!
ఓహో. ఏమిటీ జీవప్రవాహం క్రిక్కిరిసిన
పిచ్చి ఉబలాటంతో క్రింద? –
మనుష్యులు, మోటార్లు, ప్రాణాలు, యంత్రాలు
భుజాల రాసుకొంటూ, ఉన్మాదంతో
పోతూన్నవి త్రోసుకొంటూ, పొత్తుకుంటూ.
ఏమారిగూడ నీ వంక ఎవ్వరూ
కడగంటి చూపయిన పరపరోసీ శశీ
నీ విచ్చు ఖరీదు లేని
సుధామధుర బాదం ఖీరేని
మూంజూడరు, త్రాగ రీ నాగరీకులు;
ముఖరింపుచున్నది మా కర్ణాలలో
గుండియ అందుగూడ, వెండి రూపాయి
ఘలంఘలా శ్రావ్యసంగీతము కర్ణ పేయముగా,
అయ్యో జాబిల్లీ ఏమి నీ జాయమానం!
నిన్ను పోగొట్టుకొన్న రూపాయలాగ నైనా
భ్రమింపరే ఎవ్వారు; నిజంగా
నీ విచ్చోట బొత్తిగా అనవసరం సుమీ
మా కళ్ళు మురిసిపోవును యలక్ట్రికు

దీపాల ధాళధళ్యమ్ముమనకు, యలక్ట్రికు
అడ్వర్టయిజుమెంట్ల రంగు రంగుల
కాంతి చేయు ఉన్మాద నగ్ననర్తనమ్ముమనకు;
నిమిష నిమిషానికి వింతరూపాన్ని ధరించు
యలక్ట్రికు బల్బు పేరులంటే
మాకు బలే సరదా బలే గమ్మత్తు
కానీ దురదృష్ట శశీ.
నీవు మాత్రం పదిహేను రోజుల్లోనగాని
నీ రూపాన్నంతా మార్చుకోలేవు
చాలా కాలం, చాలా ఆలస్యం,
ప్రజాదృష్టిని ఆకర్షించటంలో,
మార్కెట్లోని దుస్సాధ్య కాంపిటీషన్‌కు నీవు
తట్టుకోలేవు జాగ్రత్తసుమా
దివాలా తీస్తావు, నీ విచ్చోట
ఖచ్చితంగా అనవసరం నిరుపయోగం కూడానూ.
శశీ. కవీశ్వరు లఖండంగా వినుతించినట్టి
నీ గుండ్రని మోమందపు తరహా సయితము
మా కేమి నచ్చనే నచ్చదు
నోరూరును మాకు, నాగరిక కన్యల
పవుడర్ పూయబడిన ముఖా లంటే, వాటిని
మా కళ్ళ పిడికిళ్ళతో గట్టిగా పట్టి
తిండిబోతుల్లాగ తినివేస్తాము
శశీ. చయినా బజారు గగనానికీ నీకూ
ఏ మాత్రం సరిపోదు దాంపత్యం

కనిపిస్తావు నీవు, స్పాన్సర్సు కంపనీ
లేక పయిటవేసులోకీ
దారి తప్పి ప్రవేశించి
తందరాడుచున్న దరిబేసి గ్రామస్తున్లాగ .
సుమ్మాటికీ నీ విచ్చోట అనవసరం.
అనవసరం, అనవసరం యిస్సీ .
ఓ దేబిరిస్తున్న శశీ



# మరీనా

పాడ నారంభించింది రేడియో ;
సముద్రం ప్రక్కన సముద్రంలాగా
మనుష్యుల తోడ మూగిపోయింది 'మరీనా బీచి' :
అన్నితరగతుల మద్రాసు ప్రజ అచట వున్నది
పలురంగు వలువల గట్టుకొని లలనలు
ప్రదర్శించు కొనుచున్నారు
ఆహా ఎంతెంత
ఆనందము . బంగాళాఖాతం మీదినుండి
వచ్చేగాలితో కూడా,
"ఈవినింగ్ ఇన్ ప్యారిస్,"
అక్వేరియం హోటల్లోనుండి మాసాలాదోసె వాసన
"గోల్డుఫ్లేకు" పొగా "కరల్సు" తిరుగుచుంది
ఆ సముద్రతీరము నందున
అహో ! జాతికన్నియ చిక్కని నిక్కబొడుచుకొని
వచ్చుచున్నట్టి గట్టి రొమ్ము,
మగనిచే తృప్తిగననట్టి
అయ్యంగారి లలామ గీటు "హంగ్రీ" కనులు
"క్వీన్మేరీసు" లోని కీరవాణుల
పొడి పాము కొనబడిన ముఖాలు, చూస్తూ చూస్తూవుంటే,
నోరూరుచుందా నాకు, లేక నా సమస్తాంగాలు
సముద్రంలోని యలల్లాగా

రుద్రన ర్తన చేస్తున్నాయా ? -
"న్యూన్యూ మోడల్సు మోటారు కారులు' బారులు తీర్చి
పొడుకుప్కు, నిల్చొ నున్నవి
బళీ . ఏమిసోయగ మీ యమెరికన్ కార్లది.
అమెరికన్ స్త్రీలరకం కున్నవి
ఉబ్బుకొనివచ్చే 'సెక్సులపీలు" తో,
రాత్రి పడింది,
రగులు నలుసులుగల నల్ల తారులాగా :-
ఒకింతసేపగు సరికి
సమూహమంతా కరిగిపోయింది, మిగిలింది
సమాజములోని 'మడ్డి' మటుకు :
అన్నంముద్దకయి కక్కుర్తిపడి
శరీరాన్ని సవారికిచ్చే జవరాళ్ళు
తొమ్మిదణాల సినిమా టిక్కెటునకు
తమ బహిర్దేహము మీద
యాత్రచేయుటకు హక్కునిచ్చే
కొంద రాంగ్లో ఇండియన్ అభాగినులు,
ఈ కార్యాల "ఛాన్సు" కోసం
ఇటూ అటు తటపటాయించుచున్న
'మర్యాదస్తు' మంద,
ప్రకటించుచున్నవి తరంగాలు
బిగ్గరగా తమ యసమ్మతిని
గాలి ఏడుస్తూంది,
రగులుచున్నవి గగనములోన

భువి కార్చిన కన్నీటి చుక్కల్లాగ
తారకలు,
కానీ మనుజుని మనస్సులో రేగుచున్నవి
రకరకాల కోరికలు



# వర్షం

మహానగరము మీద మబ్బుగమి
గర్జిస్తున్నది :-
దేవుని ఏరోప్లేనుల్ భువికి దిగుచున్నట్టుల -
డమడమ, దడదడ, ధరధర
శబ్దంచేస్తూ
వర్షం పడుచున్నది పదిగంటల పగటివేళ,
ఉడతలు, ఎలుకలు, మిడతలు చచ్చి పడియున్న
చవిటి కాల్వల నీరు పొంగీ,
మురుగుగబ్బు గల గాలివడి తోడ
చిటపట చిటపట చినుకులు పడుచున్నవి కడు
నిలచినది మనుష్యుల నడక
అంగళ్ళందున కళ్ళకు అగపడిన వరండా లందున
వొదుక్కొనుచున్నారు తమ దుస్తులు తడస్తాయని
మర్యాదస్తులుగూడ,
నీళ్ళు పారుచుండే వీధుల్లో
బస్సులు మాత్రము బుస్సని పోతున్నవి, యవి
ఇరువంకల విరజిమ్ముచు జలాంచలమును;
పాతబడినటువంటి
బస్సుల లాగ బడబడ యనుచున్నవి నల్లమబ్బుల గుంపు.
దడదడ పడుచున్నది వాన
కాఫీ హోటల్సు లోపల కూచోని

గరం గరం గరంగా
బజ్జీ వడ మున్నగునవి తినుచున్నారు
పురవాసులు కొందరు కొందరు
పొరుగింటి పిల్లను గూర్చి బలే
గరం గరంగా వర్ణిస్తున్నారు
మిలియను జనములు మిణుగురుబువ్వుల
కొరుకు చున్నటు లున్నది మేఘధ్వని
బుడబుడ బడుచున్నది వాన,
విద్యార్థులంతా మనఃపూర్వకముగా
- అయవారుల్ కూడా ఎందుకాకాదు? -
చేసిన వేడ్కోలు బలమ్ముచే కాబోలు
వర్షం పడుచున్నది పదిగంటల పగటివేళ,
అదో రసాల్మామిడి పండ్ల నమ్ము
ఎనాద్దానిం జూడుము
పయ్యెంట తడసి, కండ్లకు
పండుగ జేస్తున్నవి దాని
రసాల్మామిడిపండ్ల లాంటి పాలిండ్లు
ఇలాతల మంతా మహాసంతోషంతో
పచ్చంగా నవ్వుచున్నది,
గగనం మట్టుకు ఎడుస్తున్నది,
అయ్యో టయి మయింది ఆపీసునకు
పోవంగ నాకు, పోకుండిన
నా బాస్ మేఘంలాగ
ఉరంతాడు

కానీ ఎదీ ఓ సిగరట్టు, "హరీ అప్."
విడిపించనిమ్ము నాల్గు క్యావీండర్మబ్బులు,
తర్వాత ప్రారంభిస్తా అనంతమగు
అకవుంట్లతో నాయుద్ధం.



# సీత

సీత నా సహాధ్యాయిని సీతా నేను గలసి
నవీనమగు విశ్వనాధ సత్యనారాయణ కృత
రామాయణ మహాకావ్యమును
పఠించినాము,-
పఠన ముగిసిన తర్వాత
సీత వంకజూచి, సీత ఆలోచన లోచనాల
వంకజూచి, ప్రశ్నించా ఈలాగా
"రామాయణాన్నంతా విన్నావు గదా
ఆదర్శపురుషుం డనబడు పురాణయుగం
నాటి రామయ్యతో
పవన జవ గమనుల మయి,
భూతకాల కాలాటవిలోకి జొచ్చుకొనిపోయి
కలిశాము గద, అతన్ని
అనుసరించి అడవికి పోయాము,
మరుగుననుండి వాలిని పరిమార్చుట జూచినాము,
తన సతిని అగ్నిపరీక్ష చేయటం చూచినాము
ఇదంతా చూచాక,
"సీతా నువు పురాణ యుగంనాటి
రామయ్య సతి సీతలాగా
వుండాలని వాంఛిస్తావా? చెప్మా
ఇటుల నేను వచించటము విని

అనింది :
"పరాభీ . పతివ్రతా శిరోమణి సీత,
భారతీయ స్త్రీమూర్తి సీత,
అట్టి సీతగావుండే బాగ్యం
అది అందరాని అపూర్వ మహాబాగ్యం కదా
కానీ, సీతగ వుంటానికి నేను
కోరినా రామయ్య సతిగావుంటానికి మాత్రం
ఒప్పుకోను ఎమ్మాత్రం నేను"
-"బలేమాట అన్నావు, సీత బలే,'-
"రామయ్య సతిగానుంట కన్న
రావణుని ప్రియురాలిగా వుండి
హృదయంగల అసురుణ్ణి అమరుణ్ణిగా
చేసివుండేదానిని నాప్రేమ బలంతో; -
అదిసరే, పరాభి. నీ కేమన్నా
రామయ్యగా వుండాలని కోరికవుందా?"
"ఆ. ఎమ్మాటన్నావు, సీతా.
నీకు రామయ్య సతిగావుంట ఇచ్ఛ లేకున్న
నాకు మటుకు
రామయ్యగా వుంటకు ఎలా యిష్టం వ్వుంటుంది?
రామయ్యగావుండే దానికంటే
రావణుని గావాలని నా వాంఛ -
పది మూతులతోను, నీ పెదవులను
మృదు శరీరమును, వదనమును అదుముతాను,
ఇరవయి కళ్ల సంకెళ్లతో నిన్ను

ఃిరతము బందీ చేస్తాను,
ఇరవయి లావు చేతుల్తో నిన్ను
నా పక్షానికి లాగు కొని
చిక్కని కపుంగిలింతలో
అయిక్యం చేసుకొంటాను నిను, నాలో, సీతా?
సీత నా సహధర్మచారిణి
ఇప్పుడు



# పోలీసు

చీలు దారుల్లోన నిల్చొనున్నాడు
పోలీసు బటుడు
ఖాకీ దిర్సుం ధరించి తల మీద
కుసుంబా కుళ్ళాయి గల్గి
మహా చోద్యమ్మగా.
బరత నాట్యం బాడుచున్న
ప్రశాంత ప్రకాశముఖంబు తోడి
నటర్షి చూడామణి లాగ
కన్పిస్తున్నాడు,
డ్రయివర్లందరి కళ్ళ చేతన్
పూజింప బడి గవురవింప బడి.
వాడుం జూపించు నిష్కర్షయగు
తన చేతి ఓ ముద్ర చాలును
రహదారి ట్రాఫిక్కంతా నిల్చిపోవంగ
అతగాడి బహిరంగ ప్రదర్శనమ్ము
చేతన్ స్తంభీబూతం బయిన
జగ జ్జంగమ ప్రకృతి మోస్తరు;
ఓఓ సారి తన
భ్రూ విక్షేపము చేతనే బండ్లన్
బలవంతంగా నడుపగల, మహా
సామర్థ్యం బున్న దతడికి

నటరాట్టు లాగా నతండు కూడ
మృత్యుంజయ నృత్యంబును
సల్పుచుంటాడు సతతము -
బల్బు హార్లన్ల తాళం తోడి
యిలక్ట్రీకు హార్నల రాగానికిన్ని
మోటారు సయికిళ్ళ మృదంగానికినీ
అనుగుణ్యంగా నర్తిస్తుంటాడు
తటాల్మని ఇటూ అటు తిరుగుచు
హస్తాల నందమ్ముగ ద్రిప్పుచు,
ఎమా యపూర్వ దృశ్యం.
మండుచున్నట్టి మాడుచున్నట్టి
మే మాస మధ్యాహ్న కాల మందేని
బానల్తోడ పోసినట్లుం గురిసేటి
బాద్రపద మాస వాన యందేని,
తన నిర్ణీత ప్రదేశంబు నుండి
ఓ యంగుళమ్ము గూడా జరుగడు
ఎ ప్రచండాతి ప్రచండ ఘోరాతి ఘోర
తీవ్రాతి తీవ్ర తపస్సుం
జేయుచున్నాడో నిష్ఠ తోడన్?
చరాచరములన్ తారుమారు చేయగల
మహాశక్తి సంపన్నుండగు యోగి
కాడా ఈ పోలీసు బటుడు? ఈ మహా నటుడు?
అవు నీతనికి పవరున్నది కడు
చీలు దారుల్లో నిల్చొని యున్న

పోలీసు బటుణ్ణి చాలా నేను
స్తుతి చేస్తాను. బలే గౌరవిస్తాను
యింకా ముగ్ధుండనయిపోతాను కూడా
వాని బరతనాట్యంబును చూచ్చాడ.



# ఆరోజు

గణగణ గణమని టెలిఫోను మ్రోగింది
ఉపయాన ఆరింట, నా గుండియ
లో గూడ గణగణమని
బంగారు చిరుగంటలు సంగీతము
చేసినవి -
నారీ చర్మకర్ణాలలో శర్కర స్వరంతో
మాట్లాడగలట్టి నాకీ
రిసీవరు లోహంపుటియర్ లోనన్
మాట్లాడుటకు బయమేల?
నాకింత వణకేల ఇంత అదరేల?
"హలో పరాభి లీల్ స్పీకింగ్"
"గుడ్ మార్నింగ్ డియర్లీల్"
"ర్నింగ్ లిసన్ పరాభి ఈ రాత్రికే, నేన్
కాకినాడ పోవాల్సియున్నది
నీవ్వచ్చి నన్ను కడసారి సిటీ
లోకిం దీసుకపోవాల తక్షణం రాఎుు
"ఆల్రయిట్ లీల్". ...
షేవ్ జేయ సన్నాహపడ్డా, నంతట
ప్రాచీదిశ సూర్యచక్రం రక్త వర్ణంతో
కన్పట్టింది; ప్రభాత రేజరు
నిసినల్లని చీకట్ల గడ్డంబును షేవ్

జేయన్ పడిన కత్తి గాటట్టుల;
మరో అరగంటలోన న్నేను
స్టయిలిషుగ డ్రస్సుం జేసుక
గరల్స్ హాస్టల్ విజిటర్సు రూమ్‌లోనన్
హాజరయ్యాను; - ఫ్లోరిం గదిరేలా
బాటా హయిహీలు బూట్సుల మీదన్
సవారీజేస్తూ లీల్ వచ్చింది
నాతో సమానమయిన లావుంగల్గి
దిట్టంగా జంతు వట్లుంటుంది
అటనుండి రిక్షాదీసుక
మూర్మార్కెటునకు పోయాము -
ఎనుంగుగున్నల్లాగున్న మేమిర్వురము
రిక్షాలో పట్టామా?
వదుక్కొని కూర్చున్నాము
అదేమి చిత్రమ్మోకాని లీల్ చేయి
నామీద నుంచగానే
అపూర్వంబగు మజా కలిగింది -
షాపింగ్ జేసి పూర్తి అయ్యేసరికి
సెంట్రల్‌స్టేషన్ టవరుక్లాకుక్క
ఒకటిన్నర జూపింది . .
బ్రాడ్వేకిబోయి బోజనం కోసం
కోమల్విలాసులోన ప్రవేశించాముః-
20 అయిటమ్సులంచి హిమాలయమంత భుజించి
చిన్ని పిరమిడ్సులాగున్న బీడాల వేస్తూ

బర్రని తిరుంగుచున్న పంకా క్రిందన్
మత్తుతో నా హృదయమ్ము తిరుగ,
21-వ అయిటము లోపించిందని కాబోలు
నా బీడా వర్ణిత అధరాల తోడన్
జహంగీరు తీపులాంటి లీల అధరాలం దాకినాను
కోప్పడ్లేదు, ఇష్టపడినట్లుండింది లీల్
ఇంతలో బిల్లుందీసుక
ప్రవేశించాడు అయర్బ్రడవ
అటనుండి లేచి వచ్చేసి లీల్తో
మ్యాటినీషోకి పోతామా అని ప్రపోస్ జేశాను
సరే నన్నది హేహేహే టాక్సీ
లోన కూలబడ్డా డ్రయివ్ టు రాక్సీ
మే మిద్దరం బానుక కూర్చున్నాము
లీల్ కచాలు నా ముఖంమీద
నాట్యంచేస్తూవుంటే వాటిన్ నా మూత్తో
లాగుచూ ఆడుచుంటిని .
రాక్సీ ముందునిలిచింది టాక్సీ టాక్సీకి డబ్బిచ్చి
టూ వంటూ టిక్కట్లు తీసుక పోయి
కూర్చున్నాము సగం ఆటలోనన్ -
వామ హస్తాన్ని లీల్ బుజంమీద వేసి
మరో హస్తాన్ని లీల దేహంతో పరిచయం జేశాను
కాలం బాలాగ గడచి పోయింది
హాల్లోనుంచి వచ్చేసరికి ఒకళ్లోనుండి
ఒకళ్లోకి వచ్చామా అన్నట్లుండింది; మేం జూసిన

పిక్చర్ టయిరోన్ పవర్ ఆక్టుజేసిన సూ యేజని
గ్రహించాము వాల్పోస్టర్సుం జూచి,
అటనుండి హోష్టలునకుం బోయి సరిగ్గా
టయిముకు వచ్చాము రయిలు స్టేషన్కు
కలకత్తా మెయిల్ క్యాజ్జేయః-
కలకత్తా బ్లాక్ హాల్లాగ క్రిక్కిరిసి
వున్నదీ కలకత్తా మెయిలు
ట్రయిను కూతకూసింది, లీల్
కంపార్ట్ మంట్లోనుండి
సాలోచన లోచనాలతో నన్నుంజూస్తూ
వేళ్ళాడించింది, ఎముకల్లోని
మూలికల్తో సహా వణకి పోయాన్నేను
తాళ్ళేక అమాంతంగా
కదల్తూవుండిన రయిల్లోకి వురికాను,
లీల్ మాట్లాడ లేదు
గుప్పుగుప్పుమని ధూమం విడుస్తున్నది రయిల్,
మరో పనిలేక మహోత్సాహంతో స్కాండల్సు
మాట్లాడే మద్రాస్ పబ్లిక్ లాగ;
సూళ్ళూరుపేటకు పోయాక మేమిద్దరము
సకండ్ క్లాస్ కంపార్ట్మంట్లోకి
మార్చుకున్నాము -

* * *

ఆ రాత్రి యాత్ర మరవాలన్నన్ మరపురాదు



# వసంతం

వసంతర్తువు వచ్చిందని నేను
విన్నానీ మద్రాస్సిటీలోకి –
ఏదీ వసంతం?
కోకిలా రావం బేదీ వినుబడలేదే నాకు,
విధీ విరామం లేని
బస్సు ట్రాముల గోలతప్ప;
నిజంగా వసంతకాలం వచ్చిందా?
అదో చూడుము.
కన్నుల్గుట్టు నట్టి అక్కరమ్ములతోడన్
చల్లారామ్సు షాపుముందు
"వసంతకాలంపు టఖండ అమ్మకా" లని
"ఖరీదుల ఫనా ఫనా" అని
"కిమ్మత్తుల సరకు," డనీ
ఏలా అడ్వర్టయిజు చేయంబడి యుందో.
తప్పకుండా వసంతకాలం
వచ్చి యుండాలః –
అదీగాక నేటి పత్రికలోన
ప్రచురింపబడ్డ పండితోత్తముని పద్యాలు
చదినావా ఋతురాజును గూర్చి?
"తాలాశ్వత్థ హింతాల నారికేళన్యగ్రోధ

జంబీర పున్నాగ పలాశ రసాల సాలాది వృక్షాలు
చిగిర్చినా" యంట
నవ్వుస్తున్నది నాకీ పండితుడు
అమరమ్ములోని వనౌషధి వర్గాన్నంతా
– ఒక వృక్షాన్ని కూడా స్వయంగా చూసినపాపాన పోడు –
గుప్పించి విడిచి నందులకు
అదో చూడుము. స్త్రీలు
తలలందు కుప్పలుప్పల పూలగర్గి
చీరల్నిండా మహావృక్షజాతులను
అద్దించుక
వికసిత లతాకుంజాల్లాగ కన్పిస్తు
మద్రాసు నగరలక్ష్మికి నిజంగా
వసంతం వచ్చినట్టుల
నిరూపిస్తున్నారు
సఖా. నీ వేమాత్రం జంకకుండా స్త్రీల్
తమ వేనళ్ళలో నలంకరించుకున్న
ఆ పుష్పాల నాఘ్రాణింపుము
తప్పేమున్నది?
యిందుకాకున్న మరేల వాళ్ళు
తమ కన్నులకు కన్పింపకుండ
ముక్కునకు చాలా దూరంలో
తురుముకొన్నారు పూలను?
వసంతకాలం మద్రాసులోకిన్
వచ్చింది కాబట్టి

సాహసించి ఆఘ్రాణించుము మిత్రా
సాహసం లేనిదే సౌఖ్యమ్మంత
సులభమ్ముగా రా దీ రోజుల్లోన
అదీగాక, స్త్రీచిత్తంకూడా సరళంగ
వుంటుంది గదా వసంతం వచ్చింది కాన



# బోగందాన!

మద్రాసు నగరము. నీ మీద బ్లూ బ్లాక్
సిరాలాగ పడింది రాత్రి.-
మింటుస్ట్రీటు కిటికీలలోన మినుకు మినుక్కు
మనుచున్నవి దీపికలు కను గీటుచున్నయ్యన్నట్లు;
అధికమగుచుంది
మనుష్యుల రాకపోక లచటికి,
సగంకాంతి సగం చీకటిగల యిండ్లలోపల
కూర్చొనున్నారు బోగంచానలు
ప్యాన్సీమార్కెట్లోని జపాన్ సరకుల్లా, మవునంగా
కిసన్ సిం గంగడిలో నమ్మంబడు
తీ బూందీ పొట్లాలంబోలు వారి చను
లూగుచున్నవి, చేతుల్లేని
తోపురంగు మ్యాటీక్లాతు రవికల్లోన
అలవాటు పడినట్టి యాదుర్దాతో
నిమ్మళంగా;
ఒక యంగుళ దళముగ, నల్క
పడియున్నది టాల్కంపవుడరు వారి ముఖాల;
రక్తంలేని వారి యధరాలపయి
నంటుకొనియున్నది మాసిన హాసరేఖ;
అచటికి వస్తున్నారు అన్నివిధాల మనుష్యుల మూకః-
ఈవినింగ్ హ్యాటులక్రింద

ముడుచుకొని తమ ముఖాల వస్తున్నారు మునికాళ్ళ
జంటిల్మన్ యంటారే వారు·
హాస్టల్నుండీ
తప్పించుక వచ్చిన విద్యార్థుల్ కూడా
వస్తున్నారు; వస్తున్నారు
దొంగలు, త్రాగుబోతులు లీడర్లు, ప్లీడర్లు
పూజారులు, జారులు,
తమ రూపాయి డబ్బులతోడన్
వలపును పర్చేస్ చేయడానికి
ఓ బోగంచానా నీవు
సంఘానికి వేస్టుపేపరు బాస్కెటువా?
మష్టమషాణము పడవేయబడునట్టి దిబ్బవా?
తమ రూపాయికోసం నిను
తమ్ము ప్రేమించాలని, ప్రథమ ప్రేమలో బడ్డ
అమ్మాయిలా అమాయికంగా
ప్రవర్తించాలని కోర్తారే అందరు
తమ్ము తామే మోసపుచ్చుక
నిన్ను గవురవిస్తున్నా నేను
నీలోనే నాకు జీవితం నిజంగా
సరిగ్గా ప్రతిఫలిస్తున్నది
ఇతర స్థలాలలోన
అంతా బూటకం అంతా నాటకం గొప్ప అబద్ధం
పూజారి యబద్ధం
పరపురుషుని జూచి తలవ్రాల్చే

పతివ్రత సతీత్వ మబద్ధం
యోగు లబద్ధం, అందరూ అబద్ధం
సర్వ మబద్ధం
కానీ నీవు మటుకు ఓ బోగందానా!
ముసుగులేని నిష్ఠురమగు నిజానివి
నీడ పడనటువంటి నిర్మలమగు నిజానివి



# నవ్యస్త్రీ

అదో అదో అదో చూడుము
నవ్యస్త్రీ పోతూన్నది నాయ్రరోడ్డున
సిగ్గిల్లకుండా టక టక టక మంటూ
హాయి హీలుయాన
ఆ స్త్రీ హస్తములోని హ్యాండు బ్యాగయ్యున్న నేను
ఎం బాగుండును. ఎం బాగుండును
ఆ హ్యాండు బ్యాగులోని అద్దంబయ్యున్న నేను.
అహో! రవికందున గ్రుచ్చబడి
స్వర్గద్వయం మధ్య నూగాడుచున్న
ఆ స్త్రీ వక్షము మీది
లేడీస్ పార్కర్కలంబుగానున్న నేను
నా రక్తాన్నే సిరాగా పోస్తాను
నిజంగా పోస్తాను,
ప్రచండవేగాన పరుగిస్తూన్న
ఈ మద్రాసు పట్టణంపు టశాంతంలో
నీమీద కళ్లునిల్పుట
బలేహోయి, డీలక్సుకుషన్ సోపాలమీద
కూలబడినట్లుండును
ఓ నవ్యస్త్రీ.
బక్కచిక్కిన బిల్డింగుల అస్తిపంజరాల్లా
ఉన్నట్టి ఈ మాంబళం ష్టయిలు

బిల్డింగులమధ్య
హేరాళంబగు కమాన్లతో, డోములతో నున్న
నీ ముషల్‌ష్టయిలు దేహంపుకట్టు జూచుట నాకు
అమృతాంజనం పూసినట్లున్నది;
క్రాస్వర్డు పజిల్సులాగున్న
నీ కన్నులను సాల్వుజేసే మహాభాగ్యం
ఏమానవునిదో కదా
లిప్‌ష్టిక్కుతోడన్ విరాజిల్లు నీ నోరు
నా కళ్లకు కనిమారాలో
టీపార్టీ చేసినట్టున్నది,
కానేకాదు నవ్య స్త్రీ. ..
నా వాక్స్వాతంత్రమ్ము బూర్తిగా హరించి
నూట నలబయినాల్గు న్నానోటికి
దగిలించినట్టి
బ్లడీ డిక్టేటరులాగా వుంది నీ నోరు;
నీ గుండియలాగా నున్నగా వున్న
నీ చేతుల సోయగము వర్ణింపగా నా
చేత కానేకాదు అయినా .
గాబ్రా పుట్టించు
ఆల్జీబ్రా గణిత శాస్త్రంలోని
మహా సూత్రమును
కుండలీకరించియున్న
బిగ్ బ్రాకట్లులాగా విలసిల్లున్
నీ హస్తాలు;

నీ యాకారమంతా, నిజంగా, మహా
అందంగా వున్నది; నీయందం
శాఖాహారులగు నావంటి వారికూ్కడా
మాంసాహారం మీదికి
బుద్ధి పోనిస్తూన్నదో, నవ్య స్త్రీ



# కామాక్షి కోక

మయిసూరు కృష్ణ రాజేంద్రమిల్సు
లోనన్ తయారు కాబడిన
గోల్డుబార్డర్లుగల కామాక్షి కోక
కథన్ వచిస్తున్నదీలా :-
మవుంటురోడ్లోని స్వదేశీ స్టోర్సు
లో ప్రాణంలేని ప్రతిమకు
కట్టంబడియుంటి మున్ను,
ఓనాడు పరాభి కళ్ళబడ్డా, నతగాడు
నన్నున్ ప్రజెంట్ చేశాడు
కామాక్షికి, కామాక్షీ జన్మదినానన్.
డ్రస్సింగ్ రూములోకి నన్నుం దీసుకపోయి
కామాక్షి మహోత్సాహంతో
నిల్వుటద్దంముందు న్నిలంబడి
తన చీర న్విప్పి వేసింది; ఏమా సవుందర్యము
నయనోత్సవముగ. -
నాగళ్లంతా
కళ్లుం చేసుక చూశాను -
అండర్వేరు బ్లౌసుల్ మాత్రం ఆయమ
దేహాన్నంటుకోనుండినవి,
అత్యంత బాగ్యవంతమ్మగు
బరోడా నయిజాము స్వదేశీ

సంస్థానాల్లోలాగున; నన్నుం
ధరించి చూసి మురిసింది కామాక్షి
అరటిపండున్ పక్కు తీసి తినేలా
మ్రింగివేశా న్నే ఆ నగ్నాంగమ్మును
కానీ మహాకోప్పడ్డాను :-
ఈ అండర్వేరు బ్లౌసుల్ దేహంలోని స్ట్రాటజిక్
పాయింట్లను ఆక్రమించుక
నా ఏకచ్ఛత్రాధిపత్యంబును
ప్రతిఘటిస్తున్నందులకు

* * *

జ్ఞాపకం బున్నది మరోసారి సాయంత్రం ఎడు
గంటలప్పుడు నన్నుం ధరించి, నామిస్ట్రెసు
మిసస్ మాథ్యూసు పార్టీకి
పరాభిన్ సహచరించి పోయింది
అచ్చోట స్త్రీ నేత్రాలన్నీ
నావంకే బిగింపబడి యుండినవి;
అప్పార్టీయందున
పరాభి కామాక్షి గలసి బాల్ డ్యాన్సును
చేయసాగారు; సుడిగాలిలాగా, తి
రుగ సాగారు, సగం కౌగిలిలోన
వారిర్వురు:- అలా పరిభ్రమించుచు
మహా నిపుణంగా
పరాభి కామాక్షిని గార్డన్ లోకి
లాక్కొపోయాడు :- అచ్చోట

మహాబ్రయిటుగా మూన్ లయిటు
కాయుచున్నది;
"యిలక్ట్రిసిటీకు దీపాలకుమల్లే ఈ
మూన్లయిటుకూడా స్విచ్చుండిన
ఎం బాగుండు" నని యన్నాడు పరాభి
"శశియంటే మహామంట నాకూడా"
అని కామాక్షి పల్కింది
"సూర్యున్నుండి కాంతిం దీసుకొనే
ఒరిజినాలిటీ లేని ఉత్త డన్సీశశి
జిలేబీలాగా ఈ చంద్రచక్రాన్ని
మ్రింగివేయా లనిపిస్తున్నది పరాభీ."
'నీకు నిజంగా మూన్ కావాలనా?
నే దీసుకవచ్చి యిస్తా" నని యతడన్నాడు.
"ఎలాగున పరాభి?"
"ఇదో కామాక్షీ ఇలా తిరుగుము
జాబిల్లి తట్టుకు నీ ముఖచంద్రు దిప్పి
ఓరగా పయి కెత్తుము;
నీ కళ్ళుమూసివేసుక నత్కారముగ
చంద్రాగమనమ్ము నిరీక్షింప" మని
బలే చలాకీగా, పరాబి
తన మోము న్వంచి కామాక్షి
నోటిన్ నాజూకుగ ముద్దిడినాడు;
ఆయమ దేహాన్ని
పరిష్వంగగ్రస్తము చేశాడుకూడ

వారిద్దరి దేహాల రాపిడిలోన
నల్గిపోతానని భయం
పుట్టినది నాకు
ఇంతలో హాల్లోనుండి 'పరాభి' అని
మిసస్ మధ్యూసు కంఠము
వినంబడినది కర్ణ కఠోరమ్ముగ
ఛీ ఛీ ఛీ ఛీ
తర్వాత కొంతకాలము - ఏమి
దాపురించినదో గాని
నన్నుం గట్టినప్పుడంతా పూర్వంపు
విన్నాణములేక అజాగ్రత్తగ
కట్టేది; కామాక్షి దేహమ్ము పొయ్యిలా
బలే కాక కాసేది; గుండియ
దడదడ కొట్టేది
ఊపిరితిత్తుల్ కొలిమి తిత్తుల్లాగున
పవనంపు టుడుకు టలల్ పంపేవి;
మధ్యమధ్య "పరాభీ పరాభీ" అని పల్కి
నిట్టూర్చేది; రాల్చేది
కన్నీటి చుక్కల్గాడ నామీద
నా యజమ్మాన్రాలి కష్టంజూచి
నాకు బలే కష్టం వేసేది
ఓదార్చాలని బుద్ధి పుట్టేది
కానీ ప్రాణంలేని నేను ఎంజేస్తాను
ప్రాణంబుండి యుండినాగూడ

కామాక్షీ తనూ స్పర్శచేతన్
ప్రాణంబుల బాసియుండేదానిని
గాబోలును
ఆనాడు నాకీనాటికి గూడ
నిన్నలాగున
జ్ఞాపకంబున్నది;-
మహా ఖులాసాగా సాయింత్రం
పదిగంటలప్పుడు నన్నుం ధరించినది
అత్యంతమ్మగు నేర్పుతోడ;
ఏమాయదృష్టము నాది.
నిర్పేదకు బంగారులిబ్బుల్
గన్పించినట్టుల.
కామాక్షి, అండర్వేరుగాని బ్లౌసుంగాని
ధరింపకుండా, నామీది దయచేత
తన తనూ సర్వసామ్రాజ్యంబును
నా కిచ్చివేసింది· అంతట
శ్రోణీ వక్ష పీఠభూముల్ను
డయిరక్టుగానే ఆక్రమించి
పులకరించి పోయాను, ప్రాణం
లేనిదాన్నయినా గూడ నేను,
"కోటీ" సుగంధాలను పూసి ఘుమ
ఘుమాళిస్తూండగ, పడకటింటన్
వేచియుండినది పరాభి రాకకు . .
అతగాడు వచ్చా డామీద

అరగంటకాలం సరస సల్లాపాల
తో బుచ్చారు
అమాంతంగా నంత
కామాక్షికి నన్నున్ ప్రజంట్ చేసిన
హస్తాలే నన్ను లాగేశాయి
కామాక్షినుండి, కామాక్షిని
అనాచ్ఛాదిత జేస్తూ
. నన్ లాగిన విసరునకు
దీపం వత్తిగూడా ఆరిపోయింది



# ఫిడేలురాగం

పిడేలురాగమ్ పిడేలురాగమ్
పిడేలురాగమ్బులు
వినూతన పదప్రేమికులు, మహా కాముకులు;
అన్యోన్యమగు దమ్పతులుకూడ;-
పిడేలన్ నది, "మయ్డియ రాగా.
మీవారన్దరు సనాతనాచార్యుల్
ముఖమ్విరిచి, ఇన్గ్లీష్దానిని
నన్ను న్జేపట్టవద్దని
గద్దిన్చినా కూడ నీవు
మహాసాహసన్తో, రుమాన్టిక్గా
మ్యారేజ్జేసుకొన్ నావుగదా. స్వీట్హార్ట్."
రాగమ్ అనినాడు
"ధ్యాన్క్స్ టు పరాభి
నా కతడు ధ్రయిన్గా
సహాయ్యమ్ జేయపట్టి మనకు
వివాహమయిన్ది డార్లిన్గ్."
పిడేలు రాగమ్బులు ఆదర్శమగు జమ్పతులు
తటాల్మని కలకన్రమున, పిడీలీలా
ప్రశ్ నిన్ చినది, "రాగాడియర్నన్ను
నిజన్గాప్రేమిస్తావానీవు?
ఎమ్ మాట్టన్టున్నావు ఫిడేలీ జీవితేశ్ వరీ.

నా జన్మ నీలో లీనమయి పోయిన్ది
సన్ఘమ్ నన్ వినాగూడ
నిన్ను చేపట్టినన్దుక్నాకు, పచిమ్పురాని
సవుఖ్యమ్' పిడీలు చిత్తతన్స్తులు
ఆనందంతో మ్రోగినవి
రాగమ్ అంత పిడీలీని గాడమ్గా
కవ్గిలించాడు; తర్వాత వారి
దేహాలు న్నేకమయినాయి సరళశయ్యన్
అపూర్వమ్బగు అన్దంబగు సన్తానమ్ వారికి
జనిన్చిన్ది అసన్ఖ్యాకముగ :- వారన్తా
పరాభిని గని "తాతా తాతా' అనేవారు



రమ్యాక్షర రసపదాల
నినుంజేరుదును, నేనిక;
నా సర్వము నీ పదాల
అర్పితమ్మయిన కానిక

నా కన్నులలో మతాబు
వత్తులు కడు ప్రజ్వలితము
స్నేహలతా ! ఈ కితాబు
ప్రియమార నీ కంకితము

ఉక్తికందరాని ఊహ
ఏలాగు నిముడు నాకృతి ?
అయిన ఇది తరించు, స్నేహ
లతా ! అంది నీ స్వీకృతి.

మంచియన్నది పెంచడం,
సొంతలాభం కొంతమానుక
పొరుగువారికి తోడుపడడం
జీవితలక్ష్యాలుగా ఎంచుకున్న
ఉదారశీలి, ఉదాత్తమూర్తి

స్వర్గీయ
అల్తూరు రామరెడ్డి

గోరంత కృతజ్ఞత

ఆరుద్ర

ఈ పీఠిక చాలా సంతోషంగానూ సగర్వంగానూ రాస్తున్నాను

సంతోషం ఎందుకంటే ఇన్నేళ్ళకు ఇందులోని కవితలు పుస్తకరూపంలో వెలుగు చూస్తున్నందుకు

గర్వం ఎందుకంటే· ఆధునికాంధ్ర కవిత్వంలో ప్రయోగవాదం సాధించిన విజయాలకూ ఈ కవితలకూ సంబంధం ఉండబట్టి

ఇప్పుడు పుస్తక రూపంలో ఒకచోట సంకలనమైనా ఇందులోని అనేక కవితలు అముద్రితాలు కావు వివిధ తెలుగు పత్రికలలో అప్పుడప్పుడు ప్రచురిత మయ్యాయి ఆ ముద్రిత రచనలలోని సంవిధాన చాతుర్యం ఏదో ఒక మాత్రాఛందస్సును ఉపయోగించడం, ఎక్కువ మంది గమనించినట్టు లేదు అందుకే వచన పద్యాలనే దుడ్డుకర్రలతో పద్యాల నడుం విరక్కొట్టే అహంభావకవిగానే ఆయన మిగిలిపోయాడు ఇప్పుడు ఈ పుస్తక ప్రచురణవల్ల మాత్రాఛందస్సులను మైనపు ముద్ద లాగ కావలసిన రూపానికి అలవోకగా మలచగల మహాశిల్పిగా పఠాభి ఆంధ్ర సాహిత్య లోకానికి సాక్షాత్కరిస్తాడు

'కయిత నా దయిత' లోని వివిధ ఖండికల రచన ఎప్పుడో జరిగింది ఇందులో కొన్ని కవితలు ఫిడేలు రాగాల డజన్' రాయక ముందే పఠాభి రచించాడు కొన్ని శాంతినికేతన్‌లో చదువుకొనేటప్పుడు (1935-37) రాశాడు కొన్ని స్కాట్లండులో, కొన్ని సిలోనులో, కొన్ని స్పెయిన్‌లో రాయడం జరిగింది తెలుగులో రాసిన కవిత్వమే అయినా తెలుగు దేశానికి దూరంగా ఉండి రాయడం వల్ల కొన్ని కవితలలో వినూత్న వాతావరణం గోచరిస్తుంది

సాధారణంగా తెలుగు కవితలలో పారిజాత కుసుమాలు, మలయ పవనాలు, మానస సరోవరాలు, లలిత లవంగీలతలు కనబడతాయి. పఠాభి

కవితలలో హెదరుపూలు న్యూరేలియ పవనాలు, పాలనూరవ సరసు బార్లీరయి కుప్పలు మొదలైన కొత్త కవితా సామగ్రి కనబడుతుంది నూనూగు మీసాల నూత్నయౌవనంనుంచీ ఇందులోని ఖండికలన్నీ పరాభి రచించాడు 'యవ్వనమ్ము భయవిహీన నిరుపమాన సాహసమ్ము కనుకనే ఈ ఖండికలలోని భావాలు కొన్ని (సనాతనులకు) సాహసాలులాగ కనబడతాయి కనబడ్డ ప్రతి ఆదదాని మీద శ్రీనాధుడు ఎందుకు పద్యాలు రాశాడో అందుకే పరాభి కూడా రాశాడనుకొంటే ఈ సంకలనంలోని సిలోనుపిల్ల స్కాచిపిల్ల చయినా యువతి హవాయి కడుతీయవాయ పడతి, రజస్వల అర్ధమవుతారు వాళ్ళందరూ కయితలో దయితలు

కవితను రమణిగా రాణిగా ఊహించుకొనడం పరిపాటే వాణి నారాణి అన్నవాళ్ళు పూర్వం కూడా ఉన్నారు రాబోయే కాలంలోనూ ఉంటారు వర్తమాన కాలంలో శ్రీ శ్రీ కవితా ఓ కవితా అనే ఖండకావ్యంలో అఖండమైన అనుభూతిని ప్రసారం చేశాడు ఈ విశ్వంలో అన్నీ నీ చైతన్యం నీ విశ్వరూప సాక్షాత్కారం అని శ్రీ శ్రీ తన కవితతో అంటాడు పరాభి కూడా తన కవితతో నాకు నీ రూపము చరాచర వస్తువులనంతట గోచరమగుచుండుట కనుల పండువ అని చెప్తాడు 'పలురూపముల ప్రత్యక్షము నీ రూపము నా సమక్షము' అంటాడు పరాభి శ్రీ శ్రీలో కవిత సాంఘిక చైతన్యఫణాలు విప్పిన కుండలినీ శక్తి పరాభిలో కయిత 'బావనా రాజ్య పాలిని' గా మిగిలిపోయింది

పరాభి ఉద్దేశంలో కవిత దివ్యమోహినే గాని గేహిని కాలేదు ఆమె రక్తంలో తీవ్రత జీవితానికి దేవత కవిత కోసం కవిది అనంతమగు పరిశోధన, అది జన్మ జన్మాల సాధన ఈ సంగతి కవి ఒకటికి రెండు సార్లు చెప్తాడు

2

పరాభి ఉద్దేశ్యంలో కవితా రచన అనంత పరిశోధన కనుకనే ఈ సంకలనంలోని రచనల్లో వినూత్న సంవిధాన ప్రయోగ ప్రయత్నాలు కనబడతాయి తన పదహారోయేట పరాభి శాంతినికేతన్‌లో చదువుకొనేటప్పుడు

అంత్యప్రాసలతో అనేక ప్రయోగాలు చేశాడు అప్పుడు ఆయన ఒక నవ్యనాదం కోసం అన్వేషణ చేస్తున్నట్టు తరువాత ఒక చోట రాశాడు శాంతినికేతనంలో ఆ రోజుల్లో రవీంద్రుడు సంస్కృత ఛందస్సులు విసర్జించి అంత్యప్రాసలను పాటిస్తూ వివిధ దేశీయ ఛందస్సులలో రచన చేస్తూ వుండేవాడు అది చూసే పరాభి మార్గ కవితా వృత్తాలలోగాక మాత్రా ఛందస్సులలో అంత్యప్రాసలతో రచనలు చేయడానికి ఉపక్రమించాడు

వంగబాషా కవిత్వంతోనూ రవీంద్రునితోనూ పరిచయమయిన ప్రతిబావంతులను మాత్రా ఛందస్సులో అంత్యప్రాసలు ఆకర్షించడంలో ఆశ్చర్యం లేదు అబ్బూరి రామకృష్ణారావుగారు 1918లోనే శాంతినికేతనం ప్రబావంవల్ల తెలుగు ఛందస్సులలో చాలా కొత్త ప్రయోగాలు చేశారు

ఆయన స్వకపోల కల్పితాలయిన మాత్రా ఛందస్సులలో కాక ముత్యాలసరాలు, మధ్యాక్కరలు, ద్విపదలు మొదలైన ఛందస్సులలో అంత్యప్రాసలు వాడి ప్రయోగాలు చేశారు ఆయన ఊహాగానం'లోని తొలి పద్యం చూడండి

పూజాశిరీషము లేరు కొంటివి
పోయివచ్చెద జవ్వనీ
తేజో విలీన దృగంచలమ్ముల
తేరి చూచెద నెవ్వని ?

ఇదేదో పందొమ్మిదో ఛందంలోని పూర్వ వృత్తంలాగా పన్నెండో అక్షరంపై యతీ, ఆదిప్రాస అంత్యప్రాస నియతి ఉన్నట్టు కనబడుతుందిగాని ఇది నిజానికి ముత్యాలసరం ఊహాగానం' సంకలనంలో పూజాశిరీషములు, తిక్కన సోమయాజి, సరోజినీదేవి, పృధివీ ప్రశంస, ఆంధ్రవీర కంఠీరవ అనే అయిదు ఖండికలలో అంత్యప్రాసల ప్రయోగాలకి ప్రయత్నాలు జరిగాయి

నేటికి యాభై ఎనిమిది సంవత్సరాల కిందట అబ్బూరివారు ప్రవేశపెట్టే దాకా తెలుగు సాహిత్యంలో అంత్యప్రాసలు ప్రవేశించలేదనుకోకూడదు

ప్రబంధాలలో రగడలు వాడేచోట్ల విధిగా అంత్యప్రాసలు పాటించాలి. అబ్బూరివారు ఆదిప్రాసలు పాటించాలన్న నియమం ఏమీ పెట్టుకోలేదు అయితే అంత్యప్రాసలు ఎలాగ పాటించాలన్న విషయంలో చాలా కచ్చితమైన నియమాలను పెట్టుకొన్నాడు సాధారణంగా రెండేసి పాదాలకు అంత్యప్రాసలు వాడడం ప్రబంధాలలోని రగడలలో కనబడతాయి వరాహి ఆత్రోవ కొన్నిచోట్ల తొక్కినా చాలా విలక్షణమైన ప్రయోగాలు చేస్తూ కఠినమైన నియమాలు పాటించాడు

ఈ సంకలనంలో మొదట అష్ట విధనాయికా లక్షణాలకు కావ్య రూపం ఇచ్చే ఎనిమిది కవితలు ఉన్నాయి పదేసి పాదాలు ఒక ఖండంగా ఎనిమిది రచనలలోనూ కనబడుతుంది ఆ పది పాదాలలో రకరకాలుగా అంత్యప్రాసలను వరాహి పాటించాడు ఒకదాన్లో వాడిన క్రమంలో ఇంకొకటి వాడలేదు చూడండి

**(1) అభిసారిక :**

1-3 నెంబరు గల పాదాల కొకే అంత్యప్రాసమైత్రి (కోరిక, సారిక)

2-4-8-9-10 నెంబరు పాదాలకు సమాన ప్రాసమైత్రి (రీతిని, వీధిని, నాతిని, వీధిని, రీతిని)

5-6-7 నెంబరు పాదాలకు ఒకే ప్రాసమైత్రి (శీధము, గీతము, భూతము)

**(2) వియోగిని :**

1-2; 9-10 నెంబరు పాదాలకు ఒకే ప్రాసమైత్రి (దండు, నిండు; నిండు; దండు)

3-4-7 నెంబరు పాదాలకు సమాన ప్రాసమైత్రి (భాగిని, రాగిణి,

యోగిని)

5-6-8 నెంబరు పాదాలకు సమాన ప్రాసమైత్రి (మ్రోగ, రేగ, లాగ)

(3) వాసవ సజ్జిక :

1-3-8-10 నెంబరు పాదాలకు సమాన ప్రాసమైత్రి (పజ్జ ఉజ్జ, సజ్జ, పజ్జ)
2-7-9 నెంబరు పాదాలకు సమాన ప్రాసమైత్రి (వచ్చు గ్రుచ్చు, వచ్చు)

4-5-6 నెంబరు పాదాలకు సమాన ప్రాసమైత్రి (కాటుక, శాటిక, మాటిక)

(4) విప్రలబ్ధ :

1-4 నెంబరు పాదాలకు మైత్రి (చోటికి, ప్వాటికి)

2-6-9 నెంబరు పాదాలకు సమాన మైత్రి (రాక, రేక, గాక)

3-5-7 నెంబరు పాదాలకు సమాన మైత్రి (కోరుపు, తూరుపు, ట్టూరుపు)

8-10 నెంబరు పాదాలకు మైత్రి (లబ్ధ, లబ్ధ)

(5) ఖండిత :

1-2 నెంబరు పాదాలకు మైత్రి (భోగము, రాగము)

3-4 నెంబరు పాదాలకు మైత్రి (వ్యాపింపగ, దీపింపగ)

5-8 నెంబరు పాదాలకు మైత్రి (నుదయమ్మున హృదయమ్మున)

6-7 నెంబరు పాదాలకు మైత్రి (వీక్షణ తీక్షణ)

9-10 నెంబరు పాదాలకు మైత్రి (ఖండిత, ఖండిత)

(6) ప్రోషిత భర్తృక :

1-2-3 నెంబరు పాదాలకు సమాన ప్రాసమైత్రి (బిల్లి గిల్లి వల్లి)

4-5-6 నెంబరు పాదాలకు సమాన ప్రాసమైత్రి (కోక బోక రాక)

7-8 నెంబరు పాదాలకు మైత్రి (బోవగ లో వగ)

9-10 నెంబరు పాదాలకు మైత్రి (ప్రోషిత కోషిత)

(7) కలహాంతరిత :

1-2 నెంబరు పాదాలకు మైత్రి (చరణ, కరణ)

3-5 నెంబరు పాదాలకు మైత్రి (నమ్మినకు, తమ్మినకు)

4-6 నెంబరు పాదాలకు మైత్రి (బలిని, స్థలిని)

7-8 నెంబరు పాదాలకు మైత్రి (దలంచి, విపంచి)

(8) స్వాధీన పతిక :

రెండేసి పాదాలకు సాధారణ అంత్యప్రాసమైత్రి

పరాభి పెట్టుకున్న ఈ వివిధ నియమాలు విశ్లేషించి చూస్తే ముందుగా ఎంత పథకం వేసుకొని పరిశోధనలు ప్రారంభించాడో తెలుస్తుంది నిజానికి కయిత నా దయిత లోని వివిధ ఖండికల్లోగల అంత్యప్రాస నియమాలను కూలంకషంగా పరిశీలించడం అవసరం (ఆ పనిని ఆధునిక ఛందశ్శాస్త్ర రచయితలకు వదిలి పెడదాం)

3

అంత్యప్రాసల మీద పరిశోధనలు మొదలుపెట్టిన 34 సంవత్సరాలకు పరాభి తన ప్రయోగాలు సఫలమైనందుకు సంతోషించాడు **I am glad the experiment I did, did bear fruit as a considerable body of end rhyme poetry has now come to pass** అని పరాభి వ్రాశాడు ఈ విజయాలకు నేను కొంత వరకూ కారణ భూతుణ్ణి నా మీద పడ్డంతగా పరాభి ప్రభావం ఎ ఇతర నవ్య కవులపైనా పడలేదు 1942 దాకా నేను శ్రీ శ్రీ ప్రభావంలో కవిత రాస్తూ ఉండేవాడిని అప్పుడు శ్రీ శ్రీ నన్నేం మెచ్చుకోలేదు· ఒక కవిగా గుర్తించ లేదు 1942లో విశాఖపట్నం మీద బాంబులు పడ్డాయి జనం ఊరూరికి దిక్కులు పట్టారు ఆ అనుభూతిని నేను వర్ణించాలనుకొన్నాను అనుభవం కొత్తది కనుక కొత్త శిల్పం కావలసి వచ్చింది పరాభి బాణీలో లోహవిహంగాలు అన్న ఖండకావ్యం రాశాను దానిని శ్రీ శ్రీకి వినిపించాను శ్రీ శ్రీ పొంగిపోయాడు. 'ఇంక నీ స్వంత గొంతుక నువ్వు వెతుక్కుంటావు' అన్నాడు చాలా కాలం తరువాత 'ఈనాడు ఆరుద్ర ముద్ర అంటారే అది (ఫోర్జరీ అనబోనుగాని) నిస్సందేహంగా పరాభి ముద్రే; అది దాటి యిప్పటికీ యింకా ఆరుద్ర బైటపడలేదు ' అని శ్రీ శ్రీ ఒక చోట రాశాడు (శ్రీ శ్రీ యింకా అబ్బూరి వారి ముద్రనుదాటి బయటపడలేదు అది వేరే సంగతి) నా మీద పరాభి ప్రభావం ఎంతగా వుందో (ఎవరేనా పరిశోధకులు అవసరమనుకొంటే) ఈ కయిత నా దయితలోని ఖండికలు పరిశీలిస్తే తెలుస్తుంది

కృష్ణశాస్త్రి, విశ్వనాథల ప్రభావం నుండి బయటపడడానికి శ్రీ శ్రీకి అబ్బూరివారి ముద్ర అవసరమైంది అలాగే శ్రీ శ్రీ ప్రభావం నుండి

బయటపడడానికి నాకు పరాభి ముద్ర అవసరమైంది ప్రతిభావంతుల పరిణామ క్రమంలో ఈ దశలు తప్పవు ఉదాహరణకు పరాభి ఎందరి ప్రభావాలనుంచో ఎదగవలసి వచ్చింది ఈ సంకలనంలోనే జలపాతం అన్న ఖండికలో విశ్వనాథకవి కిన్నెరసాని ప్రభావం కనబడుతుంది జాబిల్లి అన్న ఖండికలో శ్రీ శ్రీ బహుళ పంచమి జ్యోత్స్న వెలుగులు కొన్ని కనబడతాయి 'వాంఛ అన్న ఖండికలో కూడా శ్రీ శ్రీ ఇమిటేషన్ కొంత ఉంది

ఈ రచనలు నలభై సంవత్సరాల కిందట మొదలు పెట్టినవన్న సంగతి మరచిపోకూడదు వీటితో నాకు ముప్పయి సంవత్సరాల నుంచీ పరిచయం వుంది వివిధ పత్రికలలో ఇందులోని ఖండికలు అచ్చు పడితే దానికి ఎక్కువగా నేనే బాధ్యుణ్ణి పరాభిలోని సంవిధాన నైపుణ్యం లోకానికి విశదమవాలన్న ప్రగాఢవాంఛ ఇన్నాళ్ళకు సిద్ధిస్తోంది ఇది ఒక రకంగా అంత్యప్రాసల సర్వస్వం (అయితే నర్తకులు అన్న ఖండిక లయగ్రాహిలో వ్రాయడంవల్ల ఆదిప్రాసలే ఉన్నాయి) ఇది ప్రయోగవాద విజయ కేతనం

పరాభి చెప్పినట్లు సంవిధానంలో మార్పు అన్నది కవితా వస్తువులో మార్పుకోసమే సంవిధానంకోసమే సంవిధానం ఏ కవీ వాడడు కవితావస్తువులో మార్పు సంఘంలో మార్పుని వాంఛించడంవల్లనే సంభవిస్తుంది

పరాభి పద్య రచనా సుమనోజ్ఞ విద్య' లో ప్రవీణుడు ఆయనకు కొన్ని ఆశయాలు ఉన్నాయి బ్రతుకు ముళ్ళబాటలలో ప్రయాణం చేస్తూ తన బండిపగ్గాలను భగవంతుడి చేతికి అప్పగించాడు బండిలో సాగుతూ పసిడి స్వప్నాలు కంటూ అడవి దాటాక అందమైన పురం ఒకటి వస్తుంది అక్కడకు పోగోరిన వారందరినీ తనతో రమ్మంటున్నాడు అంధకార అసురశక్తి నుండి ముక్తి కోరుతున్నాడు మానవుడు ఏకాకి కాదు ఆమాటకొస్తే సృష్టిలో ఏవస్తువూ ఏకాకి కాలేదు

ఏకాకిగ సర్వజగతి -
లేదేదియు; సుందరగతి
ప్రతివస్తువు మరోదాన
కలసి సఫలమౌనుగాన
సఖియరో మదాత్మనీదు
హృదిని యేల కలయరాదు"
అని నిరంతర యుగ్మాన్ని షెల్లీలాగ భావిస్తాడు

'సకల కల్మషములు సర్వ
నాశనమవుగాత . గర్వ
రహితంబగుగాత శుభ్ర
వంతమగుత శారదాభ్ర
మటుల; ఇపుడు నా మనస్సు
విడిచిపోవగన్ తమస్సు "

అని తమస్సునుండి జ్యోతిర్మండలానికి పయనం వాంఛిస్తాడు సత్కవులందరిలో కనిపించే సద్భావాలన్నీ ఈ సంకలనంలో అక్కడక్కడ కనబడతాయి. సంవిధానపు లతాగుల్మాలలో ఆ కుసుమాలు మరుగున పడతాయి.

పఠాభి కవిత్వానికి తొలిదగ్గరనుంచీ ఈ విలక్షణత్వం ఉంది ఫిడేలు రాగాల డజన్'లోని సంవిధానానికి ఆశ్చర్యచకితులైన ఆంధ్రులు అందులోని సీరియస్‌నెస్‌ని అర్థం చేసుకోలేదు 34 సంవత్సరాల తర్వాత కవే తాను ఎందుకు ఆ విధంగా రాయవలసి వచ్చిందో చెప్పేదాకా ఆ సీరియస్‌నెస్ చాలా మందికి అర్థం కాలేదు

ఈ 'కయిత నా దయిత' లో కూడా సంవిధాన చాతుర్యం, కొన్ని కొన్ని కొంటెతనం భావాలూ కొట్టవచ్చినట్టుగా కనబడి గంభీర విషయాలు దాక్కుంటాయి వాటిమీద టార్చిలైటుకాంతిని ప్రసరింప చేయడం అవసరం.

ఎమైనా ఈ పుస్తక ప్రచురణవల్ల ఆధునికాంధ్ర కవిత్వపరిణామ క్రమ చరిత్రలో కొన్ని లోపించిన షట్టాలు పూరించడానికి అవకాశం కలుగుతూంది ఈ పుస్తక ప్రచురణ ఎన్నడో జరగవలసింది అనేకానేక కారణాలవల్ల అలా జరగలేదు ఈ కావ్య సంకలనానికి నేనే పీరిక వ్రాయాలని పరాభి పట్టుదల పట్టాడు నాకన్నా సమర్థులు చాలా మంది ఉన్నారు అయితే నామీద పడినంతగా పరాభి ప్రబావం ఇంకెవరి మీదా పడలేదన్న ఒకే ఒక అర్హతతో ఈ పీరికను రాయడానికి కొన్ని మాసాల కిందట ఒప్పుకొన్నాను ఇప్పటికిగాని రాయలేకపోయాను

ఇది ఒకరకంగా గురుదక్షిణ సమర్పించుకొనడం లాంటిది ఇది కొండంత ప్రబావానికి గోరంత కృతజ్ఞత



# 'పఠాభి'షేకం

ఇది 'పఠాభి గారి రెండవ కావ్యం తొలికావ్యం - 1939లో ప్రచురింపబడిన ఫిడేలు రాగాల డజన్'ను 1973లో పునర్ముద్రించి కావ్యప్రచురణలో ఒక కొత్త శైలిని కొత్త నమూనాను ఏర్పరచింది వర్ధమాన సమాజం మళ్ళీ ఇప్పుడీ కయిత నా దయితను తెలుగు సాహితీ లోకానికి సమర్పించుకునే అవకాశం కూడా వర్ధమాన సమాజానికే కల్గడం మా అదృష్టం

పఠాభి కావ్యాలు రెండిట్నీ వర్ధమాన సమాజమే వెలువరించడం ఆయనమీద మా కున్న గౌరవ భావానికేగాక ఈ పురాతన సారస్వత సంస్థమీద ఆయనకున్న అభిమానానికి కూడా చక్కని నిదర్శనం వర్ధమాన సమాజం ఆయనకెంతగానో ఋణపడి ఉంది

పుస్తక ప్రచురణ అన్నది వర్దమాన సమాజం వంటి నిరుపేద సంస్థకు అలవిమాలిన పనే అయినా పఠాభి' గారి ద్వితీయ కావ్యాన్ని కూడా మేమే ప్రచురించాలన్న ఉత్సాహంతో ఈ ప్రయత్నానికి పూనుకొన్నప్పుడు మమ్మల్ని ఎంతగానో ప్రోత్సహించినవారు చేయూత నిచ్చినవారు అల్లూరు రామరెడ్డిగారు ఆయన ఎంతటి సంపన్నుడో అంతటి సంస్కార హృదయుడు అరమరిక లెరుగని మనస్సు ఆయనది

రామరెడ్డిగారి చేతి చలువవల్ల చల్లని మనస్సువల్ల నెల్లూరు జిల్లాలో విద్యాసంస్థలు వెలిశాయి· వైద్యసంస్థలకు సహాయం జరిగింది; ఎన్నో సత్కార్యాలు నిర్వహింపబడ్డాయి· ఎందరు కవి పండితులో ఆదరింపబడ్డారు; ఎన్ని కుటుంబాలో కష్టాలు తీరి కుదుటబడ్డాయి; ఎందరి భవిష్యత్తులో తీర్చిదిద్దబడ్డాయి మంచితనం ఆయనలో మూర్తీభవించింది నిరాడంబరతకు నిగర్వానికి ఆయన ఒక ప్రతీకగా ఉండేవారు అంతటి ఉదారుడు, మంచి మనిషి మరి పదికాలాలపాటు బ్రతికివుంటే సమాజానికి మరికొంత ఉపకారం

జరిగి వుండేది కానీ, దురదృష్టవశాత్తు ఆయన తన యాభై ఎనిమిదవ యేటనే - 1976 సెప్టెంబరు 9 వ తేదీన - కన్నుమూశారు

ఈ కావ్యావిష్కరణ ఆయన జీవించి వున్నపుడే జరిగి వుండాల్సింది. కానీ ఏవో అవాంతరాలవల్ల వీలుగాక పోయింది వర్ధమాన సమాజానికి ఆయన చేసిన మేలు ఎన్నటికీ మరువ లేనిది మాటలలో వెల్లడించుకోలేని కృతజ్ఞతతో ఆయనకు నివాళులర్పిస్తున్నాము

రామరెడ్డిగారి తదనంతరం వారి అల్లుళ్ళు శ్రీ సామంతు సుబ్బారెడ్డి, శ్రీ సామంతు గోపాలరెడ్డి ఈ కావ్య ప్రచురణ కెంతగానో సహకరించారు వారు విద్యాధికులు సౌజన్యశీలురు రామరెడ్డిగారి సంపదకే గాక సంస్కారానికి సంప్రదాయానికి కూడా తగిన వారసులు వారికివే మా హార్దికాభివందనాలు

ఈ కావ్యం వర్ధమాన సమాజ ప్రచురణగా వెలువడడానికి కారకులు, ప్రేరకులు డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు వారికి మా కృతజ్ఞతాంజలులు

'ఆరుద్ర' విపులంగాను విమర్శనాత్మకంగాను పీఠిక రాశారు ఆయనకు ఈ కావ్యం మీద ఎనలేని అభిమానం ఆయనకు మా ధన్యవాదాలు భావగర్భితంగా ఆకర్షణీయంగా ముఖచిత్రం వేసిచ్చిన బాపు'కు పుస్తకం చక్కగా అచ్చువేసిన సారధి ప్రింటర్స్‌కూ మా ధన్యవాదాలు

వర్ధమాన సమాజం — పి. గోపాలకృష్ణ

నెల్లూరు. — కార్యదర్శి

## అభిసారిక

ప్రియుని గలయు కోరిక
లాగగ సుడి రీతిని
రయమున నభిసారిక
పోవు విజన వీధిని;

అతినీరవము నిశీధము
నిలచింది విహగ గీతము
భయదమ్ము రజని భూతము

అయినను, నిలుప నవ్వి నాతిని
రయమున పోవ విజన వీధిని
ప్రియుని గలయు కోరిక లాగగ సుడి రీతిని

పాటల విని యామిని
పరుగులిడు భుజంగము
లాగ చనును కామిని
కోరి సఖుని సంగము;

అలసింది మంద పవనము
నిదురిల్లు సర్వ భువనము
అతిశాంతము ప్రతి భవనము

రవములజేయు హృది మృదంగము
దడదడ, పరుగులిడు భుజంగము
లాగున చన కామిని కోరి సఖుని సంగము

కామ మటుల చీకటి
క్రమ్మియుండి భూమిని
పోవు వలపు టాకటి
త్రోపున జవగామిని;

పద కంకణములు ఘల్లన
పులకించి తనువు ఝుల్లన
విడిపింప బడిన విల్లన

చవిగొన, ప్రియుని పెదవి ఆమని
పరుగుల దీయును జవగామిని
కామమటుల చీకటి క్రమ్మియుండ భూమిని

యవ్వన మధు పూర్ణము
తన మనోహరాస్యము
అధర రక్తిమార్ణము
పయిన శ్వేత హాస్యము

కని గాలి పిల్లలందరు
వివశత్వమందియుం, దరు
తతి సందుల పడియుందురు

ప్రకటనజేయ హృద్రహస్యము
తనదు కనన్మనోహరాస్యము
అధర రక్తి మార్గము పయిన శ్వేత హాస్యము.



# వియోగిని

ఆషాడపు మబ్బుదండు
గగనమ్మంతటన్ నిండు·
ప్రియుం బాసిన అబాగిని
చిద్వీణ గరుణ రాగిణి
దుర్నివారముగా మ్రోగ
నిండుగ కన్నీరు రేగ
విరహార్తయగు, వియోగిని
కనుచుం దంజనములాగ
గగనమ్మంతటన్ నిండు
ఆషాడపు మబ్బు దండు

ఇటులా విరహిణి దలంచు
అశని ఘోషణముల వించు·
"ఏకాకినిగా యిచ్చట
సమయం బేవిధి పుచ్చుట ?

విభుడువినా యింటియందు
హా ! నే యేలాగు నుందు?
సుఖవంతం బిక చచ్చుట"
అని పర్జన్యముల్ చిందు
అశని ఘోషణముల వించు
ఇటులా విరహిణి దలంచు

విరహకాతర తన్వంగి
వ్యధతో బల్కె నీబంగి:
"కఠోరుడా సుమసాయక
మహారిచే బడనీయక
రక్షింపగరా బిరాన,
నేను చావనున్నదాన,
ఓ నాదు ప్రాణ నాయక "
అనుచు గద్గద స్వరాన
వ్యధతో బల్కె నీబంగి
విరహ కాతర తన్వంగి

మూగుమింట మబ్బుమూక
సూదికయిన సందులేక
ప్రకృతి జలబ్పదవగుంఠిత
తన మాదిరి సుఖలుంఠిత,
ప్రక్కన గన్నీరు దండ
మండుట నశ్రువుల గుండ
గనుచున్ విరహోత్కంఠిత
మబ్బుల నిట్టూర్పుచుండ
సూదికయిన సందులేక
మూగుమింట మబ్బుమూక .



## వాసక సజ్జ

ఈ రేయి తన సజ్జ
నిక్కముగను ప్రియుడు వచ్చు
నటంచు మదిని ఉజ్జ
సలిపి, కనుల బూసి కాటుక
రవిక విడచి, జగిని శాటిక
కట్టి, తలుపు మాటి మాటిక
చూచుచు, పువుదండ గ్రుచ్చు
కామిని వాసక సజ్జ,
నిక్కముగను ప్రియుడు వచ్చు
నంచు దలచి, ఈ రేయి తన సజ్జ

లాక్షారుణము హజ్జ
సురభిళమగు యిక్షు కంధి
శరీరమంత, అజ్జ .
మకరధ్వజ చారు లేఖల
కరణి చనుల గంధ రేఖల
కవును చుట్టు కనక మేఖల

గలిగి మిగుల రగులుచుంది
రూపసి వాసక సజ్జ
సురభిళమగు యిక్షుకంధి
శరీరమ్ము, లాక్షారుణము హజ్జ

జాజ్వల్యముగ సజ్జ
సలిపి, పడమటింటియందు
సమర్చి పువుల సెజ్జ
ప్రక్కనుంచి చందనమ్మును
తమలపాకు పళ్ళెరమ్మును
ఘుమఘుమ మను మృగ మదమ్మును
ప్రియుని నిరీక్షిస్తు, నిందు
జిన్మఖి వాసక సజ్జ
భోగమందిరమ్మునందు
వేచియుంది శయ్యాగత ససజ్జ

సర్వాంగముల లజ్జ
మాయబోలి ఛాయబోలి
యనోజ్ఞముగ విజ్జ –
తళతళమను పసిడి గాజులు
చుక్కలట్లు సన్నజాజులు
కబరి శర్వరిని విరాజిలు
పువులపడక పయినవ్రాలి
యున్నది వాసక సజ్జ
మాయబోలి ఛాయబోలి
అందగింప సర్వాంగముల లజ్జ



# విప్రలబ్ద

చని సంకేతపు చోటికి
మనోహరు రాక
నిరీక్షిస్తు, తుద కోరుపు
నిల్వజాల, "కిప్పాటికి
రాడాత, డదో తూరుపు
టపరంజి రేక '
అనుచు నిడుద నిట్టూరుపు
విడుచుచున్న దపుడు లబ్ద
మనోరధ గాక
ప్రియవంచిత విప్రలబ్ద

ముక్కులతో ముద్దాడుచు
కపోతపు జంట
శాఖాగ్రము నందూగుట,
ఝుమ్మని పాటల పాడుచు
మధువ్రతంబులు దాగుట

జలజమ్ము లింట
కని మానసమ్ములో గుట
గుట నంది, తన ప్రారబ్ద
మటుగాల, కంట
తడి జార్చును విప్రలబ్ద

ఆ రేయిని రుచి చూడని
అధరాల విందు,
వ్యర్థమయిన క్షణికాలను
కవుగిళ్ళను, మాట్లాడని
మధురంబగు సరసాలను,
నికుంజములందు
సల్పనట్టి సురతాలను
మదిం దలచి దలచి, క్షుబ్ధ
మనస్కయి, కుందు
విపులమ్మగ విప్రలబ్ధ

శమింపకన్ మితిమీరిన
మహా విపరీత
మన్మధ బాధకు తాళక
ముఖాబ్జపురంగు మారిన
దంత, సహింపం జాలక
విషమ ప్రబాత
మరుత్తుల, వినంజాలక
కఠోరమగు గంధలుబ్ధ
మధుపమ్ముల మ్రోత
వివశయగును విప్రలబ్ధ



# ఖండిత

అన్యాంగన సంభోగము
సల్పగ, కుంకుమ రాగము
వక్షమ్మున వ్యాపింపగ
నుదుటలాక్ష దీపింపగ
ప్రియుడు రాగ నుదయమ్మున
సాధారణమగు వీక్షణ
ముల జూచును, తన తీక్షణ
రుష నణంచి హృదయమ్మున
పరాయి పురుషుండిత
డన్నట్టుల, ఖండిత

ముడుత పడని తన పక్కను
చెదరని కస్తురి చుక్కను
విడిపోవని తన వేణిని
మాయనట్టి పారాణిని
రాలి పడని గంధమ్మును
నలగని మల్లీమాలను
వదలనట్టి వస్త్రాలను
వ్యర్థమయిన అందమ్మును
తలచి, అశ్రుమోచన
సలుపు, కరుణలోచన

కంఠా శ్లేష సుఖాలను
కలుగనట్టి తన కరాలను,
కాంతుని చిక్కని హత్తుల
అదుమబడని చను గుత్తుల
అతడు కనని వదనమ్మును,
బూడిద యందున పోసిన
పన్నీరటు, వనిగాసిన
జ్యోత్స్నటు చక్కదనమ్మును
తలచి, దు ఖసించిత
మనస్క, ప్రియవంచిత

'ఇపుడు వల్లభుడు వచ్చుట
ద్విగుణీకృతముగ రెచ్చుట
తప్ప మదీయ వియోగము,
అత్యంత నిరుపయోగము
మన్మనోహరుని రూపము
మరణమ్ము తాధరించుక
రాగూడద నా కించుక
లేకుండు విరహతాపము"
అని భ్రమించు ఖండిత
మన్మధ శర దండిత



# ప్రోషిత భర్తృక

విదియ రాతిరి జాబిల్లి
విధముగ గడు సన్నగిల్లి
తగ్గియుండ తనూవల్లి,
విడక మాసినట్టి కోక
నిశియంతను నిదురబోక
నిరీక్షిస్తు ప్రియుని రాక,
దేశాంతరముం బోవగ
పతి, తన చిత్తములో వగ
నందు వనిత, ప్రోషిత
బర్తృక, అతి శోషిత

ఏనాటికి వచ్చునంచు
శకునమ్ముల తానుగంచు
దివసమ్ములనుం గణించు,
పునర్మిలన కాంక్షవల్ల
బ్రతికి యున్నదల్లన
అసువులనుంబట్టి, వల్ల
భుని గూరిచి ఆవేదన
పడు నాసతి కడుగా; దన
జోడును విడిపోయిన
జక్కవ పులుగోయన

కనంబడుచు నుండ చింత
కంపలాగ కబరియంత
తాల్పక భూషణల నుంత
గాడ్పునల్ల పడినయట్టి
జాజినల్లిలాగ, పట్టి
ధూళి ధూసరమగు మట్టి
               పన్వళించి, పతి సుందర
               రూపమ్మది తన ముందర
తోచ, రమణి టక్కున
కవుగలించి స్రుక్కును

తన మనోహరుడగు వాని
కాంచు బాగ్యము కలనేని
కల్గనన్న, నిదురరాని
కతము, సతము ప్రియుని నాను
పారాయణసల్పు, కామ
బాధ కోర్వరాక, బామ;
               దేశాంతరమం దుండగ
               హృదయేశుడు, హృది మండగ
నిప్పుల నిట్టూర్చును
కనుల జలము కార్చును.



# కలహాంతరిత

సఖుల సమక్షమున చరణ
పతిత ప్రియుని నిరాకరణ
సలుపు, దురభిమానమ్మునకు
ఇచ్చి నిజసుఖమ్ము బలిని,
పిదప పరాకృతమ్మునకు
వగచుచుంది రహస్స్థలిని
తన ఖర్మను తా దలంచి
మ్రోగు వేదనా విపంచి
విధిని గురు వ్యధా బరిత
లలితాంగి కలహాంతరిత

నిదాఘమున నిహత ధరణి
వద్దనునా? వరుని కరణి
వంగియున్న వలాహకము?
వద్దనునా? మంచు వలన
చచ్చిన లత, వరుని రకము
వసంతమును? అయిన లలన
ఏ క్రూర పిశాచి కుటిల
దుర్మంత్రపు దురా, ఇటుల
తన స్వాధీనమ్మును విడి
పూనినది వింత నడవడి?

"ప్రాణపతిక పారమయిన
ప్రణయమ్ముగద నా పయిన
ఇటుల అందరి సన్నిధిని
నా పాదములకు నమించు
బానిసకు బానిస విధిని,
హా, దుర్విధి . కోపగించు
నా చిత్తము పోలచితిని
అతని నిరాకరించితిని"
అనుచు విలాపించు నవల
పదే పదే వల వల వల

"ఇది యేమిటి పిచ్చ వలపు
ఇటుల ప్రవర్తించు తలపు
కలుగ జేసినదీ గతిని,
మధురంబగు మహా సుఖము
దరియనన్ను, మూడమతిని
చూపితిగా పరాంజ్ ముఖము"
అనుచుం బలుమారు తనను
తాను నింద సలుపు కొనును
అతి చిత్ర కరుణా చరిత
తరళాక్షి కలహాంతరిత



# స్వాదీన పతిక

నిత్యమ్ము ప్రణయ బృత్యమ్ము సలిపి,
రచియించి చనుల మకరాంకుని, లిపి
ముద్రించి ముద్దు పయిముద్దు, వింత
యందాల కుప్పయని దేహమంత,
పరవారి కంట పడకుండు రీతి
పరిరంబణమున బంధించి ప్రీతి
ప్రాణాధిపు డుపలాలింపు చుండ
స్వానంద సుధల బాండమ్ము నిండ
సంతోషి తాత్మస్వాధీన పతిక
రమణీయ నవ్యలావణ్య లతిక

రాత్రింబవళ్ళు రతిదేవి నోజ
కావించుచుంది కందర్ప పూజ
తన జీవితమ్ము తగనాటపాట
నిష్కంటకమగు కుసుమంపు బాట,
తన నోము ఫలము, ఎలాటి అతుకు
లేనట్టి మంచి బంగారు బ్రతుకు
ఆనంద సరసి రాయంచ సరణి
విహరించుచుంది మోహాల బరణి
సంతుష్టితాత్మ స్వాధీన పతిక
రమణీయ దివ్యలావణ్య లతిక

ఆనంద గగన మందుద్భవించి
నటువంటి తార, సుఖపున్ విపంచి
ప్రాణాధిప ప్రణయ మద్యమత్త,
ఉద్యాన విహారణాసక్త చిత్త
పరితోష జడధి పగడాల దీవి
శోకమ్ము కనని సుఖ పూర్ణజీవి,
తన కన్నుసనల దాస్యమ్ము, ప్రాణ
పతిచే ముదమున చేయుంచు జాణ
సంతుష్టితాత్మ స్వాధీన పతిక
రమణీయ దివ్య లావణ్య లతిక

మిధునమ్ము తిరుగు పథసీమ సతము
చీకట్లు లేక జ్యోత్స్నా భరితము
హసియించు నవుర తమ నవ్వుతోడ
పులకించి సర్వభువనాలు కూడ,
ఈ దంపతులకు ఎకమ్ములోని
ప్రాణమ్ము, దేహములు వేరుకాని;
మధువందు తియ్యదనమట్లు, అలరు
లోతావి పగిది ప్రియునాత్మనలరు
సంతోషితాత్మ స్వాధీన పతిక
రమణీయ నవ్యలావణ్య లతిక.



# చయినా యువతి

ఓ సుందరమగు చయినా
దేశంపు మత్స్య నయనా .
నీ యందము వినుతింపగ
సాధ్యంబ బ్రహ్మ కయినా?

జ్యోత్స్నాద్రవంపు టలయా,
లేకున్న వింత కలయా,
నీ నవ్వు? నిత్యనూతన
లావణ్య శోభ నిలయా .

రక్తాధరముల·పయినా
నోరార ముద్దు లియనా?
శూన్యాంతర శశిరీతి, మ
దీయాంతరంగ శయనా .

నీ పల్కులు శుక రుతముల్
నిన్ సోకగ మారుతముల్
మూర్ఛిల్లునహో . నీ నయ
నా లర్ధ నిమీలితముల్

ఓ సందరమగు చయినా
దేశంపు మత్స్య నయనా .
నా ముంగల నిలుచుంటివి
దివ్యాప్సరస్సఖియనా .



# హ్యేల

హవాయి కడు తీ
యవాయి పడతీ
బవచ్ఛతురిమన్
విలాస గరిమన్
నుతింప నసహా
యుడీతడు సహా .
సఖి   నీ కలహా
స మాలిక లహా
వసంత కుసుమా
ల సంతలు సుమా
ప్రియా విపుల నే
త్ర యుగ్మముల నే
నుతింప గలనా
అల్లోహ లలనా



## మూర వాంఛ

అల్లా దయవల్ల
అండ లూసియను పిల్ల
మధురంబగు మాంజనిల్ల

అన్నీ యివి యున్న
భాగ్యవంతుడను, అన్న .
బాగదాద్ కలీఫుకన్న

అచ్చా . బహుతచ్ఛ .
గ్రనడాపురమున, నిచ్ఛ
మనుట నాకు మిగుల ఇచ్ఛ.

వద్దూ, యిక వద్దు
అరాబియంతా రద్దు
ఇమ్ము నాకు ఇంపు ముద్దు

నానాడుల్ తోస
బంధించితి, సుల్తాన .
నిను నేనిక వదల్తాన



# లాక్ లోమండు

కనుమోసి ప్రియురాల
అది లాకు లోమండు

స్కాట్లాండ్ సరోరాజ
ము, జగత్ ప్రసిద్ధమ్ము ;

ప్రకృతీ రమణియున్న
కవి సార్వభౌముండు

తమ చందముల జూచు
కొనునట్టి అద్దమ్ము,

లవలీ లతలు మేని
పయి బూయు గంధంబు,

మధు మాసమున చిత్త
జుడు చిల్కు పన్నీరు ;

ఇది ఏ ద్రవీభూత
మయినట్టి అందంబు ?

ఇది ఎ విరహిణీ ర
మణి కార్చు కన్నీరు ?

ఇది, గేలిక కవీశ్వ
రుల ఊహ సాధింప
గా రాని రసవత్త
ర మనోజ్ఞ కావ్యమ్ము;
ఇచ్చోట నిరతమ్ము
ఇల్కాల్ నినాదింప
ఆహ్లాద మాహ్లాద
మతిలోక శ్రావ్యమ్ము
తమజాతి గర్వంబు
నిలుపంగ కయ్యాల
విరజిమ్మిరి సుమంబు
ల విధాన ప్రాణాలు
ఈ రోజున తరంగ
ముల మీద నుయ్యాల
లూగాడు, ఆ యోధ
ల కథా పురాణాలు
ఇది చూడ స్తంభించి
నది నాకు కాలమ్ము
ఎదియో మధురబాధ
హృదయమ్ములో మండు
ఇది ఎమిటీ గార
డీ, యింద్ర జాలమ్ము
కనుమోసి ప్రియురాల
అది లాకులోమండు .

☆ ☆ ☆

# స్కాచి పిల్ల

స్కాటాండు సరోరుహాక్షి .
నీదు సోయగమ్ము సాక్షి
కన్ను గుట్టు నిన్నుజూచి
నంత, త్రాగినట్టు స్కాచి

మంచు ముసువునుండి నవ్వు
బంగారు గులాబి పువ్వు
కరణి కానుపించు, నీ మ
నోహ్యారాస్య, మోసి లేమ .

హెదరు పూల తోడ మెండు
నిండి విరాజిల్లుచుండు
ట్రోషాకు ధరాధరాలు
తావకారుణాధరాలు

రామణీయకమ్ము జిమ్మె
తావక స్తన ద్వయమ్ము
బార్లీరయి కుప్పలట్టు
ఆధిక్యత కాటపట్టు

జగత్ఖ్యాతి నందినట్టి
స్కాట్లాండు జనాల, గట్టి

మట్టస దనమంత, చాన !
కలదు నీదు కవును లోన

ఉన్ని ట్వీడు కన్న గూడ
ఉడుకునిచ్చు నీదు గాడ
పరిష్వంగ బంధనమ్ము
మోహాగ్నికి ఇంధనమ్ము

స్కాట్లాండు సరోరుహాక్షి .
నీదు సోయగమ్ము సాక్షి
కన్నుగుట్టు నిన్నుజూచి
నంత, త్రాగినట్లు స్కాచి



# స్కాట్లాండు

స్కాట్లాండుకు నాకు గాడ
సంబంధము కద్దు, చూడ
దూరమ్మున నున్న గూడ
రసవత్తరమగు నిగూడ
బంధమ్ములు కలవు మధ్య
ప్రవీణుండ నగుదు పద్య
రచనా సుమనోజ్ఞ విద్య
గ్రోల స్కాచి మధుర మద్య
పానమ్మును· అస్మదూహ
ఉత్సాహ సితాశ్వవాహ
నంబు నధిష్ఠించి, సాహ
సించు నభోవీధి, నాహ

యమునా కావేరి గంగ
నదుల యందునన్ మునుంగ
బోను; యాచమనము ద్రింగ
బోను; అస్మదంతరంగ
మందు సదా కోరుచుందు
స్కాషియా మధు రస బిందు
వుల ద్రావగ నిచ్చ; ఇందు
కిరణమ్ముల తరచి విందు
సలుపు చకోరమ్ము లాగ,
ఇచ్ఛగింప ఇలను బోగ

బాగ్యంబుల యందు మూగ,
పల్లకీల పయిన పోగ,
భోగంబులు బుద్బుదాలు
నిష్ప్రయోజనంబు శ్రీలు
మధువు మటుకు మహిని చాలు
మిగతదంత మింటిపూలు
స్కాట్లాండు, జగాల రాణి
రస రాజ్యపు రాజధాని
ఇలను దాని ఈడు రాని
బార్లి ఆసవమ్ము నాని
స్తోత్రింతును – ఓసి స్కాచి
భూమి . నీ మధువుంజూచి
ప్రాణంబులు పయికి లేచి
వచ్చు నాకు; నూత్నరోచి
కను కనుమల కందళించు
తలను గ్రమ్మియున్న మంచు
విడును, చిత్తము పులకించు
భావమ్ములు పల్లవించు
జడము స్వర్గమటుల వింత
హరువును ధరియించు నంత
విడును చింత విడును వంత
భువమునంత పువులసంత,
ఓస్వాదు సుధార్ద్రమూర్తి !
నిను గోరితి మనస్ఫూర్తి
వినుతింతును భవత్ కీర్తి

శమియింపగరా మదార్తి
ఎల విలంబమ్ము ? నీవు
రాకుండినచో బ్రతుకు చావు
వచ్చినచో ముదము లావు
గళ వేదన కరగిపోవు
నీ తాకుడు వలన, భీర
చిత్తమ్ములు కూడ వీర
వంతంబగు, సుఖపు తార
దుఃఖపు నిబిడాంధకార
మందు కూడ ప్రస్ఫుటిల్లు
క్షుధలుమాను, సుధలజల్లు
బంగరు స్వప్నంబులల్లు
ఇంద్రజాల మిల ఘటిల్లు
నిరుపేదయు నిన్నుపూని
సేవింపుచునుండు నేని
అనవరతము, అవనిజాని
లాగ మారిపోవు; కాని
లేదక్కట మంచికాల
మింక మాదు ఖర్మగాల;
ఇది జూచి సహింపజాల.
యుగ యుగాలనుండి చాల
సుజల సుఫలమయిన నాడు
నంత ప్రభుత్వమ్ము బీడు
గావించిన, దిచటిపాడు
బ్రతుకు కన్న అచటి ట్వీడు

నదీ తీరమందు, చిన్న
పోచగ నే పుట్టియున్న
సుధనుం దిను సురునికన్న
రసవంత సదాప్రసన్న
కాలమ్మును గడుపువాడ,
దూరమ్మున నున్న గూడ;
స్కాట్లాండుకు నాకు గాడ
సంబంధము కద్దు చూడ



# బుజ్జగింపు

విడచి ప్రణయకోపము
సఖీ .

చంద్రముఖీ . నీదు
నవ్వు మోము జూపుము
దయను గలిగి బాపుము
ఆహా !

నాదు మహా తీవ్ర
విరహ విధుర తాపము
ఖతము సేసి దీపము
ప్రియా .
ప్రేమమయా . దాని
మన్మనమున రేపుము
చలువరాళ్ళ స్థాపము
భవత్
చారు నవత్ దివ్య
నగ్న నవ్య రూపము
నా వాంఛ ద్విరేపము
సఖీ .
పద్మముఖీ . నీదు
అందమంత జూపుము



# నిశారాణి

ప్రాగ్దిశా పర్వతశ్రేణీ కుహరాల నుంచి
శ్యామసుందరీ . గ్రీష్మ కుహూనిశారాణి .
వజ్ర సచకిత శర్వరీశాటి ధరించి
అరుదేరవమ్మ, ఈ క్రూరార్కక్షుణ్ణ క్షోణి,
క్లాంతగ్లానుడను, దయగలిగి నా పయిన
నీ నీల జటాలమునందున, ఈ ధాత్రి
నవగుంఠితముసేసి జడాతీతమయిన
కలల్లాలింపవమ్మ, మహా మోహనగాత్రి .
నీ నీల నీరవ వంశీనాద ఝురియందు
మునిగిపోయినట్టి తారాగోపిక రీతి
తంద్రిత మదీయాత్మ తన్మయత్వము నందు
అపరూప పరమంబగు నవ్యాజప్రీతి
జేసికున్నాడ నా హృదయ పీఠిక, నిష్ఠ
దేవీమూర్తిరో ! నీ దివ్య సుందర ప్రతిష్ఠ



# చిన్నదాని కన్నులు

చిన్నదాని కన్నులలో
ఉన్నదిరా ఉన్మాదము :
పూర్ణశశి పులకీకృత
కానన కుసుమాహ్లాదము,
ప్రశాంతమగు నిశాంతముల
మీటిన వీణానాదము,
వధూవరుల మధురమ్మగు
శయ్యాతల సంవాదము,
ప్రణాయార్ధము ప్రసవేషుని
శృంగారాశీర్వాదము,
ఐక్యమ్మయి అద్భుతముగ
నాకిచ్చుచు నామోదము
చిన్నదాని కన్నులలో
ఉన్నదిరా ఉన్మాదము



# నటరాజు

ఎగుర గొట్టబడి
విడిన జుట్టుముడి
నల్లగట్టు లాగు గనబట్టు
గిరుల నట్టనడి
దుముకునట్టి వడి
గలిగి అట్టహాస్యనది పుట్టు
రగులునాట్యమాడ నటరాట్టు

ఉడుకు నాలికల
ఉరుకు పోలికల
కనలు ముట్టి కోరికల జట్టు
పయికి లేచి కడు
పువులు పూచి పడు
అతడి పట్టు పాదముల చుట్టు
మిగుల నాట్య మాడ నటరాట్టు

అపుడు లోకముల
సుఖము శోకముల
ఇనుప పట్ట కారులవి పట్టు
తిరిగి బాష్పములు
తిరిగి పుష్పములు
అతడి మట్టుక్రింద తుదముట్టు
రగులు నాట్యమాడ నటరాట్టు



# నర్తకులు

తేలిక లతాంతములు
తూలికలు వ్రాలు విధి
వ్రాలి కడు నచ్చరల
కేలికలు, వేశ్యా
బాలికలు చిత్రమగు
కేలికలు సల్పిరి, ని
చోలికలు లేక, నిడు
వాలికలు వీక్షా
తూలికలు జల్లుచును,
జ్వాలికల నందమగు
పోలికల; చూపరు మ
ధూలికల చాలన్
గ్రోలి కళ లందు, నళి
పాలికల లీల సుఖ
డోలికల నూగుచును
సోలికల లందన్



# రజస్వల

చిత్రముగా నోజవ్వని .
హఠాత్తుగా రివురివ్వని
యవ్వనము పడగ విప్పుడు
చూపరుకున్ వ్యధ యిప్పుడు.

భవత్ శరీరపు వాటిక
వసంతకాలము నేటిక;
రమణీమణి. నీకంఠము
లో కూయును కలకంఠము

విడిపించును నీ నాసము
మలయానిల మను శ్వాసము,
పుష్పించును నీ కాయము
లోనన్ ముకుళ నికాయము

సఖి! నీ దేహపు టామని
వర్ణింతును నేనేమని?
పడనీ నను ఈ నూతన
శోభయందు సుఖయాతన

గులాబిలా జిలేబిలా
పసందయిన పడచుపిలా.
నీ అందము, హలా. హలా.
రసోజ్వలా, రజస్వలా!

## వాంఛ

బ్రతుకంతా
నాటకమూ, బూటకమూ
కాటకమున కీటకమూ
బ్రతుకంతా నాటకమూ

మనమంతా
మానిసులం బానిసులం
బానిసలకు బానిసలం
మనమంతా మానిసులం

మన ఆసలు
గోడలుగా, చీడలుగా
నీడలతో మేడలుగా
మన ఆసలు గోడలుగా

ఇవియన్నీ
నాకేలా? ప్రియురాలా!
ఈ కీలా బరఖేలా,
ఇవియన్నీ నాకేలా?

జవరాలా.
కనుమూసీ, ననుదీసీ,
నా వాసన నలిపేశీ,
జవరాలా. కనుమూసీ,

అది చాలును
సర్వసుఖం, స్వర్గసుఖం
అమితసుఖం సుఖంసుఖం
అదిచాలును నాకుసుఖం



# వెన్నెల

ప్రాయపు టెద బావమ్ముల
ప్రోవటు వెలుగున్నెల;
విరహముతో వెదకి కొనగ
ప్రియుల అడుగు చిన్నెల
వన పథముల అనుపుచుంది
గడుసుమారి కన్నెల

పుర వనముల మరుతలముల
నదుల ఇసుక తిన్నెల
క్రొత్త హరువు క్రుమ్మరించు
చుంది వెండి గిన్నెల
కాయమ్మును గగనమ్మును
కలుపుచుంది వెన్నెల

సఫలమ్మును సల్పుచు, చ
కోరికముల జన్నెల
నగ్న నభో మంటపమున
కూర్పుచు పలువన్నెల
ప్రాయపు టెద బావమ్ముల
ప్రోవటు వెలుగున్నెల



# కుంభవర్షం

కురుస్తూంది కురుస్తూంది
కుంబవర్షం కురుస్తూంది
గగనమే దగ్గరకువచ్చి
బిగ్గరగా అరుస్తూంది

శతశతమ్ముల సరణి పిడుగులు
పరిపరిల్లున పగులు చుండగ
విద్యున్మత్త మేఘధ్వజిని
వియత్సీమను విహరిస్తూంది
అత్యుగ్రగంగ నదిరిస్తూంది
కుంబవర్షం కురుస్తూంది

మిక్కుటమ్ముగ మించు జల్తా
రుల గలింగిన రుద్రమేచక
మేఘాల్నంత పాగాల్గాగా
అదో, ఆ గిరి ధరిస్తూంది
వే మార్గాల సవరిస్తూంది
కుంబవర్షం కురుస్తూంది

మించు కంచీ చురుకునుం దిని
ఉడుకు బుట్టీ ఉరుకు మబ్బుల
గుర్రాల్జేయు కోలాహలము

దిగంతాల ప్రసరిస్తూంది
రోదస్సంత ముఖరిస్తూంది
కుంబవర్షం కురుస్తూంది

వజ్ర మాలలు వారి ముక్తలు
నిండుగా కానికల నిచ్చుచు
ఆకాశమ్ము భూ కామినికి
వియోగార్తి గుదురుస్తూంది
తానే యిప్పుడు వరిస్తూంది
కుంబవర్షం కురుస్తూంది

నదులు దూకగ నమలి గుంపులు
నటన మాడగ, నవ్వుచుండగ
భూమీజములు, భుగ్నాంబరము
తటిత్ భ్రూవుల విరుస్తూంది
నా చిత్తమ్మును హరిస్తూంది
కుంబవర్షం కురుస్తూంది

కురుస్తూంది కురుస్తూంది
కుంబవర్షం కురుస్తూంది
నీలి మబ్బులు నీళ్ళకుప్పల
నదే పనిగ నురుస్తూంది



# వెలుగు

ఇరులకు వెల్తురులు కలుగు
జగతినంత జిగిలి వెలుగు
నా గుండియ లోన మెలగు
వింతయయిన వెలది వెలుగు

తరణి నుండి ధరణి నిండి
మట్టిలో రగిల్చి చిచ్చు
చంపకమ్మునకు పసిండి
రోజాకును రంగు లిచ్చు

కమలమందు కాంతిదూకి
పరిమళముగ పరిడవిల్లు
అంబరమున అదియ ప్రాకి
వంపుచుంది పొంపువిల్లు

కిలికించిత రసము బంగి
తరుణి కనుల తయారవును
అంత చిత్తమందు పొంగి
పెదవుల నడి కదలినవును.

కడలి అడుగులకును జారి
ముత్యమట్లు ప్రజ్వలింపు

అదియ అవని హృదిని దూరి
రత్న సంపదలను నింపు

నిదుర సందరంబునందు
అలల కలల వలల బన్ను
శోఖములో సుఖము చిందు
గ్రుడ్డివాని కిచ్చు కన్ను

నిశ్శబ్దత లోన నుక్తి
మొయిలు నందు హొయలు మించు
అణువణువున అమర శక్తి
అగుచు తాన పరిణమించు

చిత్తరవుల యందు నిలచి
జీవమ్మును పోయుమెండు
కవుల బావములను వలచి
పద్యములుగ మార్చుచుండు

విడిపోవగ జడత బ్రాంతి
సత్యంబయి ప్రకాశిల్లు
ముని మనమున అగును శాంతి
మిత్తపయి నమృతపుజల్లు

ఇరులకు వెల్తురులు కలుగు
జగతినంత జిగిలి వెలుగు
నా గుండియ లోనమెలగు
వింతయయిన వెలది వెలుగు.



# విరహి

పడును వాన ఝుర ఝురా
ప్రియా రమ్మి బిరబిరా

వియోగాగ్ని దేహము
మండును, నా దాహము
తీరదు, నా మోహము

అనివార్యము హరహరా
ప్రియారమ్మి బిరబిరా,
పడును వాన ఝురఝురా

జల్లు కురియు జలజలా
మంట లట్లు మలమలా

నాదు కనలు కామము
ముక్తపరచు ధూమము
లాగ క్రమ్మి వ్యోమము

లోనమబ్బు నలనలా
మంటలట్లు మలమలా
జల్లు కురియు జలజలా
పడును వాన ఝురఝురా
ప్రియా రమ్మి బిరబిరా

అస్మదంతరాళము
లోన విరహవ్యాళము
దుముకు విధి, ఖగోళము
నందు మించు గిరగిరా
ప్రియా రమ్మ బిరబిరా
పడును వాన ఝురఝురా
విచలితుండ వినవినా
పిడుగుల కడు ధనధనా

వాని మారుమ్రోతలు
నా మనంపు టూతలు
అవ్వి బవద్దూతలు

కావుగా, జమున మునా!
పిడుగుల కడు ధనధనా
విచలితుండ వినవినా



# బండి

బ్రతుకు ముళ్ళ బాటలలో
చీకటిలో చిచ్చులలో
పాటు బడీ వాటు బడీ
పోతూన్నది నా బండి
ప్రయాణమున బడలియున్న
వాడనయా భగవంతుడ
కరుణతోడ గ్రహియింపుము
పగ్గాలను నానుండి
సారథ్యము సలుపు చుండ
నీవ, కడున్ నిర్భయముగ
విశ్రమింతు, చిత్తమందు
భద్ర శాంతి సుధ నిండి
జంకులేదు శంకలేదు
మహానందమయుడ నయ్యి
కనుల మూసి కనుచుంటిని
సుస్వప్నముల పసిండి
అడవి దాటి అచటనున్న
అందమగు పురానికి, నా
తో గూడను పోగోరిన
వారందరు రా రండి



# ఉషస్సు

పటాపంచలగున్ ధ్వాంతి
జగము నంత, కాంతి, కాంతి
రక్తరోచిమదోన్మత్త
విహంగంపు లురత్ చిత్త
గానమ్మది చాటుచుంది
ఉదయాగమనమ్ము నంది
లాగ, ప్రభు స్వరము విన్న
తక్షణమ్మ తూగుతున్న
భటుడు ఉల్కిపడిన మాద్రి
కనంబట్టును పూర్వాద్రి
అయోమయంబయిన రాత్రి
అంతమగుట, స్వర్ణధాత్రి
పులకించును పర్ణ పర్ణ
మది, ప్రభాత సతి సువర్ణ
కరాంగుళాల గిలిగింత
లంది; మంచు రగులు వింత
కనులవిప్పి పువ్వు పువ్వు
కలకలకల మనుచు నవ్వు ·
కదలి ఆడు అల్లి బిల్లి
లాస్యము మాలతీ మల్లి
ఉదయ పవనములకు డమ్ము
రకము మ్రోగు నరణ్యమ్ము
ఝముకు కోనలో సివంగి

పిల్ల హరాత్ శరము బంగి;
నిద్రలేచిన పులి పిల్ల
అడవి యంత దద్దరిల్ల
గంతులిడును ఖడ్గమట్లు·
పాట పాడు నేటి గట్ల
బెకమ్ములు; కనలు మించు
కరణి త్రాచు కస్సుమంచు;
సుధా నిర్ఝర ఝరి పర్వి
ముంచినట్టులున్న దుర్వి;
నగ్నమయిన నవ్యమూర్తి
దీప్యమాన దివ్యస్ఫూర్తి
తోడ, పూర్వజలధినుండి
అప్సరలాగా పసిండి
ప్రబ విముక్తమగుచు నుంట
జగంబంత జిగిలి పంట,
పటాపంచలగుట ధ్వాంతి
జగమునంత కాంతి, కాంతి .
రమ్మ ఉషోరమణి . కాంతి
మయీ . ఇమ్మ మనశ్శాంతి
నీదు నిశ్వసనము, అంబు
జమున చేరి సుగంధంబు
కరణిమారు, నీదు చూడ్కి
హిమమున కర్పురము మాడ్కి
కానుపించు; నాదు స్వాంత
వీణపయిన నీవు శాంత

సుస్వరమ్ముల పలికింపు
అమృత ధారల చిలకింపు;
తమోపూర్ణ చిత్రపంచ
మంత, కడున్ జలదరించ
సోకనిమ్ము భవత్ దృష్టి
ప్రచుర భవ్య రుచిర వృష్టి.
సకల కల్మషములు, సర్వ
నాశనమవుగాత ! గర్వ .
రహితంబగుగాత . శుభ్ర
వంత మగుత . శారదాభ్ర
మటుల; ఇపుడు నా మనస్సు
విడిచిపోవగన్ తమస్సు
అమల సుందరమగునట్టి
గుండియ హారతింబట్టి
నాడ నీకు, ఓ సుహాస్య
మాలికా మనోహరాస్య .
దుశ్శక్తుల దునుమ త్రుంప
స్వరాజ్యమ్ము చలాయింప
ఆహవంబు అనుదినమ్ము
జరుగుచుంది మన్మనమ్ము
నందు, దాన విజయ సిద్ధి
కలుగ సాయపడుచు బుద్ధి
వికాసింపజేయ వమ్మ .
వదలిపోవ హృదిని రిమ్మ;

అంధకార అసుర శక్తి
నుండి యిమ్ము మాకు ముక్తి;
విజ్ఞానపు విపుల వ్యాప్తి
అజ్ఞానపు పరిసమాప్తి,
బంగపరపుమా . త్వదింద్ర
జాలమ్మున నాదు తంద్ర,
రమ్ము, ఉషోరమణి. కాంతి
మయీ. ఇమ్ము మనశ్శాంతి



## జలపాతము

అట్టిట్టు ప్రవహిస్తు
అట్టహాస్యము జేస్తు
పాతాళమునకేను పడిపోవుచుంటాను
పడుచుండి పడుచుండి పడి పడీ నగుతాను
లేత కొబ్బెర పాల రీతి కడు తెల్లగా
అమరాళితాగమృతములాగు చల్లగా
బిడ్డపై తల్లికి ప్రేమలా కొల్లగా
అట్టిట్టు ప్రవహిస్తు
అట్టహాస్యము జేస్తు
పాతాళమునకేను పడిపోవుచుంటాను
పడుచుండి పడుచుండి పడి పడీ నగుతాను

పల్లంపు భువివంక
ప్రవహింతు నిశ్శంక
పడుటన్న నాకేమొ పరమ సంతోషమ్ము
సంతోషరాశియే స్వాంతమైనది సుమ్ము
కరిగివచ్చినయట్టి కౌముదీ కాంతిలా
ప్రకృతిప్రియుల మేను మరపించు భ్రాంతిలా
సత్యసుందరమైన అత్యంత శాంతిలా
పల్లంపు భువి వంక
ప్రవహింతు నిశ్శంక
పడుటన్న నాకేమొ పరమ సంతోషమ్ము
సంతోషరాశియే స్వాంతమైనది సుమ్ము

నా స్వాంతమున కంది
పిలుప్రుమోగుచు నుంది
రంగత్తరంగాల సంగమ్ముకయి నేను
అర నిమేషము గూడ ఆలసింపగ లేను
కవి యూహలోని రాగాలులా సొంపుగా
రాత్రిలో వేణు స్వరములాగు నింపుగా
ఉన్మత్తుడగు ప్రేమికుని విన్నవింపుగా
నా స్వాంతమున కంది
పిలుపు మ్రోగుచునుంది
రంగత్తరంగాల సంగమ్ము కయి నేను
అర నిమేషము గూడ అలసింపగ లేను



# కవీ !

వ్యసన హసనముల ససనన
నిస్వనముల నీదు రసన
మస్పణముగా చిల్కింది
ఎదల మధుర మెదియె కదల
సుధల విధము వ్యధల, మృదుల
పదము లందు పల్కింది
నురువు లనవు కడలి పరువు
దరువు నగల వెరవు హరువు
నీ పాటల పార్లింది
జతలను విడి స్మృతులను తల
పోవు సతుల వెతల కతల
కారుణ్యము ద్రార్లింది



# స్పర్ధ

అతడు వచ్చి అనును, "ప్రియా
ముఖము చూపవే" యని
కోపముతో గొణిగితినీ
'నన్ను విడిచిపో" యని

విడిచిపోక నిలచి ఎదుట
పట్టును కేల్దోయిని
దీనిని గని దిగ్భ్రమమున
అరచితిని "అహో" యని

అంత నాదు వీనులలో
కూయును "కూకూ" యని
ముఖము చిట్లజేసి నేను
అంటిని "ఛీ ఛీ" యని

అదియు వినక అతడు సాహ
సమ్మున తన తీయని
పెదవుల నా పెదవులకుం
జేర్చును, "సకియా" యని

నివారింపజాల నయితి
నపుడు ప్రబల కాయుని
నా మెడలో మాల గొనీ
పోయెను, నడిరేయిని
కనుల జలము క్రమ్మ, తలచు
చుంటి వలపు రాయని
గూర్చి "తిరుగ నా కడకా
తం డికరాడా" యని

– రవీంద్రునికి అనువాదం –



# ధర్మవిచారణ

విప్రుడనును రాత్రి వేళ :
"చోరు డొకడు, స్వీయ
నిదురబోవు గది జొరబడె
ధర్మహతిని జేయ;
పట్టినాడ నతని, యిండు
శిక్షను తగినట్టు";
"మృత్యు' వనుచు నుడువు నంత
రత్నరావు రాట్టు

దూత వచ్చి ఉదయ వేళ
అనును,- "తమ సుతుండు
అర్ధరాత్రి విప్రుచేత చిక్కి తాహతుండు";
"ముక్తి నిమ్ము" నుడువునంత
రత్నరావు రాట్టు

– రవీంద్రునికి అనువాదం –



## షురూహువా

స్వతంత్రతా యుద్ధం
ఇదే మా
స్వతంత్రతా యుద్ధం
రణ మారణ బయరాహిత
నర నారులు సిద్ధం స్వ

రానీ లారీ పోటుల్ నిండా
ఉడాయింతుం సదా మా జండా
మాయీ రక్తం మాయీ కండా
దవాగ్ని సమాన ప్రసిద్ధం స్వ

నిరర్ధకం నీ పిరంగి యంత్రం
జపించుచూ మేమహింస మంత్రం
ప్రశాంతితో కోరుచూ స్వతంత్రం
నిరంతము నీకు విరుద్ధం స్వ

అపూర్వ ప్రేమోజ్వలంపు శక్తిన్
గడించుతాం బారతాంబ ముక్తిన్
జగానికంతా మహానురక్తిన్
మనోశలు మావి విశుద్ధం స్వ

ఓరోరి, శ్వేత దండశూకం !
ఈనాడున్ మేమంతా ఏకం
సముద్రమట్లే మా ఉద్రేకం
అణంప గలుంగు టబద్ధం స్వ

స్వతంత్రతా యుద్ధం
ఇదే మా
స్వతంత్రతా యుద్ధం
రణ మారణ భయరాహిత
నరనారులు సిద్ధం స్వ

– హరీంద్రునికి అనువాదం –



# ప్రేమ

ఝరులు కలయు ద్వీపవతిని
నదులు కలయు సరిత్పతిని
మిళిత మగును మింట, సంత
సమున చల్లగాలు లంత;

ఎకాకిగ సర్వ జగతి
లేదేదియు; సుందర గతి
ప్రతి వస్తువు మరోదాన
కలసి సఫల మవునుగాన,

సఖియరో! మదాత్మ నీదు
హృదిని ఏల కలయరాదు?

గగనానికి చుంబనములు
నిచ్చు గిరులు, తరంగములు
అన్యోన్యము కవుగలించు
పువులు స్నేహమున హసించు;

కనుమా సఖి. తరుణ తరణి
కర నిబద్ధమగుట ధరణి,
చంద్రికలున్ కడలి అలల
ఊగుచుండుట నుయ్యలల;

ఇవన్ని నాకింపు సున్న
నిను ముద్దిడ జాలకున్న

— షెల్లీకి అనువాదం —



# వృద్ధాప్యము – యవ్వనము

రసమయమగు కాలమ్మది
యవ్వన ప్రాయంబు మిగుల
అసహ్యమగు ముసలితనము
కలిగించును కడు విసుగుల;

పరమ వాంఛితమ్ము ప్రపం
చమున యవ్వన ప్రాయము,
మధుమాస నిశాంతమట్లు
ఆనంద సుధా మేయము

జగమునంత చంపు సుఖము
వృద్ధాప్యము తన చేతను
చలికాలపు దివస మటుల
పుట్టించును కడు రోతను

జవ్వనమ్ము చంగు చంగు
ఉరుకుచున్న ఉడుకు దుడుకు
ముసలితనము మూల్గుచున్న
నడువజాలనట్టి వడకు.

యవ్వనమ్ము బయవిహీన
నిరుపమాన సాహసమ్ము
వృద్ధాప్యము వెరపు గొలుపు
బయంకరపు నీరసమ్ము

ముదుసలితనమున్ మిక్కిలి
నేనున్ సహియింపజాల
కాని జవ్వనము మట్టుకు
ప్రేమింతును నేను చాల

– షేక్స్పియర్‌కు అనువాదం –



# ఆరోగ్యోపదేశము

ఎవస్తువు కూడ, సదా
పుడమి నుండబోదుగదా.
పుష్పమునకు క్షణము కేళి
అటు మీదట పడుట ధూళి

గగనమందు మణినిబోలి
తనరుచున్న అంశుమాలి
పయికి ప్రాకునంత వడిని
పడును అస్తగిరుల నడిని.

అస్థిరమ్ము పువులకన్న
వయస్సు కాని, అది చన్న
పిదప, పయికి దుముకు హంత
కుని విధాన జర తనంత

కనుక, జనుల జీవితంబు
నందంతకు యవ్వనంబు
ఉత్తమమని గ్రహించార?
ఓసి పూవుబోణులార

నా మాటల నాలకించి
చేపట్టుడి, మీరు మంచి
వరులనింక, వయస్సుండ
ఆలస్యము చేయకుండ;

ఇచ్చువచ్చినట్లు తిరుగ
వచ్చు పిదప వయస్సరుగ·
ఎ వస్తువు కూడ, సదా
పుడమినుండ బోదు గదా.

– హెర్రిక్కు అనువాదం –



# విగత ప్రేమ

శోకాతిశయమ్ము చేత
కనలుచుంది తప్త శాత
శూలాగ్రపు జ్వాల మాడ్కి
చురుకుబారి అతని చూడ్కి

క్షణ క్షణము వృద్ధి గాంచు
చుంట గరిక, అతడు కాంచు;
సుస్పష్టము ఇనుప గోడ
కవ్వలిదీ, అతడు చూడ;

శవము కుతుకనుండి ఉసురు
ఎగసిపోవు వెరవు విసురు
కాంచజాలు నతడు; తూపు
విధము చురుకు అతని చూపు
నూరు యోజనముల దవ్వు
నుంచి వినంజాలు, నువ్వు
మదిం దలచి నట్టి మాట
రాక ముందు నీదు నోట

గ్రహియించును సులబలీల
సాధారణమగు జనాల
కగోచరంబయిన, సృష్టి
రహస్యముల నతని దృష్టి

విశ్వసింపజాలనంత
సూక్ష్మ సూక్ష్మమయిన వింత
ధ్వనులు సల్పు వెతల విందు
అతని కర్ణపుటము లందు;

అతనికి గల పలవంత,
చీమ సంతతి పడుచింత,
పరువుబాస, పువులు మంచు
గ్రోలుచుంట, వినిపించు

శోకాతిశయమ్ము చేత
చురుకుబారి, జగజ్జేత
లాగలేక దొంగలాగ
వేదురుతో వేగ వేగ

క్రింద మీద అట్లయిట్ల
ఇంట బయట అన్ని తట్ల
విగత ప్రేమ కొరకు వాడు
విరతి లేక వెదకులాడు

– రాబర్ట్ గ్రేవ్స్‌కు అనువాదం –



# వివాదము

జనులారా. కధ విందుర
వినుడీ వినుడి; వసుంధర
అంతటికీ అతి సుందర
        మగు మంజుల శిల్పకళా విద్య

గ్రహియించిన ధీమంతుడు
తానేయనగం గంతుడు
తానేయనగ వసంతుడు
        జగడమ్మగు వారిర్వురి మధ్య
స్వర్లోకపు పరిపాలక
వర్గమ్మున అనుకూలక
మగు వానిని కనజాలక
        నిర్ణయింప తమ యిర్వురి నేర్పు

దిగివచ్చిరి మన మేదిని
శుభవంతమగు నుగాదిని,
సర్వకళా సంవేదిని
        కవిరాజును ఇవ్వమనిరి తీర్పు

"మీ యిర్వురిలో శాణిత
శుంబత్కళా ప్రవీణత
శిల్పశాస్త్ర పారీణత
        కని పిమ్మట, ఓ కంతు వసంత!

మీలో ప్రథమ స్థానము
నకు నర్హుని అనుమానము
రాకుండగ తీర్మానము
సల్పుదు" నని కవిరా జనినంత

వసంతు డిటులం బావన
సల్పును · నా సంజీవన
కళాశక్తిచే భూ వన
సంతతికిం గావింతును చక్క

కుసుమాలంకరణంబును,
వివాదాన విజయంబును
గడించి మదనుని డంబును
పాతాళపు పర్యంతము గుక్క"

తలచి, తక్షణమ భూతల
మం దామని తన సేతల
నందనమ్ము కన్నా, తల
మానికమ్ముగా రూపము దిద్దు

ఫాల్గుణంపు చలియంబుల
బాధపడ్డ భూజంబుల
అధర పల్లవపుటంబుల
ముద్రించుచు సుధల జిమ్ము ముద్దు

భువిలో నవ పరివర్తన
ప్రకృతీ రమణి సమర్తన -
లతా లాసికలు నర్తన
కావింతురు, కుందమ్మది నవ్వు
అరవిందము ఆ నందన
మున విప్పు కనుల, చందన
తరు రాజము మిగులన్ దన
గంధమ్మును నల్దిక్కుల రువ్వు

కనుడీయది. రక్తాంశుక
ధారిణియగు నా కింశుక
తరులన్ దనరారున్ శుక
ముల్ శోణమణుల పచ్చలబంగి

వికసించిన సుమ మండలి
చుట్టు, నందమగు కుండలి
ఝుమ్మంచు సలుపుచుం, డలి
సంఘమ్ములు పువుదేనియ గ్రమింగి

తినుచున్ మామిడి పూతను
తన కంఠంబున మూతను
విడదీసుక, "మధు దూతను
నే" న టంచు, తియ్యగా కడింది

ఆమ్రశాఖపయి కోయిల
పాడుచుండగా, ఈ యిల
రాగోద్వేగపు టూయెల
నూగుచున్నది వివశత్వ మంది

దక్షిణ దిక్కు కవాటము
మధువానతి బాహాటము
అయినందున, అవ్వాటము
గుండ, మలయ శిఖరాల చరించు

గంధ వాహములు రంపిలి
తూలన్ మదమున మంపిలి
ఆనందముచే కంపిలి
అటవీస్థలి మిగుల పుల్కరించు

ఇల నామని శిఖమండగ
ఇపుడు యవ్వనపు పండగ
పరిమళమ్ములు నిండగ
నిర్మలపున్ నిర్మేషపు మింట

చంద్రద్యుతి, అమరాపగ
కరుణ కాటకము బాపగ
గట్లు మించినటు దోపగ
అవనియంత ఆనందపు పంట.

సుందరమగు పని సోయగ
మును, వీక్షణముం జేయగ
విప్పినదీ విను, వేయిగ
        లక్షగ, తన బుక్షమ్ముల కళ్ళు

అంతట ధాత్రీమానిని
చూడనీక వినురేనిని
దాచినదీ తన మేనిని
        పచ్చనగా పచ్చిక కంబళ్ళు

కనినారా? – కనువిందగు
నందనముం, దల క్రిందగు
నటులన్ మార్చుటకుం దగు
        వసంతుని విచిత్ర చిత్ర సృష్టి

అందపు కుందనపుంగల
అది, అపూర్వమగు రంగుల
సమ్మేళిని, రసముంగల
        చేవపోని జీవకళా పుష్టి

అమృత సిక్తమగు కుంచిక
తో వ్రాసిన ప్రాపంచిక
చిత్రవర్ణమయ సంచిక ·
        ఉగాదికిం బ్రచురించు, వసంత

చిత్రకారు డతి నూతన
సద్రూపమిడి, పురాతన
మునకుం జీవన దాతన;
అతడే కళా ప్రపంచ నియంత

అతని అందవుం జిచ్చులు
పర్వ, కుసుంబా కుచ్చులు
రసిక చిత్తముల కుచ్చులు
విలసిల్లును ధరణీస్థలి నిండ

ఆ సోయగపుం జ్వాలిక
దుమికి, గిరిగిరికి కేలిక
సల్పు, రక్త మణిమాలిక
ధగద్ధగచ్చటుల జిమ్ముచుండ

మధుపాదాబ్జ రజోణువు
సోకినంత, ప్రతి రేణువు
మూగన్ విడి, సుఖవేణువు
వాయింపుచునుంది సర్వధాత్రి

పట్టివకుళ కరవల్లిక
పన్ని పరిమళపు టల్లిక
నవ్వుచుంది నవమల్లిక
మోహన స్వరాల రజత రాత్రి

మధుర మధురముగ సంపెగ
కుసుమంబది తన సొంపెగ
జిమ్మె నల్దిశల నింపెగ
అపరంజికి తావి అబ్బినట్టు
కమ్మగాడ్పులన్ పావన
ముం జేయగ ధర, వీవన
లటుల కదలు, కదలీవన
మహ, జ్యోత్స్నానిశిలో కనబట్టు

శేపాలికయును, మాలతి
శిరీషమ్ము, లవలీ లతి
కల్, కురవక, తిలకా లతి
మనోజ్ఞ సుమములతో విలసిల్లు

కరవీరాశోకంబులు
కన్పించును, భూజంబులు
మరియు కల వనేకంబులు,
జగమంతయు జగాహరువుటిల్లు

శిల్ప శాస్త్రమున నేరుపు
చిత్ర రచనలో కూరుపు
సృష్టికర్తకును నేరుపు
వసంతుడు ఘటించినట్టి మార్పు

దానింగన ఆ దాతకు
వాని తాత ముత్తాతకు
సిగ్గువల్ల తమ చేతకు -
కలుగు మిగుల నిస్పృహ నిట్టూర్పు

భువన మోహనపుటాముని
ఈనాడగును చలామణి
దాని గూర్చి నే నేమని
వర్ణింతును నాకు లేదు ప్రజ్ఞ;

రమణీయంబును రంగవు
చిత్తరువు కవి పుంగవు
డుంగని, తాకడు డంగవు,
ఆహా. మధు శిల్పి కళోపజ్ఞ.
కానీ మరు డవహేలగ
ఇటు పల్కెను - "ఇల చాలగ
అబ్బురపడ, అవలీలగ
యవ్వనంపు సాహాయ్యమువల్ల

ప్రకృతి అందమున కన్నను
రచియింతు నిపుడు మిన్నను
శిల్పగరిమలోనన్, నను
వసంతుడు జయించుమాట కల్ల'

"కేంద్రింపం బడకుండగ
విచ్చలవిడిగా, దండగ
బాష్పట్టుల, మహి నిండగ
గల, ఆమని క్లుప్తమ్ముగునట్లు

కుంచింతును, కళకుం దరి
యగు, లోకోత్తర సుందరి
లాగా, కను వారందరి
కనులన్ కనలిస్తూ మిరుమిట్లు"

అని కంతుడు నిర్మించును
- తను తానే తగమించును -
తన విల్లగు ఆ యించును
తన పూయమ్ముల తేనియ గల్పి

ఇంద్రజాలపున్ లీలను
అతి సుందరమగు బాలను
పదునారేడుల గోలను
అతడే అత్యుత్తముడగు శిల్పి

సఖియందము ఏమందును
కన్నులకున్ కడు విందును
సమకూర్చుచు సుధ జిందును
అహెూ, యవ్వనకళా విస్ఫూర్తి.

ఉజ్వలమగు కవి యోచన
కనని ప్రబను తన లోచన
యుగళమ్ము సలుపు సూచన
వర్ణింపగరాదు రమణిమూర్తి

ధరణీస్థలి తన డాకను
చూపించి, జయపతాకను
ప్రతిష్టింపగా, వీకను
సుమబాణుడు వేసిన పూ ముల్కి

తాబట్టిన వక్షస్సుల
సుఖవంతపు శోచిస్సుల
కనలించి యువ మనస్సుల
బంధించు సుధా బంధము కల్కి

ఈ కాంత జగన్మోహిని
లావణ్యసుధా వాహిని
ప్రపంచ ప్రణయ కాహిని
కడు రూపసి, మన్మధ మదమత్త

శ్రీ గంధమునకు గంధము
కల్పినట్లు, అరవిందము
నకు రంగుల నిడుచందము
వరవర్ణిని వర్ణించుట రిత్త

తన ప్రభ చూపందల్చిన
పంచ సాయకుడు మల్చిన
విగ్రహంబనగ నిల్చిన
ఈ విశ్వమనోహారిణి గంచు

సంతోష మతిశయిల్లగ
అనురాగము రాగిల్లగ
హృదిని, జగతి రంజిల్లగ
కవిరాయలు తానిట్లు స్తుతించు

'నీదు శరీరత నున్నన
శత వసంతముల క్రొన్నన
గమిచేత నను గున్నన
పడసినదా, అను మాదిరి కద్దు

పట్టువడన్ నీ చేతుల
నే చేరగల నహోహా తుల
లేనట్టి నరాతీతుల
ఆనందపు టంతిమ సరిహద్దు "

"నీ చూడ్కులు మరు నంపలు
నీ దేహపు కదలింపులు
విదలించును గద శంపలు
ఓ మోహన లావణ్యపు కంధి

నీ సుందరమగు నవ్వులు
మ్రోయించు పసిడి మువ్వలు
రువ్వు నల్గడల పువ్వులు
ఓ రమ్యమనోజ్ఞ పుష్పగంధి. '

"కిల కిల కోకిల కూజన
నీ కంఠమున సుధాజన
కమ్మగ, భువి నానా జన
జనతాహ్లాదినిగా వినదిల్లు

విని నంతట నీ పాటల
మాధుర్యము, నా బీటలు
వారియున్న హృది బాటల
వర్షించును పన్నీరపు జల్లు

"నీ గారడి ఘనముంగన
కురవకము త్వదాలింగన
మున తిలకము నీవుంగన,
అశోకమ్ము నీ తన్నుల వల్ల

మా కందము నీ చక్కిలి
గిలిచే వకుళము పుక్కిలి
మద్యమ్ము వలన మిక్కిలి
పుష్పించును జగతి సంతసిల్లి"

"నవ యవ్వన సుఖపావక
దహింతులకున్ సంజీవ క
రణి మందు కరణి, తావక

నయన ద్వంద్వపు టందపు నిగ్గు

నందు నంద నవనీరము
విలసిల్లను, కని నీ రమ
ణీయ మూర్తి సింగారము
తల వాంచును పడికడింది సిగ్గు "
' సోకినంత నీ చంచల
వీక్షణలు మరుత్ సంచల
నోద్ధూతంబగు నంచల
మటులం గడు చలియించుట బుద్ధి.

వర్జింతురు నీ స్ఫూర్జిత
చరణమ్ముల కడ నూర్జిత
మును లేని తమ చిరార్జిత
సహస్ర జన్మ తప ఫలసిద్ధి"

"ఓ కోమలి కయికో, నతి
మకరధ్వజ విభు నానతి
వలన, జవ్వనము తా నతి
వేగము, నీ వపువందయి వ్యాప్తి

నూనియనుం దిని జ్వాలిక
జాజ్వల్యంబగు పోలిక
సానబట్ట మణి మాలిక
కనలునట్లు, విరజిమ్మును దీప్తి "

నీ సుందరమగు నవ్వులు
మ్రోయించు పసిడి మువ్వలు
రువ్వ నల్గడల పువ్వులు
ఓ రమ్యమనోజ్ఞ పుష్పగంధి '

"కిల కిల కోకిల కూజన
నీ కంఠమున సుధాజన
కమ్మగ, భువి నానా జన
జనతాహ్లాదినిగా నినదిల్ల

విని నంతట నీ పాటల
మాధుర్యము నా బీటలు
వారియున్న హృది బాటల
వర్షించును పన్నీరపు జల్లు

నీ గారడి ఘనమంగన
కురవకము త్వదాలింగన
మున తిలకము నీవుంగన,
అశోకమ్మె నీ తన్నుల వల్ల

మా కందము నీ చక్కెలి
గిలిచే వకుళము పుక్కిలి
మద్యమ్మె వలన మిక్కిలి
పుష్పించును జగతి సంతసిల్ల '

నవ యవ్వన సుఖపావక
దహింతులకున్ సంజీవ క
రణి మందు కరణి తావక

నయన ద్వంద్వపు టందపు నిగ్గు

నందు నంద నవనీరము
విలసిల్లను కని నీ రమ
ణీయ మూర్తి సింగారము
తల వాంచును పడికడింది సిగ్గు'
సోకినంత నీ చంచల
వీక్షణలు మరుత్ సంచల
నోద్ధూతంబగు నంచల
మటులం గడు చలియించుట బుద్ధి

వర్జింతురు నీ స్ఫూర్జిత
చరణమ్ములకడ నూర్జిత
మును లేని తమ చిరార్జిత
సహస్ర జన్మ తప పలసిద్ధి"

'ఓ కోమలి కయికో నతి
మకరధ్వజ విభు నానతి
వలన జవ్వనము తా నతి
వేగము, నీ వపువందయి వ్యాప్తి

నూనియనుం దిని జ్వాలిక
జాజ్వల్యంబగు పోలిక
సానబట్ట మణి మాలిక
కనలునట్లు విరజిమ్మును దీప్తి

"ఓ కంబు సదృశ కంధర
అక్కడక్కడ వసుంధర
లోనంగల అతి సుందర
వస్తువులం బ్రోవు జేసికూర్చి

తన మాంత్రిక నిబ మీరగ
చూపరుకున్ కళ్ళారగ
వాటితోడ రుచులూరగ
యవ్వనమ్ము నిను దిద్దును తీర్చి."

"అందంబున జిత రంబవు
శిల్పశోబ సారంబవు
జగమంత పులకితంబవు
నీయందము వీక్షించుటబట్టి

నీ వీక్షణములు తాగక
దుముకు చంద్రికలు వాగక;
నీదు పాదములు సోకగ
హల్లకముల హసియించును మట్టి"

"సల్పు సర్వజగమర్చన
నిను, ఆత్మ శిఖకు చర్చన
నీదు సోయగము బర్బన
కావింతువు, అచ్చర జవరాళ్ళ

నీదు కాలి చిరుగోటికి
ప్రకృతి కాంత, ఎనాటికి
సరిరాదుగద; ఇదేటికి?
        నిను నుతింపజాల వేయినోళ్ళ"

"కలతో సుధతో వాసన
తో గానముతో నేసిన
తరహాగ, నినుంజేసిన
        స్మరుని శిల్ప నిర్మాణపు శక్తి

ఆశ్చర్యకరము; పంతము
లో, వాని కృతి వసంతము
కన్నన్ ప్రతిబావంతము
        నుతియింపగ నసమర్థ మదుక్తి"

కవిరాజిటులం బల్కిన
పల్కులు, సుకముం జిల్కిన
కతన, కంతుడా కల్కిన
        కవిరాజున కుపహారము నిచ్చు

అతి ముగ్ధుండయి కామిని
విబవంబును గని, ఆమని
విబుడే కడుగా, కాముని
        అసమాన కళా కల్పన మెచ్చు

ఆ నవలా తల మానిక
ముం గూడు కవికి కానిక
వసంతుడిచ్చును తానిక
అతనిచే రచింపబడ్డ సృష్టి

అభినవ దివ మనిపింపగ
వారిర్వురు విహరింపగ
ననుకూలముగా నింపగ
ఉబయ మానసములం బరితుష్టి

కరవీరములన్ పాటల
మగునట్టి పువుల దోటల
పుత్తురు నాటల పాటల
తను కాలము తను బాగ్యము పండి

కవియున్ సఖి, సుఖక్రీడల
సల్పుదురు పొగడ వాడల
సహకార తరుల నీడల
నిండిపోవ తమ హర్షపు గిండి

రాజహంసముల పోలిక
నూగుచు జలరుహ డోలిక
జ్యోత్స్న సరసుల, కేలిక
సల్పుచుందురు మనోహర బంగి

తమ   పరస్పర గళంబుల
బంధించి, మృణాళంబుల
విడంబించు హస్తంబుల
కవిరాజును అతని తన్వంగి

కోకిల్ల మధుర సోముల
రుతముల్ వినబడు శ్యామల
సుందరంబులగు సీమల
వికసించిన రోజా గుబురింట

మలయానిలమును గ్రోలుచు
మధుమత్తుల విధి సోలుచు
శచీ వాసవుల బోలుచు
విహరింతురు వారిర్వురు జంట

వికసిత విచికిల వల్లిక
నవ్వుచున్న నవమల్లిక
అరవింద సుమమతల్లిక
విరజిమ్ము సుగంధమ్ముల విందు

చవి జూచుచు, తా నామని
పట్టి నట్టి వనభూమిని
కవీంద్రుండు తన కామిని
తో కూడి మహానందము నందు

జనులారా. గ్రహియింపగ

వలయుదీని; హృదినింపగ
నానందము, కడునింపుగ
కాంతామణి ప్రక్కన లేకున్న

ఈ సృష్టికి లేదర్ధము
ఈ జన్మకు లేదర్ధము
భువిని వసంతము వ్యర్ధము
ప్రకృతియుండు ప్రయోజనము సున్న.



# కయిత నా దయిత

కయిత
నా దయిత;
మన్మనోహారిణి
బావాంబర విహారిణి,
నా బ్రతుకు మబ్బులో విద్యుల్లత,
నా మోడు జీవితములో ప్రపుల్లత
నా రక్తమున తీవ్రత
జీవన దేవత
నా రాణి
వాణి

నా కర్ణముల విశ్వగోపన
రహస్య గీతాల నాలాపన
సలుపునట్టి అమృత భాషిణి,
అంతరంగ నవోద్దీపిత
రక్త కామనా నిరూపిత
రమణీయ విచిత్ర వేషిణి
మర్త్యలోక స్వప్నరాజిత
రత్నఖచిత రథపు ప్రాజిత,
స్వర్గమునకు మార్గదర్శిని
కవిత్వ ప్రతీప దర్శినిః

నీకు నీ రూపము చరాచర
వస్తువుల నంతట గోచర
మగు చుండుట కనుల పండువ;
చంచల వననిధి యురంబున
సస్యజగతి నత శిరంబున
అలరుచున్నది నీ కండువ;
కన్పించును కానన వాటిక
పరువబడిన నీ సుమ శాటిక;
అకుంఠిత పరిపూర్ణ రూపసి.
ఓ నాదు కవితా ప్రేయసి.

నా యదృష్టపున్ మహత్తున
ఈ సుందరమగు జగత్తున
నీ కంఠరవమ్ము విందును
నిశ్శబ్ద శరత్ నిశీధిని
హర్ష పులకిత హృదివీధిని
శ్రావణ జలదంబు లందును
నవ సుమముల నవుల సంతల
పారుటాకుల వలవంతల
– కూర్పగ వీనులకు విందును
నీ కంఠరవమ్ము విందును

కాంచినాడను నీ నవ్వుల
జల్లు కురియుట, దవు దవ్వుల,
నీ రూపు విభ్రమ రేఖల
కనజాలుదు పువ్వు గుత్తుల
కనక కాంతుల, విద్యుత్తుల

ఇక్షువుల సుధా మయూఖల;
నీ కన్నుల తళుకు, మింటిని
కోబిల్లుచునుంట కంటిని,
సుస్వప్నపుటితా కారిణి
ఓ నాసఖి. బవతారిణి.

వివశంబయి పోవగా యిల
కుహూ యంచు కూయు కోయిల
వినిపించును బవత్ కీర్తిని
పూర్ణిమా మనోజ్ఞ యామిని
యవ్వన మదమత్త కామిని
బింబించును బవన్మూర్తిని;
రాగవంతమగు నుషస్సుల
యువక చిత్తములన్ వ్యక్తము
నీ సుధా ధరంపు రక్తము

దిగ్దిగంతములం జూడ్కొని
ప్రసరించి చంద్రికల మూడ్కొని
జగత్తున గల ప్రతి వస్తువు
నుం దాచుకు వింత యందము
నిత్యనూతనమగు చందము
అక్షరమ్ముగ నువ్విస్తువు.
– ధరణి, నీ యమృతపు స్పర్శన
సలుప చిత్రముల ప్రదర్శన;–
అద్భుతమగు ఐంద్రజాలిక
ఓ నా కవనంపు బాలిక.

పలు రూపముల ప్రత్యక్షము
నీ రూపము నా సమక్షము –
ఓసి చంచల సంచారిణి!
ఓ మామక మన చుంబిని.
గ్రీష్మకాలపు కాదంబిని
లాగ వివిధ రూపధారిణి.
కానీ, క్షణముండి ముంగల
మాయమ్మగు, కనకపుం గల
లాగా బవదీయ రూపము
హా! నాకు దురంత తాపము

నీ విట్టుల విడచిపోవగ
అతి దుర్భరమగును నా వగ;
చీకట్లల నవతరించును,
రస హీనమయిన వసుంధర
చీకాకయి మిగుల గందర
గోళంబుగ గోచరించును;
నీవుం గనబడనియప్పుడు
చిటుకుమన్న చిన్ని చప్పుడు
నా గుండియనుం గలంచును
అంత శోకము ద్విగుణించును

రమ్మి, రమ్మి వడిగ ధారుణి
నీ యధరపు మధుర వారుణి
నా వ్యధల పరిష్కరింపుము!

నీ యురమ్ము నా యురమ్మున
కానించి నీ యంతరమ్మున
గల రహస్యముల వచింపుము
బంధింపు, నను పరిరంబణ
మందు, ఎలనిక విలంబన?
పిలువుము నను సఖీ. తీయని
కంఠమ్మున ప్రియతమా యని

నా భాగ్య గగనములో శశి,
అపురూప అరూప ప్రేయసి.
నీ చూడ్కులతోడ తోరణ
కట్టుము భువి, నీదు లాస్యము
చేత నా విషాద దాస్యము
నింక సల్పుమ పరిహారణ
రమ్ము, రమ్ము ధరకు, శాంతిని
ఇమ్ము  విమల కరుణ కాంతిని
విరజిమ్ముము  జగతి సర్వము
నుం జేయుము నయన పర్వము

రమ్ము రమ్ము రమ్ము భూమిని
వేచియుంటిని, రయ గామిని.
విరహానల దగ్ధ చిత్తుడ
హత బాగ్యుడ, నీదు చేరిక
నిచ్చలుండ నిప్పుకోరిక
వలన, నే కడు నున్మత్తుడ

వినుపింపగ నీదు కోయిల
సుస్వనంబుల, రమ్మి, యిల
ఓ మనస్వనీ అనిందిత
రూపిణీ జగద్వందిత.

నా బాధల నుపశమింపగ
నా చిత్తమున సుధ నింపగ
చుంబింపుము నాదు మోవిని
ఏకాకిగ వసుధనుంటకు
దుస్సహ విరహంపు మంటకు
భీతిల్లిన కరుణజీవిని
నీదు హస్తము నిటు నా కయి
యందు నుంపుము సఖీ నీకయి
సలుపుచున్నవాడ తీక్షణ
బావమ్మున నే నిరీక్షణ

నీవు రావు వేచియుండిన
కనుక; పువు తావులు నిండిన
పున్నమ నిశలందు; చిక్కని
రసాల కిసాల నికుంజము
లందు సరసిజ దళ పుంజము
లందు, సరసులందు, చక్కని
తీరములందు, భూమ్యాకాశము
లందు సుందరి నీ కోసము
అనంతముగ నా పరిశోధన

అది జన్మ జన్మాల సాధన

కవితయగును దివ్యమోహిని
ఏనాటికి కాదు గేహిని
నిత్యమ్ము దాగుడు మూతల
నాడును మాదు ప్రణయంబులు
విరహమున పునర్మిలనంబులు
మధురతరం బగును భూతల
రంగమందున సౌదామిని
కరణి రగులు కవన బామిని
కవుగిలి, అనంత పరిశోధన
అది జన్మ జన్మాల సాధన

వాణి
నా రాణి
ప్రణయ శాలిని
బావనా రాజ్యపాలిని
మనోజ్ఞ చిరయవ్వన విలాసిని
నేను ప్రేమించు నందన వనీ వాసిని
నా జీవతమునకుందరి
అరూప సుందరి
నా దయిత
కయిత



# పునర్జన్మ

ఇదో
ప్రణయసాగర తీరమున
నవ దంపతులం
మనం

ఇదే
ముసుగులేని మోహనమగు
పునర్వివాహ శుభ
క్షణం.

సఖీ.
అహంకార అసత్యాల
నీడ, విడిపోవు
నిక;

మహో
ప్రభవమ్మున ప్రజ్వలించు
అపరూప దివ్య
శిఖ

పరస్
పర ప్రేమ ప్రభావమున
అవనియంత అమృత
మయం

సఖీ!
పునర్జన్మ పొందినట్టి
మన్మధునికి, జయం
జయం



## కవాలి

నేను వచిస్తాను, వినూ
గీతలోని సారమునూ.
మనకు చాల మజా, సదా
ఈత చెట్టు గీత గదా

నేర్చుకొనండీ కిటుకూ
చిటుకలోన మాన్పుటకూ
మత కుల బేదముల సహా
మధువు మహా మంత్రమహా

శ్రుతుల వినుచు బ్రతుకు క్షుధా
వ్యధలమాన్ప శ్రమలు వృధా,
మనకు సదా మహా సరదా
మదిర సుధా పాత్ర గదా.



# విరహము

బవదానన వారి రుహము
మూయగ, విధి విష్రగహము
విపరీత మహ. అహరహము
నా నిష్ఠురత విరహము

నిన్నుగాంచ నందు వలన
నా తలంపులు కుసుములన
గ్రుచ్చు నిచ్చ; స్వప్న చలన
చిత్ర తారవీవు, లలన

నా మంచమునందు కోటి
సూటి కంటకముల నాటి
నా కంచము కంటి నీటి
తోటి నింపినావు బోటి.

నా యందలి నరనరాల
రగిలించి విరాళిజ్వాల
నర్తింతువు త్రిభువనాల
ఓసి చక్కని జవరాల!



# కోట

రేపు మాపు లేని చోట
వాడిపోని పువులతోట
కలదు, దానిలోన నేను
కట్టినాను వలపుకోట.

రవులతోడ శశులతోడ
రంజితమ్ము నాదు మేడ,
పడదు దానియందు పడదు
ఇంత కూడ ఇరుల నీడ
కింశుకారుణ వనవీధి
మారుమ్రోగును కలగీతి;
నిలిచియుంది చిర వసంత
మచట బంధపడ్డ రీతి.

జగతినంత తనకుజోడు
కలుగనట్టి వలపు మాడు
వలలలేని యాత్మగల్గి
కలలలేని కనుల జూడు

రమ్ము సకియ. రాణిలాగ
మూతపడని కనుల సోగ
చూపుతోడ చూస్తు నేను
వేచియుంటి రమ్ము, వేగ!

వచ్చి నాదు కంటి నీట
తడుచుచున్న జడుకునోట
ముద్దు లిడుము, ముజ్జగాల
హద్దుల నాయాత్మదాట



## అశాంతి

నా చిత్తము నాపజాల
సఖియా అది క్షుభిత కంధి
తరంగాల తురంగాల
పయినస్వారి సలుపుచుంది

బరతావని నదుల అప్పు
లన్ని ఆర్పజాలకుండు
నిను గూర్చిన తలపు నిప్పు
నాలో సతతమ్ము మండు

నీ యధరామృతము పీల్చి
వచ్చినట్టి పిచ్చివల్ల
నాళమ్ముల కాల్చి చీల్చి
వర్తింపుచునుంది నల్ల

విడిపోయిన దిపుడు నిద్ర
శబ్దించును సమర శంఖ
బావమ్ముల ప్రళయ రుద్ర
దుర్దాంత నితాంత రింఖ

చండికాంబ చరణలాక్ష
ఫణి పణాగ్రమణి ప్రదీప్తి
నటత్ శివుని నయనరూక్ష
నాప్రాణమునందు వ్యాప్తి

నా చిత్తము నాప సాధ్య
పడదు, కడలి జడల చుట్టు
ఝంఝు భయద రుద్ర వాద్య
ముఖరింపులు వినంబట్టు.



# ఉత్కంఠ

రగులుచుంది నింగి దవ్వు
మిలమిలమని ఉడుల శ్రేణి;
జడుస్తున్న నిప్పు పువ్వు
లాగు నిచట వ్యధితప్రాణి.

భూ దివాల మధ్య ధ్వాంత
పిశాచమ్ము జుట్టు విప్పు,
ఆరిపోవుచుంది స్వాంత
మందు అర్చనంపు నిప్పు

నిఖిల జగతి నిండి మేదు
రముగ, ఈ కుహూ తమస్సు
ఉన్నకూడ, ఉడిగిపోదు
ఇపుడు నాదు దృఢ మనస్సు

వచ్చునంచు నిటకు నీవు
ఉన్నవాడ నేను వేచి
వచ్చినచో వాడిపోవు
నిరులు, విరియు పసిడి రోచి



# నిరీక్షణ

నిమేషాల పిచ్చికేక
సమీపించనట్టి చోట
సఖీ. నీవు వచ్చుదాక
నిరీక్షిస్తు రాత్రిపూట
కార్చుచున్న కంటినీట
పోషింతును పూలతోట

వాడిపోవనట్టి మంచి
రకరకాల రంగుపూలు
శుభ ముహూర్తమున సుమించి
శూన్యాంబర మందు సోలు
నా మనాన సుధలు జాలు
వారునట్లు సలుపజాలు
వాటినిం గను సమయాల
ఎర్రరేకుల హిమముంట
తావకామృతాధరాల
పండునట్టి నగవు పంట
జ్ఞప్తివచ్చు, నంత మంట
కార్చిచ్చులు మండు కంట.

చిన్ని చిన్ని చిన్ని చెట్ల
వన్నె వన్నె వన్నె పూల

# ఉత్కంఠ

రగులుచుంది నింగి దవ్వు
మిలమిలమని ఉడుల శ్రేణి·
జడుస్తున్న నిప్పు పువ్వు
లాగు నిచట వ్యధితప్రాణి

భూ దివాల మధ్య ధ్వాంత
పిశాచమ్ము జుట్టు విప్పు
ఆరిపోవుచుంది స్వాంత
మందు అర్చనంపు నిప్పు

నిఖిల జగతి నిండి మేదు
రముగ, ఈ కుహూ తమస్సు
ఉన్నకూడ, ఉడిగిపోదు
ఇపుడు నాదు దృఢ మనస్సు

వచ్చునంచు నిటకు నీవు
ఉన్నవాడ నేను వేచి
వచ్చినచో వాడిపోవు
నిరులు, విరియు పసిడి రోచి



# నిరీక్షణ

నిమేషాల పిచ్చికేక
సమీపించనట్టి చోట
సఖీ  నీవు వచ్చుదాక
నిరీక్షిస్తు రాత్రిపూట
కార్చుచున్న కంటినీట
పోషింతును పూలతోట

వాడిపోవనట్టి మంచి
రకరకాల రంగుపూలు
శుభ ముహూర్తమున సుమించి
శూన్యాంబర మందు సోలు
నా మనాన సుధలు జాలు
వారునట్లు సలుపజాలు
వాటినిం గను సమయాల
ఎర్రరేకుల హిమముంట
తావకామృతాధరాల
పండునట్టి నగవు పంట
జ్ఞప్తివచ్చు, నంత మంట
కార్చిచ్చులు మండు కంట

చిన్ని చిన్ని చిన్ని చెట్ల
వన్నె వన్నె వన్నె పూల

ఎర్చి ఇంద్ర చాపనుట్ల
కట్టినాను నీకు మాల
కాని ఇచటికి, ప్రియురాల
నీవింకను, రా వదేల?

వాడిపోని పూలగ్రుచ్చి
కట్టినాడ నీకు దండ,
కనికరించి నీవు వచ్చి
స్వీకరింపు, చిత్త పుండ
రీకమ్మున సుధలు నిండ
రమ్మ, రమ్మ సఖియ; దండ



# ప్రేయసి

మూర్ఛిల్లుదు నీ సుందర
మూర్తింగన
నా కాళ మనస్కందర
మున, అంగన
సతము నాదు చిచ్ఛందన
ముం బ్రేయసి
కోయు నీదు చక్కందన
పున్ తీయసి·
కనకనోప నీ చూపిక
నో కామిని
పథ దర్శకమగు దీపిక
అది యామిని
నిష్ఠురమగు నీ అందము
జగ రూపసి
పట్టు నాగఫణి చందము
నాలో పసి;
నాదు మానస పయోనిధి
లో, జవ్వని
వీచు, నిన్ గన, తుపానది
కడు రివ్వని -
పంపినావు నా జీవన
మున, మోహిని.

ఏర్చి ఇంద్ర చాపముట్ల
కట్టినాను నీకు మాల
కాని, ఇచటికి, ప్రియురాల
నీవింకను, రా వదేల?

వాడిపోని పూలగ్రుచ్చి
కట్టినాడ నీకు దండ,
కనికరించి నీవు వచ్చి
స్వీకరింపు, చిత్త ముండ
రీకమ్ముమ్మన సుధలు నిండ
రమ్ము, రమ్ము సఖియ; దండ



# ప్రేయసి

మూర్ఛిల్లెదు నీ సుందర
మూర్తింగన
నా కాళ మనస్కందర
మున, అంగన.
సతము నాదు చిచ్చందన
ముం, బ్రేయసి.
కోయు నీదు చక్కందన
పున్ తీయసి;
కనకనోప నీ చూపిక
నో కామిని
పథ దర్శకమగు దీపిక
అది యామిని
నిష్టురమగు నీ అందము
జగ రూపసి.
పట్టు నాగఫణి చందము
నాలో పసి;
నాదు మానస పయోనిధి
లో, జవ్వని
వీచు, నిన్ గన, తుపానది
కడు రివ్వని -
పంపినావు నా జీవన
మున, మోహిని!

నీ సుధా ప్రణయ పావన
తమ వాహిని,
నా మోవిని చుంబించిన
చంద్రానన
బావింతు ధర జయించిన
సులతానన.
ఆలింగన సల్పన్ నువు
ఓ నా సఖి.
సఫలించును నా జన్మ్యవు
ఆహా. నే సుఖి
నాదు మానసపు లోతున
సిత లోచన!
కనుపించు సదా నూతన
మధు సూచన.



# నినుగానక

కలికి. నిన్ను కనకయుంట
సుఖసంపద నున్న యింట
కన్నీరము కలదు కంట
నా గుండియలోన మంట

పడును నాకు పయిన మిన్ను
నాలో ప్రతి చుక్కయున్ను
నీ నామము నిచ్చ అన్న
ఉవిద. కనకయుంట నిన్ను

కనుపింపకనుంట నువ్వు
విరహాసురకాంత, రువ్వు
నలుదిక్కుల విషపు నవ్వు;
నా ప్రాణము జివ్వు జివ్వు

నా పాపము లన్ని పండి
కన్నీరముతోడ నిండి
పోవును వలపంత గిండి,
నిన్ను కనం జాలకుండి

కనకుండిన నిను సుగంధి
నాయందలి సంధి సంధి
సుగ్రూతల నూపుచుంది
విలయకాళ విరహకంధి

నాకు ప్రపంచమ్ము నల్ల
నా జీవితమంత గుల్ల
క్షుధలు దప్ప సుధలు కల్ల
నిన్ను గాంచనందు వల్ల



# రుదన ఋతువు

అసుర కామినీ. అపరూపపు టతివ.
ఏకాకిగ నన్నిట వదలి చనితివ?
మధుమాసము మామక చిత్తమునుంచి
విడిపోయిన దిప్పుడు చింతను నించి

కన్నీట కడగినాడ నీదు పదము
నా కన్నులలో నిరత బాాద్రపదము,
తుహినా చలమున మిహిరాంశుని లాగు
చలికాలము నా స్వాంతములో దాగు;

నాదు నిస్వసన పవనోష్ణతయందు
సల్పును వేసవి సలసలమని చిందు;
నా జన్యువులో నశియింపగ ప్రీతి
వాడిపోవునది మ్రోడుమాను రీతి

నీ తాకుడు కరువగు మదీయ వపువు
శోకక్రిమి తినుచున్న మల్లియ పువు;
కూయును కరుణస్వరమున, తన జతను
విడిపోయిన కోయిల నా హృది కతను

నీవు పోవగన్ శూన్యము దశదిశలు
స్మృతి కంటకముల చురుకు, అహర్నిశలు

నాశోక విభావరి విశ్వము నిండు
నాయశ్రుల లాగున తారలు మండు

నా వియోగ మానస రాగవు టీవి
నిరుపమానమగు నీదు మోవికావి;
నీల గగన నిబ్భృత మహ, నీ వదనము
నల్లగిల్లినది నాకు పచ్చదనము

గ్రీష్మ వర్ష హేమంతర్తువు లాడు
మరణ నటన, నాబ్రతుకు వల్లకాడు
మధుమాసము మామక చిత్తమునుంచి
విడిపోయిన దిప్పుడు చింతను నించి



# విరహాంబుధి

విరహాంబుధి విరుగు నావ
కరణినుంటి కనకం దరి;
మాయమ్మయి పోయినావ
ఓనాడు మనస్సుందరి

అల్లాడును నా మనస్సు
చిటుకుమన్న చిరు చప్పుడు
వినగ, భయానక తమస్సు
ఏమీ కనబడ దిప్పుడు.

నేను పవల్ నిశలు విందు
మత్ ప్రవాసమరు నిర్జన
తమోమగ్న, తలంబందు
ఉరు విషాదగురు గర్జన

మాయంబయి ఏ దవీయ
తారాగ్రహముల వీధిని
చేరినావు; నీదు ఛాయ
కాంతు సదా కల రీతిని

వంశీ కలగానమందు
మధుమలయ పవన వీచిని
అవలోకన సలుపుచుందు
నీ అరూప తను రోచిని

జలదాన నటించు మించు
టంచులలో, రోజా కలి
రక్తిమలో, నినాదించు
త్వన్నీరవ గళ కాకలి

ప్రపంచమ్ము పల్లవిల్ల
ప్రతి వస్తువు ప్రతి రేణువు
లోన నీవు అల్లనల్ల
వాయింతువు నీ వేణువు

చల్లనయిన చందమామ
యందు జూతు నీ స్ఫూర్తిని
సకల చరాచరపు సీమ
వినుచుందు భవత్ కీర్తిని
చుంబించుచు జగతి స్వాంత
మందున్న మధుర వారుణి
అగుపింపని అమరకాంత
అటునీవు కలవు ధారుణి

జపములాగ సతము ఉట్టి
పడును నాదు బాధారుతి,
నా మండు మనస్సు పట్టి
నది కప్పురపున్ హారతి

నా నిష్ఠుర విరహజ్వాల
లోన ఇనుండును బూడిద;
నా అశ్రు ప్రవాళమాల
నీకు ప్రియంబగు సూడిద

అంధకార సింధు ఘోష
శూన్యరోదసీ క్రందన
ఝంఝూపద రుద్రబాష
ముఖరించును నాయందున

పథ విహీన ప్రపంచాన
నాయనంత పరిశోధన
వినిపింపద, వాయులీన
మగునాదు మనోవేదన?

విరహాంబుధి విరుగునావ
కరణినుంటిగద, నీవిక
కరుణించియు కదలిరావ
ఓనాదు ప్రణయ నావిక.



# వియోగము

మన యిర్వురి
నడి శర్వరి
పడు, నిప్పుడు, నారి.
మది కోరిక
ధ్రువతారక
దూరాభ్ర విహారి.

ఉన్మాదిని
విధి, మేదిని
చనుచున్నది గాలి;
ఏకాకిగ
నిట మూకిగ
పడు నాహృది సోలి

మృతి రాదుగ
స్మృతి పోదుగ
నా మానసమంటి;
నినుగానక
మదిలో, నక
నక లాడుచునుంటి

నువు పోవగ
ఇటు నా వగ
నూరి ఇర్ల భంగి

ఇల గ్రమ్మను
సకలమ్మను
కవుగలించు వంగి

నీ రూపును
కననోపను,
విరహ బయద రాత్రి;
ఇక వేకువ
కలదా? కువ
లయ సుందర నేత్రి.



## నా దానివి

నా దానివి నా స్వంతము
సఖియా నువ్విది సత్యము
ప్రాణమటున్ నా స్వాంతము
నందు వసింతువు నిత్యము

నీ సుందర కరమాలిక
లో తూగును నా దేహము
తంద్రగతిన్ జలవాహము
ఇంద్ర ధనుస్సున బోలిక

నీ యాననము నిరంతర
సమ్మోహన సంధాయిని
కంపిల్లును నా యంతర
కమలంబడి కడు హాయిని

నిర్మలమగు నీ కన్నులు
వేసంగి నిశల మిన్నులు;
అక్షి నభస్సంచారిణి
నాయాత్మ, మనోహారిణి

నా దానివి నా స్వంతము
సత్యముగా, నువు కామిని.

సురలోకపు సుఖవంతము
నా జీవిత మీ భూమిని

మధురంబగు నీ ముద్దులు
సుఖరాజ్యపు కడహద్దులు
కనుపించు మరో లోకము
లోనం గదలు పతాకము

నిత్యమ్మను ప్రత్యక్షము
నీ రూపము నాకోసము
తల వాలిచి త్వద్వక్షము
పయి విందును నీ శ్వాసము

నా జీవిత కల్లోలిని
లో సుందర సుఖదీవివి,
దివి నాకిచ్చిన ఈవివి
నువు, ప్రేమ విభవ పాలిని

నా దానివి నా స్వంతము
సఖియా! నువ్విది సత్యము
నీ యందము బాస్వంతము
నా చిత్తమునన్ నిత్యము



# నీవు

మన్మానస మతి శీతల
హిమవత్ సితసానువు
నా నీరవాశ్రుగాధల
విని, వచ్చితివా, నువు?

నాలోపల మధుజీవన
రహిత రుద్ర సీతువు
జాజ్వల్య ప్రణయ పావన
నయనమ్ముల జూతువు

నువ్వగ్ని లతాంతాలను
విదల్చు నా కాసువు;
ఊగాడు విధురడోలను
నా హస్తగతాసువు

నా ఈ బ్రతుకు నిరర్థక
వ్యర్థ వీత హేతువు
నీ వచ్చుట అభివర్ధక
మయిన క్రియా ధాతువు

హేమంత మరు సమాధిని
నిదురించు మదాయువు

నా జీవితపు టుగాదిని
నువ్వ మలయ వాయువు

మరల విరియు హసనమ్మున
శిధిలచిత్త దారువు
నా శోకపు వసనమ్మున
నీవుం జలతారువు

నా ముళ్ళ బ్రతుకు సందున
నగును, కుసుంబా పువు
నువు, కాంక్షిత మన మందున
కదలుచున్న తీపువు

నిన్ను గాంచగ, సుఖానికి
చకియించును చక్షువు
విరహ విషము తినువానికి
నీయాగమ మిక్షువు

చలి నిలుపును సితచ్ఛత్రము
నిట, ఇది హిమ సింధువు
విజనుండ, వినా మిత్రము
నాకు వినా బంధువు

ప్రణయమ్ముల మరువాటిక
పయినన్ తుహినాంశువు;

రమ్మ్మ, కట్టి సుమశాటిక
పాడుం బ్రతి పాంశువు

నిన్నున్ వలయము వేసుక
పట్టితిగద బాహువు;
విడిపోయిన దహ. నా సుఖ
శశినిం దిను రాహువు

సమయానికి సంకిళ్ళను
ముద్దులతో వేతువు
కట్టినావు కవుగిళ్ళను
ఆనందపు సేతువు

పున్నమియటు భువి నింపుచు
నీ నవ్వుల సీధువు
హా. నన్ను కవుగలింపుచు
నా ప్రేయసి వొదువు

అదరుదు నీ పద ఝంపల
విని, నే నాజానువు
విసరుచు నలుదిస శంపల
ఇటు వచ్చితివా, నువు?



# ప్రణయాభిషేకము

ప్రణయంబను మరకత మణి
నాదు లలాటమున దిద్ది
ప్రసాదించినావు, రమణి.
మహారాజ పదవి సిద్ధి

అల్పుడుగద అవనినంత
పాలించిన మహీజాని;
నీ చిత్తము నా యనంత
సామ్రాజ్యపు రాజధాని

విశ్వస్థలి యంతకూడ
ఛత్రంబయి కప్పు నన్ను
విశ్వస్థలి యంతచూడ
సకియ. నీదు చిన్ని కన్ను

తారకాగ్రహమ్ము లిందు
సూర్యవర్తులాలు, సతము
నాదు ప్రణయ మకుటమందు
ఉజ్వలముగ ప్రజ్వలితము

సిగ్గిల్లియు నల హిమాద్రి
నాచూడ్కికినిగని, అవనత;

నేను మహారాజు మాద్రి
    నడయాడుచు చనుదు, జనత

ఎనున్ నడయాడు దారి
    పరువమ్ములు పరువు దీయు
వందిమములు పలుకు శారి
    పూలు తలంబ్రాలు పోయు

మయూరములు నటనమాడు
    కిరణమ్ములు వలచి వ్రాలు
లక్ష కోకిలములు పాడు
    ఉర్వినంత ఉత్సవాలు

పలుపు దాస జనము నోజ
    పసిండినుక పాదసేవ
గడ్డిపూలు పాదపూజ
    ఎనున్ నడయాడు త్రోవ

క్రోధ కామములకు, భిక్ష
    పుట్టబోదు, బయాసత్య
దస్యులందరి కురిశిక్ష
    కంటకాల కాత్మహత్య

విడును క్లాంతి విడును భ్రాంతి
    నాట్యమాడును ప్రతిచోట

అమరకాంతి ప్రణయశాంతి
ఎనున్ నడయాడు బాట.

నేనన్న ధరన్ పరాకు!
బూ చక్రములోని శత్రు
రాజులంత వచ్చి నాకు
కానుకలను కప్పమిత్రు

జగతినంత జయించేటి
శక్తిశాలి, శివుని కంటు
కల్పించిన యట్టి మేటి
మరుడుకూడ నాకు బంటు

రాజ రాజ శిఖామణిని
జగజ్జేత నగుదు సుమ్ము!
నిర్మిస్తి నిఖిల ధరణిని
మదాస్థాన మంటపమ్ము

నా సబాస్థలమ్ములోన
సకల కవీశ్వరులు, ఇచ్చ
వచ్చినటుల, ప్రణయ గాన
ములను పాడుచుంద్రు నిచ్చ

కనుము. జనుల కనులు చెమర
కవితాసతి మనోహరును

రోమియో జూలియట్ అమర
కథ వచించు షేక్స్పియరును

వినుము అదో హరాత్ బాణ
హత హరిణము అరచు రీతి
శాపో విరహాగ్ని వీణ
సలుపుచున్న కరుణగీతి

అహో కాళిదాసు రూపు
అతని కవిత సభాసదుల
అవ్యక్త సుఖాబ్ధి నూపు
కట్టించును కనుల నదుల

భరతావని నోము పంట
వాల్మీకి కవి తన వ్రాత
వినుము. తాన చదువుచుంట
రామాయణ ప్రేమగాధ

అపుర. అది సుధావ్యధార్చి
ప్రకృతిలోని ప్రణయ కీర్తి
కోలాహలు గిరికగూర్చి
వర్ణించుట బట్టుమూర్తి

అదిగో విను అల్లసాని
పలుకుచున్న మృదుపదాల
వరూధినీ చిన్నదాని
నిభృత మనోరహస్యాల

పడబోదట పరుల చూడ్కి
నీ గుండియ నంతిపురము,
నా భాగ్యము పండుమాడ్కి
నను శయింప నిమ్ము చిరము

తపితావని పయిన మిన్ను
వాక వచ్చు పగిది, నీవు
ప్రణయ సుధలతోడ, నన్ను
అభిషేకము సలిపినావు

బాహు పంజరమ్ములోన
ప్రణయరాజ్య మహీజాని
పదవి నిచ్చినావు, చాన.
నువ్వు నాదు మహారాణి.



# భిక్షుకి

పుడమియంత పుష్యమాస
రాత్రి కాళిక
శీత మందణంగి యుంది
శవము పోలిక;

కట్టి చినిగినట్టి పాత
గుడ్డపేలిక
నడచుచుంది వడకుచున్న
బీద బాలిక

కను కనుమల కనలుచుంది
జఠర జ్వాలిక
నోరు విప్ప నుడువు రాదు
ఉత్తనాలిక
కదలుచుంది కుష్టురోగి
వ్రేలి పోలిక
కలరు బాగ్యవంతులపుడు
హంస తూలిక
తల్పముల శయించి, నిరసి
త ప్రణాళిక
విధము నుంది వ్యర్థజన్మ
బీద బాలిక

తుహిన మాలిక పయిన నుండి
పడినదపుడు ప్రకృతి బాష్ప
ధార పోలిక

నక్కపండ్ల నములబడ్డ
శవము చీలిక
పయిన పర్వు నుదయకాంతి
కనక జాలిక



## జాబిల్లి

అనవసరమగు అరసున్న,
గుఱ్ఱపు లాడాము, గిల్లి
వేస్న గోరులాగ, సన్న
గిల్లి యున్నది జాబిల్లి

ఆకసమున అచ్చుతప్పు,
తెల్లవారుజాము కొప్పు
వత్తి కొరవ, నింగి కొప్పు
లోని సన్నజాజి పువ్వు

పిడి లేని కొడవలి, ఒక్క
ఈక, కుక్కతోక, పగిలి
పోయిన చేగాజుముక్క,
చదలు జబ్బ చక్కిలిగిలి

క్రావడి, కాగితప్పడవ
బ్రాకట్టు, వలపలి గిలక,
చిన్ని కడవ, వెన్న కుడ వ,
నిసి శిరసు, నరసిన పిలక

వంగకాయ తొడిమ కొసరు,
ఎదో మండిపోయిన నుసి,
ఎదో ఎగిరిపోయ్ను ఉసురు
లాగ తోచుచున్నది శశి.



# నందన

పుట్టినదీ నందన
సంవత్సర మందున
నా అనుంగు నందన
నామమదీ నందన.

మెయి చాయలు కుందన
మట్టుల, చక్కందన
మందు మిన్న నందన;

సురులకిత్తు వందన
శతముల, నానందన
పరతు హితుల, చందన
తాంబూలములన్, దన
యాగమ మయినందున

అన్నింట దినందిన
వృద్ధి నందుచున్ దన
రారుత నా నందన;
ధారుణి, సంక్రందన
పట్టణంపు నందన
వనమూడి పడిందన,
నేనుం దలతున్ దన
యాగమ మయినందున

పుట్టినదీ నందన
సంవత్సర మందున,
నా అనుంగు నందన
నామమదీ నందన



# ఉమర్‌ఖయ్యాం రుబాయితీలు

క్షణభంగురము జీవితము· నోటికి
అందిమ్ము చషకమ్ము సఖీ ఎటికి
చనిపోయిన నిన్నను రాని రేపుం
దలంపన్ సుఖవంతుడవే న్నేటికి?

రేపుందు ననేమిటి? బావి భీతిని
గత వ్యసనమున్ లేకుండు రీతిని
ఈనాటిని పరిష్కరింపన్ సారా
యి నిమ్ము ప్రియసాకీ. కడుం బ్రీతిని

మధుపాత్ర రసాంకితమగు కావ్యము
ల తోడన్ మధుమాస వనిన్ శ్రావ్యము
గ పాడుచు సమీపమున నీవున్నన్
అది నాకు నాకమ్ము విధిం భావ్యము

మది కోరకుమీ సులతాన్ తతంగము,
మరి కోరకు రంబా పరిష్వంగము;
– వర్జింపుము తతిమ్మా, చేడబ్బున్నన్ –
విను, మ్రోగు సుదూరమున మృదంగము.

పవల్ నిసిగవకుల్ గల బిడారము
జగం బిది విశీర్ణమగు గుడారము·
క్షణముండి తనదారి చనున్ సుల్తా
ను పిమ్మట సుల్తా నదే(ప్రకారము

సులతాను సింహాసన మందుండును
జలదారు సంబాని సంసన్నుండును
అవేల? మది రాక్షి మదిరం బియ్యం
గ నాబాగ్యమప్పు డహహా. పండును

హేమంతపు టార్తి వసనం బామని
చిచ్చందున వేసి, మదిరా బాముని
రదచ్ఛదముల ముద్దిడుమీ, జీవ
మ్ము విహంగము బంగిని రయగామిని.

జగమ్మున నీవుం(బతికే దానికి
హరి(ప్రియ. కడుం (దాగుచున్, మేనికి
మజాను కలుగజేయుము శీ(ఘ్రమ్మే
దిగి పోదువు భూమ్యుదరము లోనికి

అట జేరినచో నరులకు లేదిక
మనోహర రుచిరారుణ మహాధిక
సుఖ(ప్రద నఖం పచ సముద్వాస్వా
దన బాగ్యము; మరేమియును లేదిక

ఇల మానవ జన్మంబు వాతూలము
లో దివ్వియ రీతిని కడున్ లోలము
సుఖవంతముగా గడుపుమీ, ఆవే
శముతో మదిర త్రాగుచు నీ కాలము.

ద్వితీయ సతిగా వరుణ కుమారిక
కరగ్రహణమున్ సేసి సాంసారిక
సుఖముల్గనితిన్, విడిచినేన్, గొడ్రా
లగు నాకు వివేకాధ్యాడ చేరిక

కమనీయముగ కూడుక నవోడల
మధుమాస మహీరుహముల నీడల
విహరించుచు పుష్పముల రీతిన్ మీ
రున్ సల్పుడి యవ్వన మధుక్రీడల.

అసహ్యమయిన పండితుల వాగుడు
వినవద్దు, ననుగూడి సుర ద్రాగుడు
క్షణికా లగు మీ బ్రతుకులన్ వ్యర్థ
మ్ము సేక, సుఖ సాగరమున నూగుడు

సఖి పాటలు పాడ వినుచు, మత్తుగ
మద్యంబును ద్రావుచు, ననామత్తుగ
సుఖడోలికలందు బ్రతికే మూన్నా
డులన్ గడుపుడీ మీరు గమ్మత్తుగ.



సుషమావర పరిస్రుత కయి ఆత్రము
పడుచుంటిని చాలగ; క్షణమాత్రము
మదీయా ధర్మములకున్, సాకీ చం
ద్ర ముఖీ. వహింపుము మధుపాత్రము

కాదంబరి నిచ్చి, సఖీ కేదారిక
తివాసీల శమింపుము నాకోరిక
వికస్వర సుమముల్ మరలం బుష్పిం
పవు, చచ్చినవారు తిరిగి రారిక

మతానికి మతానికి నడి ధారుణి
గత వేయి వివాదము లనివారిణి
ముహూర్తమున జీవిత విస్రమమ్మున్
కనకించు రసక్రియ గద వారుణి

మదీయ శరీరంబదీ ప్రాణమ్మను
విడువన్, పయిబోయిడి మదిరమ్మను
ద్రాక్షచ్ఛద వేల్లితగా పూదోటన్
సమాధిని జేయండి మచ్ఛవమ్మున్

సమాధిత మదస్థికల సుగంధము
విరజిమ్మ అరూప సరళ బంధము
అటుబోవు పధికాళిని పోనీకుం
డ, మార్చుత మధు తాపసుల చందము

– త మా మ్ మ ద్ –

# నీకోసం!

తారా రహితంపు మింటి
వంకగంచు, నిలచియుంటి
ఏకాకిగ నిటుల - అవని
వనితా నువు వచ్చెదువని

నిలబడినది అలసిన గతి,
అనిలం బది అఖిల జగతి,
ధ్యానమగ్న యోగి బంగి
కనులమూసి కలదు నింగి

ప్రకృతి చిత్రపటంబట్టు
కదలకుండ కనంబట్టు,
కాని అస్మదంతరంగ
మది జ్వలించు విస్ఫులింగ

మట్లు; అంత నాదు బ్రతుకు
అవసాన వసంత ఋతువు
నాడి సిరయను విధమున
స్పందించును సరభసమున

నా చుట్టు తమస్సు మేదు
రముగ ముట్టడించు; నీదు
రాక సదా నిరీక్షించు
నా కోరిక మటుకు, మించు

మాడ్కి మానసాంబర తల
మందు రవుల తళ తళ తళ -
నీకోసము, నా ప్రియ వర
వర్ణిని. సమయంపు చివర

వే చేతుల సాచి, వేచి
యుంటి, వేయి కళ్ళ కాచి
యుంటి, హృదిని మధువు వంటి
ప్రణయమ్మును దాచి యుంటి

నా జన్మవు ముగియకమును
నా స్వాంత సుధారసమును
గ్రోలుము సఖి కుతుకునిండ
బ్రతుకుజాల, రమ్ము దండ.

నీ రూప లసత్ కలాపి
పురి విప్పిన సిరిని జూపి
తీర్పుము నా కమల కరువు
మాన్పుము నా మనసు బరువు

కానరాదు నీదు స్వీత
మూర్తి, నాదు నుదుటి వ్రాత
కాని, ఏమి బాగ్యమిద్ది?
ప్రణయరాజ్య బావసిద్ధి.

స్మృతి మురళీ స్వనము విధిని
నాదు మానసపు టవధిని
వినంబడును నీ సుదూర
పాద ద్వని వీనులార

ఈ కాళ తమోంతరాళ
మందు అర్ధరాత్రి వేళ,
రోద కుహరమ్మునందు
త్వన్నీరవ వంశి విందు -

కాని, నాకు గోచరింప
కుంట నీదుమూర్తి, అంప
మట్టుల, విరహమ్ము నన్ను
కోయుచుండ, కోరి నిన్ను

చిరము, నిరంతరము నీడ
యువతి, వేచియున్నవాడ
అరచేతిని పట్టి అసువు·
నీ మబ్బుల నీలి ముసువు

విడనాడుము. నీదు రాక
వల్ల మదుల్లమున, కీక
చీకట్ల బయాలు, పంచ
బంగాళంబయి నశించ

విడిపోవగ జడ హిమాని
మంజుల కుసుమాలు పూని
మధుమాసము వచ్చు కరణి
తరుణీమణి. రమ్మ ధరణి

నాలోన సుఖమ్ము కూర్వ
తిమిరాలు నశించి, పూర్వ
రక్తరోచి తోచు, ధాత్రి
రమ్మ మహానంద రాత్రి.

రా రమ్మ లతాంగి. రమ్మ
నను జేర్చుము నీ యురమ్మ



# పఠాభి పన్చాన్గమ్

1980



## FOREWORD

Puns to be interesting should be short and swift Sanskrit and Telugu literatures have elaborately worked out entire Slesha Kavyams They may be of interest to Pundits but generally they are unreadable and boring and serve no useful purpose

Puns come into their own in చాటు పద్యములు and in the repartees of wit and wisdom Here the double meaning word is used to generate a concealed idea, which has a greater impact because it is subversive and subliminal Puns should not be mere play of ideas, sometimes even contrary ideas Thus puns are essentially irreverent, finding the weak spots in obvious truths and are oblique comments on the state of affairs of present day society

I have always liked using puns It is like having a hidden weapon under your sleeve It is very effective But the hurt is smoothed over by the humour it generates It serves a useful purpose in making society laugh at itself Hence pun instead of being termed as the lowest form of humour, should be considered of the highest order

Most of the puns in Panchangam have spontaneously welled up inside me, either during conversation or while reading the daily News papers.

I am thankful to my friend Dr R V S Sundaram who has already translated my రాగాల డజన్ into Kannada, has now taken the trouble in collecting these puns of mine and publishing them in a book form

January, 1980 PATTABHI RAMA REDDY

# పసిడి పన్నుల పరాభి

జనవరి 1 నుంచి డిసెంబరు 31 దాకా రోజుకో యాపిల్ పండు తింటే డాక్టరును దూరంగా ఉంచ వచ్చునంటుంది ఇంగ్లీషు సూక్తి

పరాభి పంచాంగంలోని పసిడి పలుకుల విటమెన్-బి గుళికలను రోజు కొకటి చొప్పున సేవిస్తే, తెలుగువాడి మనస్సుకి ఆరోగ్యము ఉల్లాసము సిద్ధిస్తాయని నేను గ్యారంటీగా చెప్పగలను

ఏ సిద్ధమకరధ్వజానికీ వసంత కుసుమాకరానికీ లేని పునరుజ్జీవన శక్తి ఈ మాత్రలకుంది ఆలసించకండి నేడే ప్రారంభించండి

పరాభి (తిక్కవరపు రామరెడ్డి) ని నేను తెలుగుదేశానికి అతని పిడేలు రాగాల డజన్ ద్వారా పరిచయం చేశాను తర్వాత సంస్కార చిత్రంతో పరాభి యావద్భారత కీర్తి ఆర్జించాడు (అన్నట్టు ఆ చిత్రానికి అంతర్జాతీయ బహుమతులు కూడా లభించాయి )

పరాభిని ఆరుద్ర పన్నులలో సంపన్ను డని అభివర్ణించాడు పన్నులంటే ఇంగ్లీషులో రెండర్థాల మాటలు ఇలా ఆరుద్ర చేత అనిపించింది పరాభి ప్రభావమే ఈ పంచాంగంలో ఒక చోట వేసినా తీసినా బాధించేవి పన్నులు" అని ఉంది ఇందులోని చమత్కారాన్ని నేను విశదీకరించ నక్కరలేదు

పరాభి ప్రభావంనుంచి ఆరుద్ర బయటపడలేదని ఒకప్పుడు నేను రాశాను ఆ మాట నేనన్నందుకు కాబోలు అబ్బూరి వారి ప్రబావం నుంచి శ్రీ శ్రీ ఇప్పటికీ బయట పడలే దని ఆరుద్ర ఎక్కడో రాయగా చదివాను (ఎక్కడో కాదు ఇటీవల వెలువడ్డ పరాభి కావ్య సంపుటి కయిత నా దయిత కి ఆరుద్ర పట్టిన నివాళిలో)

ఆరుద్రది పొరపాటు అబ్బూరి వారి, కృష్ణశాస్త్రి గారి భావ కవిత్వపు ప్రభావాన్ని నేనెప్పుడో వదిలించుకున్నాను గురజాడ ప్రబావం ఇప్పటికీ నా మీద ఉందంటే నేను కాదనను

వాసన్, ఉపవాసన్ జోకు నాదిగా చలామణీ అవుతూ వచ్చింది ఇందుకు నేను బాధపడుతున్నాను ఇది నాది కాదని తెలుసు

పరాభిదే అని ఇప్పుడు తెలుసుకున్నాను అమ్మయ్యా " అని ఇక నిట్టూర్పు విడవటానికి ఈ అవకాశాన్ని వినియోగించుకుంటాను

ప్రారంభించండిక పంచాంగ శ్రవణం

మద్రాసు
18 3.79

శ్రీ శ్రీ

# ప్రవాసాంధ్రీయం

ప్రయోగాలకు ప్రసిద్ధుడు మా పరాభి ఆయన తెలుగు కవితా ప్రపంచంలో తిరుగు లేని పన్' నుల అధికారి పరాభి రాసిన పసిడి పన్నుల పలుకులు స్వర్ణాక్షరాలుగా మన మనసుల్లో కలకాలం నిలుస్తాయి

పాశ్చాత్య వాద్యమైన ఫిడేలుపైన మన రాగాలను పలికిస్తున్నట్లే ఆధునిక తెలుగు కవిత్వంలో వినూత్న సృష్టి చేసి ఫిడేలు - రాగాలకు జత గూర్చి చమత్కారం చేశారు పరాభి పన్‌చాంగంలో కూడా నాకు అలాంటి చమత్కారమే కన్పించింది పంచాంగంలో నిజానికి చైత్రవైశాఖాది మాసాలు ఉండాలి అయితే ఈ పన్ చాంగంలో జనవరి నుంచి డిసెంబరు వరకు ఇంగ్లీషు నెలలున్నాయి ఇలా పంచాంగాన్ని - పన్‌చాంగాన్ని కలిపి పౌరోహిత్యం చేశారు పరాభి

ఇది ప్రవాసాంధ్ర భారతి' ప్రచురిస్తున్న మొదటి పుస్తకం ఈ సంస్థకు అధ్యక్షులుగా ఉండడానికి డా రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు ఒప్పుకోడమే గొప్ప అదృష్టం నేడు ఆయన కీర్తిశేషులైనా వారి సౌజన్య సంపత్తే మాకు మూల ధనంగా ఉంది

మా సంస్థ మొదటి కుసుమంగా తమ పన్‌చాంగాన్ని ప్రచురించడానికి అంగీకరించిన పరాభిగారికి హృదయములో దయవున్నది పరాభి నేను భావకవిని కాదు అహంభావ కవిని" అని చెప్పుకున్నా ఆయనతో సన్నిహితంగా మెలిగే వారికి ఆయనలో నిరహంకార చిత్తవృత్తి తప్ప మరేదీ కనిపించదు

"ఫిడేలు రాగాల డజన్" కు 'ఇంట్రో" రాసి అందరిలో ఆసక్తిని రేకెత్తించిన శ్రీ శ్రీ, అడగగానే పన్‌చాంగానికి మున్నుడి రాసిచ్చినందుకు ధన్యవాదాలు

'జ్యోతి" మాస పత్రికలో 1964లో పూర్తిగా వెలువడిన పన్‌చాంగంలో కొంత భాగాన్ని మిత్రుడు సుబ్రహ్మణ్యం ఇచ్చాడు మిగిలిందాన్ని మిత్రులు

శ్రీ ఆనంద్ 'జ్యోతి నుంచి కాపీ చేసి పంపారు పాత ఆనందవాణి' లోవి పంపమంటే ఒక కవిగారు ఉత్తరం ముక్కకూడా రాయలేదు కె.వి. రమణారెడ్డిగారు తమ వద్ద ఉన్న ఆనందవాణి (1947)లోని కొన్ని 'పన్"లను రాసి పంపారు ఆయన దయతో రాసి పంపిన వాటిలో ' అమెరికా నుంచి మన దేశానికి దిగుమతి మెషినరీలున్నూ, మిషనరీలున్నూ' (మే 14) అన్నది ప్రస్తుత ప్రతిలో లేదు పాతదాంట్లో ఒక చోట (మే 17) కమ్యూనిస్టు సోదరుడు" అని వుంటే 'సోషలిజం (ఆగస్టు 1 నాటి పన్) అని మార్చారు పరాభి అలాంటి చిన్న చిన్న పారాంతరాలు మరి కొన్ని ఉన్నాయి

అడుగు వారికి గజమిచ్చు ఉదారచిత్తులు" మైసూరీయులు శ్రీ సి ఎన్ రెడ్డి ప్రవాసాంధ్ర భారతికి ఆయన కొండంత అండగా ఉండబట్టే ఈ ప్రచురణ కార్యాన్ని చేపట్ట గలిగాము

పరాభి పన్‌చాంగం ప్రచురణకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ధన సహాయం చేసినందుకు కృతజ్ఞులం

అకాడమీ తరఫున సహాయం చేయడమే కాక తామే స్వయంగా అమూల్యమైన విరాళం ప్రకటించి ఔదార్యం చూపించిన డా బి గోపాలరెడ్డిగారికి వ్యక్తిగతంగా ప్రవాసాంధ్ర భారతి తరఫునా అభివందనా లర్పిస్తున్నాను

పుస్తకాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన అరవింద ముద్రణాలయం వారికి ధన్యవాదాలు మిత్రులు డా. కె సర్వోత్తమన్, డా కె పురుషోత్తం, శ్రీ అశ్వత్థనారాయణ, శ్రీ చంద్రశేఖర్ ఎన్నో విధాల సహాయ పడ్డారు ప్రవాసాంధ్ర భారతి మిత్రులందరూ తలా ఒక చెయ్యివేసి ఈ సాహిత్య రథాన్ని కదిలిస్తున్నారు అందరికీ వందనాలు

మైసూరు
1-1-1980

సుందరం
(సంపాదకుడు)

## జనవరి

1 పనీ పాటలన్న నా కయిష్టము
పాటలు వ్రాయటం నా పని

2 కులకాంత రంకుల కాంత మధ్య
వర్ణబేధం మటుకేను

3 సత్యాగ్రహం అంటే సర్కారుతో చెరలాట

4 పూర్వ కాలాల్లో మానహాని
ప్రాణహానికి కారణభూతం
ఈనాడు ప్రాణహానికి హేతువు
విమాన హాని

5 రాజాజీ సామరస్యానికి మొనగాడు
ఆద్యంతములే అందుకు సాక్షి

6. చిన్మయానందం కొందరికి
జిన్‌మయానందం అనేకులకు

7 చీనీ ఈనాడు తీపిగాదు
కటువు

8. ఉద్యోగులలో రెండు రకాల వారున్నారు
చేసేవారు కొందరు
కాజేసే వారు కొందరు

9 అపోజిషన్ పార్టీలకు
పడకుండా వుండటమే పతనానికి కారణం

10. స్వంత సేద్యం వంత అని
సమిష్టి సేద్యంలో మాధుర్యమని
కమ్యూనిజం అంటుంది

11 నౌకా వాణిజ్యంలో
మన వంతునకు
కాస్తగాని కోస్తాగాని రావడం
జయంతి ధర్మాన

12 బంగారును స్మగిల్ చేసేది
చాలా మంది హేమా హేమీలు

13 డిటో మాత్రం కాదు
టిటో

14 ఈనాడు అంతా తారు మారు
ఆశలు మన్ను ముట్టినవి
ధరలు మిన్ను ముట్టినవి

15. హిమాలయాల్లో
పోరాడిన మన సేనలకు
చలిలేదు గిలిలేదు

16. తొప్పెల్ల నీది అంటే
తొప్పెల్ల నీది అంటుంది
చయినా

17 అడుగువారికి గజమిచ్చునట్టి
ఉదార చిత్తుడు
పండిట్ జీ

18 మద్య నిషేధమంత విజయవంతము గాలేదు
రాయలసీమ మటుకు
సారాయల సీమ

19 కాల్పువల్ల వేల్పుకాగోరిక
వియత్‌నాము దేశపు
వీర భికు్కలకు

20 వెలయాలు చాలా ప్రియము
ఆలు చాలా సరసము

21 సధవ – తలిరుబోడి
విధవ – తలబోడి

22 సారాయి త్రాగినవాడు
షరాయి వీడి పోతున్నా-తాను
వయిస్రాయి ననుకుంటాడు

23 ద్రవ్యం యావత్తూ పోయింది
ద్రవం లాగా

24 స్త్రీకి శృంగారవంతమ్ము చీర, అని
సుమతి అంటాడు
చీర లేకున్న స్త్రీ మరీ శృంగారవంత
మంటాను నేను

25 పాపం చేయకుండా గర్భం దాల్చింది
క్రీస్తుమాత మరియమ్మ
గర్భం దాల్చకుండా పాపం
జేయాలని
కొందరు సుందరీమణుల కోరిక

26 గాంధీమహాత్ములు ఒకే ఒక్కరు
బ్రాందీ మహాత్ములు మటుకు పెక్కురు

27 సంఘమర్మం - ఒకని కూతురు
మరొకనికి పెండ్లాము వేరొకనికి
తల్లి కూడాను

28 జ్ఞానం కన్నా సుఖం ప్రధానం
కన్యనే మనుస్మృతికన్నా
మను చరిత్రకు సార్వజనీనత

29 ఈ కాలం విద్యార్థులలోన
శాస్త్ర విజ్ఞానానికి చాలా ప్రాముఖ్యం
అందులో మరిన్నీ కామశాస్త్ర విజ్ఞానం

30 చాలామంది నీతివంతులుగా వుండటం
చాలినంత ధైర్యం లేకపోబట్టి
అవినీతికి అతి సాహసం కావాలి

31. ఈనాటి దంపతులకు
ఆత్మనిగ్రహము కన్నను
అపత్య నిగ్రహం ఉపయోగకరము



# ఫిబ్రవరి

1 పాపం చేస్తే పశ్చాత్తాప్పడవచ్చు
పాపం చేయకుండా కాలయాపన చేస్తే
పశ్చాత్తాప్పడీ లాభం లేదు

2 పరువు ప్రతిష్ఠ గల ఆట క్రికెట్

3 పదవి కోరను నేను
నేను కోరేది పెదవి

4 పంట పండించడంలో పూజ్యమయినా
కోతలు కోయటంలో మొనగాడు

5 వర్తమాన కాలంలో వంశ ప్రతిష్ఠకంత
ప్రాముఖ్యం లేదు – గుర్రాలలో తప్ప

6 కాంగ్రెసు వాళ్ళకు
వడకటం తగ్గి ఎకటం హెచ్చింది

7 పంజాబును ఐదు పది చేయటమేగాక
మన దేశాన్ని సగం వంగ దీశాడు
మహమ్మదలీ జిన్నా

8 పురాణాలను ఆరు మూడు
చేస్తానంటాడు ఈ వి రామస్వామి
నాయకర్

9. "మావ్ మావ్ మావ్
పిల్లి కూతకాదు, చీనా పులిది

10. ప్రస్తుతం చాలామంది సినిమా
ప్రొడ్యూసర్లు డబ్బు చేస్తున్నారు

11 పంచశీలం నేడు
పటాపంచ శీలం

12 మాట దప్పుటకు మహాత్ముడు సరి
అల్లునికి మాట అనుల్లంఘనీయము

13 విద్వేషాలు విపరీత మయినందున
ఈనాడు ఆటలందు కూడా ఆడుకోడానికి
అర్ధద్వయం కలుగుతోంది

14 పాశ్చాత్య సంఘం - తన స్నేహితులంతా
తన బార్యను, తాను తన స్నేహితుల
బార్యలను కామించుటకు
వీలున్న వినోద విధానము

15. ముఖ్య విషయాలను చుల్కనగాను
చుల్కనగు వాటిని ముఖ్యముగాను
చూచుట బాగ్యవంతుల అబ్యాసము

16 ధనం చాలా అనర్థకం
ధనం వుండుదాని కన్నా అనర్థకతరం
ధనం లేకుండుట

17. ఎయిర్ హోస్టెస్ = విమానవతి

18 మందువల్ల యుద్ధంలో
మనుష్యులు చస్తారు

19. తలకు అందం లోనవున్న బుద్ధి;
మీదవున్న పాగా కాదు

20. బాగుపడాలన్న
బయం వద్దు భక్తి వద్దు

21. సర్వాధికారం వున్నప్పుడు, ఆ
అనుబవంలో అంత సంతోషము లేదు
భయముతో కూడిన అనుభవమే
బ్రహ్మానందము
ఇదే పరకీయ ప్రేమకు హేతువు

22 స్కిన్ డాక్టర్ల వద్దకు పోవటం పొరబాటు
చర్మం వలిచేస్తారు

23 పాంచాలి = పంచ పాండవుల ఆలి

24. కాంచనం, కాంత, కాదంబరి అనేవి
జగత్తులో ముక్కాలు
మిగిలింది నేను

25 ప్రపంచములోని అభ్యుదయం
చాలా పాళ్ళు సంశయాత్ముల వల్ల
సమకూరినదే

26. నిరాశకన్ననూ దురాశ మంచిది

27 తమిళ దేశస్తులు గలబా చేయడం తక్కువ
ఇంతకూ వారిబాష అరవంగదూ

28 నీవు కూర్చునట్టి డబ్బు ఇతర్ల పాలు
నిజానికి నీవు ఖర్చించునదే నీది

29 పురాణములు నాకిచ్చలేదు
నాకు నచ్చినవి పుక్కిటి పురాణములు



# మార్చి

1 ఈనాడు వ్యాకరణంలోనే కాదు
అంతర్జాతీయ వ్యవహారాల్లో కూడా
సంధులు పాటింప బడటం లేదు

2 కాఫర్లవి అల్లా తప్పా మాటలంటారు
మహమ్మదీయ మతస్థులు

3 పారిశ్రామిక నాగరికత అంతా
పట్టి అయోమయం

4 నెల్లూరు జిల్లా నెరజాణల
మొలగొలుకుల మీద
అందరికి చాలా మోజు

5 బడ్జెట్‌లో ముక్కాలు పాలు దండుగ

6 సినిమా వ్యాపారం బ్రహ్మాండమైన
లాటరీ
అదృష్టం వున్నవాడు వాసన్
లేని వాడు ఉపవాసన్

7 కేంద్ర ప్రభుత్వంలో చాలా
డిల్లీ డాలీయింగు

8. రష్యన్లకు నిండా త్రాగడం
వాడ్క

9 ఆశ్చర్యంగా వ్రాస్తాడు ఆహ్ రుద్ర

10 జీతం తగ్గిన జీవితం విశేషిస్తుంది
గుమాస్తాకు

11 హరి సేవవల్ల స్వర్గప్రాప్తి సంధిగ్ధము
మనోహరి సేవవల్ల
భూలోకమే స్వర్గతుల్యము

12 కొందరికి పక్కలో బల్లెము మగడు
పక్కలో బెల్లము విటుడు

13 నిత్యమూ నాకు ఆలు
బహువచనం గానే ఇష్టము

14 రైల్లో అపరిమితంగా సిగరెట్లు
త్రాగడం నా కలవాటు
పొగబండి విడిపించు పొగం జూచుసరికి
నాకు ప్రోత్సాహం కలుగుతుంది

15 ముండ మోయుటకన్నా
బండ మోయుట మేలు

16 కుల తత్వము ఖిలానికి హేతువు
కుల హీనులదే బవిష్యత్తు

17 విధవకు గుడితీసి కొమ్ములు పెట్టేట్లు
చేశారు వీరేశలింగంగారు

18 మనస్సును స్వాధీన మందుంచుట
సులబమే నాకు
దేహాన్ని స్వాధీన మందుంచుట
కష్టాతి కష్టమగు కార్యము

19 కాంతల·జయించుట ద్వివిధంబు
1. అందినచో జుట్టు పట్టి క్రిందకు రమ్ము
2 అందనిచో కాళ్ళు పట్టి పయికి లెమ్ము

20 గణితము కన్ననూ నాకు
మణితము ఇష్టము

21 స్వార్థహీనుల వల్ల చాల కీడు;
పరార్థము మీదికే వారికన్ను
నిత్యం ప్రసరించుతుంది

22 నాయకుని కావాల్సని అనలేదు
ఒక్క దక్షిణ నాయకునిగా తప్ప

23 మరొకడన్నదానికి
తాళం వేస్తుంటాడు
బుర్ర లేనివాడు

24 చెరకు చనుట కన్నను
చెరకు తినుట సులభము

25. ముడి విప్పిన కోక శాస్త్రము
సులభంగా బోధ పడుతుంది

26 పణ్యాంగన పుణ్యానికి వస్తుందా
ఎం, పాపం

27 యుద్ధమ్ము వలన వసుధలోన
సువర్ణంబు లోపించి
వధ మాత్రము నిలంబడియున్నది

28 మరుని కయ్యానికి మడతి కాలు
దువ్వినాడు మనోహరుడు

29 కాంతతో ప్రశాంత జీవితం దుష్కరము
కాంతవినా ప్రశాంత జీవితం దుస్సాధ్యము

30 ఆ కామిని అతను అంటేచాలు
మన్మధుడే అని అనుకొంటుంది

31 కాముకి మనసు మెత్త మనసు



# ఏప్రిల్

1 ప్రభుత్వానికి పాలసీలు సున్న
పాలసీలుండేది భీమా సంస్థలో మటుకే

2 పాకిస్తాను నప్పుకోబట్టి బంగాళం
పంచ బంగాళమయింది

3 నరలోకమునకు
'క' ప్రత్యయం చేరుటవల్ల
నరకలోకం ఎర్పడుతుంది
అంతేగాని వేరే నరకలోకం లేదు

4 జారత్వం ఎక్కువై వాని జన్మ
శ్రుతి మించి రాగాన పడింది

5 బావ కవిని కాను,
అహంబావ కవిని నేను

6 ఆర్థికచింత ఎక్కువగునుకనే
మనదేశంలో
పారమార్థిక చింతన ఎక్కువ

7 రాగము వల్ల ప్రణయము
విరాగము వల్ల ప్రణవము

8 వనిత చక్కదనము
వంపులో వుంది

9 ఉద్యోగం పురుష లక్షణం
నిరుద్యోగం మహా పురుష లక్షణం

10 నీతులూ గీతులూ, వీనిలో నాకు
గీతులే యిష్టం

11 ఈ నాడు తర్డుక్లాసు కంపార్టుమెంట్లో
సామాన్లతో ప్రయాణం చేయుట
ఇరుకులో సరుకు

12 రామాయణం కన్నా పాప్యులర్
లోకాభిరామాయణం

13 తలంబ్రాలు కాదు
అది తలన్ర్వాలు

14 దంతికన్నా వదంతి పెద్దది

15 హయి హీల్డు బూట్సు వేయుటవల్ల
కొందరు కన్యలకు కులుకు
మరి కొందరికి లుకులుకు

16 అ ఆలు పచ్చాక అతగాడు
కాగుణింతమగు
కొక్కోకం నేర్చుకుంటున్నాడిప్పుడు

17 దగ్గుకు పరుష స్వరూపమునే
క్షయ అంటారు

18 నిలకడగా నీరుత్రాగుట కన్నా
పరుగెడుతూ బీరుత్రాగుట
కొందరి కిష్టం

19 సమాన హక్కులుండాలి స్త్రీకి
ఆమెకు అర్ధస్థానం
పురుషుని ప్రక్కను

20 వంగదేశం వాని కెక్కినది
టాగూర్లకు టయిగర్లకున్ను

21 సుధాకరుని "క్షుధాకరా' అని
సంబోధన చేస్తారు
ప్రజా సాహిత్యవాదులు

22 ప్రియుడు ప్రియురాలితో
కలకాలం ప్రేమిస్తానంటే అర్థం
తన ప్రేమ స్వప్నప్రాయమని

23. మాయా ప్రపంచమందు మనుచున్నట్టి
మానిసి యొక్క తిరుగుబాటు సినిమా

24. కవులు చంద్రుని
అమృత మండలం అంటారు
కాని శాస్త్రజ్ఞులు చెప్పేది
మృత మండలం అని

25 వెలయాలికి
'రండా' పర్యాయ పదం కద్దు
ఇందులో ఆహ్వాన సూచక
ధ్వని వుందా ఏమి

26 మనజాతిలోని సవర్ణ వివాహాలు,
సువర్ణ వివాహాలు పోవాలి

27. వధూ వరులకు చదువు కన్నా
చదివింపు లెక్కువగా వున్నవి

28 పసివాండ్రు, పడతులూ ఒకేరకం
అందుకనే వాళ్లనంతా పిల్లలంటారు

29 ఒక కీలు బొమ్మ
మరోకీలు బొమ్మతో ఎమన్నది
"మరతలా" అని

30 చనిపోయినవాని నామస్మరణం కన్న
వాని వీలునామ స్మరణం చేస్తుంటారు
బంధు మిత్రులు



# మే

1 గిరులకు పూర్వం యోగులు పోయేవారు
ఇప్పుడు బోగులు పోతున్నారు నీల గిరులకు

2. మధ్యాహ్నం నిద్రపోవుట మంచిది
ఒక్క దినం రెండు దినాలుగా తోస్తుంది

3 మలబారులో కోమలాంగులు
రవిక వేయనందువల్ల మూడు ప్రతిఫలాలు
ఒకటి, రవిక డబ్బు మిగుల్పు;
తతిమ్మా రెండున్నూ తెలిసినవే

4 స్త్రీని పేరు పెట్టి పిల్చుట తప్పు, కాని
ముద్దు పేరు పెట్టి పిల్చుట ఒప్పు

5 పెళ్ళి కావలసిన ఆడ పిల్లలకు
పరధ్యానము కాదు వరధ్యాన మెక్కువ

6 కాయం లేనిది
పసివానికి తొపసి వానికి
మటుకేను

7 సామాన్యులనే మాన్యులుగా
తలంచు పద్ధతి
డెమాక్రసి

8 వెలది యనగా విపరీతముల
విచిత్ర సమ్మేళన -
ప్రియమును సరసమును గూర్చు
నెరజాణ

9. విప్పుటకు వీలుకానిది ప్రేముడి

10. నరుల సమరుల కావించునవే మరులు

11 ముందుకు పోవటమంటే మనకు మహాకష్టం
బస్సులో గాని, బండిలోగాని సంఘంలోగాని

12 వారనారి యింటికి చాలా
రాక పోకలు జరుగుతాయి

13 గ్రామాలు గరిక ప్రదేశాలేగాని,
నాగరిక ప్రదేశాలు కావు

14 ఉత్తమాంగం అని పేరేకాని
చాలా మందికి ఉత్త అంగం మటుకేను

15 ఈనాడు స్టాకు బ్రోకరు వద్దకు,
రేపు పాన్ బ్రోకరు వద్దకు

16 బిడ్డలందరికీ ఇష్టమగు కూర క్యాటికూర

17. చుక్కెదురు కావడం మంచిది
కాదు గాని, చక్కని చుక్కెదురు కావడం
అదృష్టమే

18. రామ రాజ్యం కాదు నేను కోరేది,
నేను కోరేది విరామ రాజ్యం

19 మన్ను ఊదారంగుతో గుడి కట్టుకొని
మిన్నుగా అయింది

20 కుంతికి కర్ణుడు కన్నెలోని పాప

21 ఇంతి నడుము పూజ్యము

22 చీట్లాడు వారికి, క్రైస్తవులకు
ఎసుదయ వుండాలి

23. రతిశాస్త్రంలో ముద్దు పిల్లవానికి
నోటికి నోరు వస్తూంది

24. ఎత్తు వేయుటలో
పొట్టివాళ్ళే గట్టివాళ్ళు

8 వెలది యనగా విపరీతముల
విచిత్ర సమ్మేళన -
ప్రియమును సరసమును గూర్చు
నెరజాణ

9 విప్పుటకు వీలుకానిది ప్రేముడి

10 నరుల సమరుల కావించునవే మరులు

11 ముందుకు పోవటమంటే మనకు మహాకష్టం
బస్సులో గాని, బండిలోగాని సంఘంలోగాని

12 వారనారి యింటికి చాలా
రాక పోకలు జరుగుతాయి

13. గ్రామాలు గరిక ప్రదేశాలేగాని,
నాగరిక ప్రదేశాలు కావు

14. ఉత్తమాంగం అని పేరేకాని
చాలా మందికి ఉత్త అంగం మటుకేను

15. ఈనాడు స్టాకు బ్రోకరు వద్దకు,
రేపు పాన్ బ్రోకరు వద్దకు

16 బిడ్డలందరికీ ఇష్టమగు కూర క్యూటికూర

17. చుక్కెదురు కావడం మంచిది
కాదు గాని, చక్కని చుక్కెదురు కావడం
అదృష్టమే

18 రామ రాజ్యం కాదు నేను కోరేది,
నేను కోరేది విరామ రాజ్యం

19 మన్ను ఊదారంగుతో గుడి కట్టుకొని
మిన్నుగా అయింది

20 కుంతికి కర్ణుడు కన్నెలోని పాప

21. ఇంతి నడుము పూజ్యము

22 చీట్లాడు వారికి, క్రైస్తవులకు
ఎసుదయ వుండాలి

23 రతిశాస్త్రంలో ముద్దు పిల్లవానికి
నోటికి నోరు వస్తుంది

24. ఎత్తు వేయుటలో
పొట్టివాళ్ళే గట్టివాళ్ళు

25 ఈనాడు సబ్బుకన్నా నున్నగా
జారిపోతూన్నది డబ్బు

26 మే, జూన్ మాసాలు సహాధ్యాయినుల్లాగ
సెలవులతో నవ్వినాయి విద్యార్థికి

27 సాని పైకి ఉంచేది పైసా

28 ప్రపంచంలో పయికాలు వున్నవానిదే పయిచేయి

29 కర గ్రహణానికి ముందు
వేలు కావాలంటాడు, ఈనాటి యువకుడు

30. తీసినా వేసినా బాధ కల్పించునవి
పన్నులు

31. నీలగిరిలో నూనె, తేనె తప్ప
మిగిలింది ఎది కొనినా కూడా
చాలా నూనె



# జూన్

1. హిమాలయంలోనే కాదు హిమం వుండేది;
వనితా మణుల వదనాలలో సైతం
హిమానీ స్నో వుంది

2 శ్వేత ముక్తామణుల కన్న
స్వేద ముక్తామణులకే జాస్తి
అంటాడు సామ్యవాది

3 శూన్యానికి కూడా ప్రయోజనం వుంది;
లోహమూ, శూన్యమూ కలిసి
పాత్రగా పరిణమిస్తున్నది

4 వారనారికి నాణ్యమే ప్రాణము

5 అతివల అధరాల మీద వుండేది
అమృతం, కాదు అది అనృతం

6 వాడన్నిటికీ నీళ్ళు వదిలాడు
విస్కీ కూడా నీటుగా
త్రాగుతున్నాడందుకని

7 ముందుగా పూజించేది వెనకయ్యను

8 కాంతుని ప్రార్ధనాలాపాలకు
కాంత నిలువంబడ లేక అడ్డం పడింది

9 మనిసిలో కడకు మిగిలేది
ఆద్యంతం మటుకేను

10 చిలువ కన్నా అపాయకరం చెలువ

11 ఒకానొకప్పుడు అంటరాని వాళ్ళు
మాలవాళ్ళు నామాలవాళ్ళున్ను

12 బంగుళూరు = బంగళాలూరు

13. మానవతులందరూ ఈనాడు
సమానవతులు కా గోరుతున్నారు

14 పాములు, పావులు చేసేవి పాప కార్యాలు

15. తార కాదగిన స్త్రీ ఒక రకం
దార కాదగిన స్త్రీ మరోరకం

16 పాలు రాకున్నా పరవాలేదుగాని
తపాలు రాకున్న చాలా ఆదుర్దా

17 పూర్వం మంత్రాలను రహస్యంగా
కాపాడేవారు; ఈనాడు రహస్యంగా
కాపాడేది యంత్రాలను

18. ప్రాణాయామం చేసి గాలిని బంధించుట
హింస కాదు; అది హింస

19 సిగరెట్ కన్నా గౌరవ ప్రదం
సిగారు

20. ఒకప్పుడు కవులకు కాకలి గీతాలపై
మక్కువ
నేడు మాత్రము ఆకలి గీతాలపై

21. చాలామంది శీలవతులు
శీతలవతులు నిజానికి

22 లవ్ లవ్ లవ్ అని నిరంతరమూ
అనేది శునకమున్నూ
లవరున్నూ

23 శిశు పంచకమును కన్న కెనడా దేశపు
ఐదువ బాగ్య మేమనవచ్చు

24 తల గుడ్డల మీద చాల మోజు
మైసూరు ఆఫీసర్లకు;
సరిగ వుండాలంటారు

25 కాశ్మీరము బరతమాత నెన్నుదుట
కాశ్మీరము, అది చెరుగరానిది

26. తలను కప్పునది కుంతలము

27 మహమ్మదీయుల మతమే మతము
ఇల్లా కాదు అల్లా అంటారు

28 ప్రియురాలు దగ్గరలేని ప్రియుని
ముఖం ఒకే వైపు; ఉత్తరం తట్టు

29 ఎలమావి కన్ననూ ఎలమోవి
తియ్యన

30. కాకి కన్ననూ దయనీయం ఎకాకి



1. నమ్మవలసిన వాటిని నమ్మకుండుట,
నమ్మజాలని వాటిని నమ్ముట -
ఇదే హిందువుల ప్రత్యేకత

2 హృదయములో దయ వున్నది

3 కాళిదాసు కాలంలో మొయిలు రాయబారం
నవీన కాలంలో
మెయిలు రాయబారం

4 చదువు సంధ్యలేని వయోజన కార్మికులకు
సంధ్య చదువు ప్రయోజనకారి

5. కబూకి నాట్యంలో అడుగు తీసి
అడుగు వేయుటకు అరగంట పడుతుంది
నిజంగా చాలా ఆలాస్యమది

6 పురాణాలలో సుచరిత్రలు
తార లవుతారని ప్రతీతి
నేటి కాలంలో ఇది వ్యతిరేకంగా

7. నా గొంతు కోసినా పాడలేను
అయితే, పాడితే తప్పకుండా
నా గొంతు కోస్తారు

8 నారికీ వార నారికీ మధ్య
చాలా వారవుంది

9 అసలు దారుల నిర్మూలించి
సుఖ మార్గముల చూపిస్తానంటాడు
సామ్యవాది

10 జగంలో, జగడం రహితమైనచో
జరగడం వుంటుంది

11 పాటలన్నిటిలో వేలము పాట నా
మనస్సును స్పందింప చేస్తుంది

12 మగవానికి క్రియ
ఆడుదానికి అలంక్రియ

13. మనదేశంలో ఆహార ధాన్యం
కంటె ఆహార ధ్యానం ఎక్కువైంది

14 వివాహం ముందు కలకంఠులుగా వుండే
అనేక స్త్రీలు తర్వాత
కలహకంఠులుగా మార్తారు

15 దేహశుద్ధికి, చిత్తశుద్ధికి మంచి
నడవడి మంచిది

16 రెక్కాడితేగాని
డొక్కాడని వాడు రైల్వే
సిగ్నలర్

17. ప్రాపగాండాలో నిజం చాటు
బడుతుంది

18. ట్యూబు బేబీలు వచ్చాక
మాతృత్వంలోని మహనీయత
గాజువారింది

19. జనులందున
కొందరు ఉదర పోషకులు
మరికొందరు ఉదార పోషకులు

20. బట్టతల కప్పునది తలగుడ్డ

21 స్త్రీని కొలిచేది ప్రియుడున్ను
దర్జీయున్ను

22. ఇంటి పిల్ల దార
మింటి పిల్ల దార

23. కసిని ఆదిలో అరికట్టక పోతే
రక్కసిగా పరిణమించగలదు

24 మంచి డోబీ లేనిదే డాబులేదు
మంచి దర్జీ లేనిదే దర్జాలేదు

25. బ్రతుకులో మూడు అంతస్తులు
బడి, పరుంబడి, ఎత్తుబడి

26. పట్టుతోడ పని చేయుటలో
జపాను వారు అగ్రగణ్యులు

27 పట్టి వేళ్ళకన్న వనిత వేళ్ళు చలువ

28. ఆదిలో ప్రధమా విభక్తియే ఆడుది

29. నిష్కామ ప్రేమలో నాకు నమ్మిక లేదు
ప్రణయంలో పడక తప్పదు

30 ఎన్నికలలో అంతా ఓటు మాటలేను

31. వేదాలు వల్లించి వల్లించి
కడకు దద్దమ్మగా తయారయినాడు



# ఆగస్టు

1. ప్రజానీకములో మానాలు పోయి
సమానాలు రావాలంటుంది
సోషలిజం

2 అపనమ్మకములోనే ఆనంద ముండేది
అందుకనే, తాంత్రికుని కన్న
మాంత్రికుడన్న మనకంత సరదా

3. ఈనాటి కళలో
కళాయి ఎక్కువగా కనిపిస్తుంది

4 చదువు సాము లేకున్న మానె గాని
సాము చదువు మాత్రం
చాలా అపాయకారి

5. ప్రతి సతి కోరేది
పతినేగాదు వనస్
పతిని గూడాను

6 మది రసహితంబగుట మదిర
అంటాడు భోగి
మది రహితంబగుట మదిర

అంటాడు యోగి
ఇద్దరిదీ నిజమేననుకుంటాను నేను

7 జగన్మాత యనగా పరాశక్తి
ఆమెయే అందరికి తొల్లి

8. ఖయాం రుబాయత్ ను
సీరాతో కాదు సారాతో వ్రాశాడు

9 నిమోనియా కన్న అపాయకారి
సినిమోనియా

10. సులోచనాలన్న ఇష్టం నాకు
అయిష్టం గ్లాసు లోచనలన్న

11. అజాద్ హింద్ సమరానికి
అహింస సాంకేతిక సూత్రం
మహాత్మునికి

12. మంచి వదనం కన్నా మంచిదనం
మహిళకు ముఖ్యావసరం

13. బుర్రల చెక్కించేది అటాక్రసి
బుర్రల లెక్కించేది డెమాక్రసి

14 అరికి లోబడుట కన్న
ఉరికి లోబడవచ్చు

15 ఝాన్సీ దళంలోని
కురంగి నేత్రలంతా
ఫిరంగి నేత్రలుగా మారారు

16 పిక స్వరము కన్ననూ ఓపిక స్వరము
మృదుల మంజులము

17 శాసన సభ్యులలో చాలామంది
ఆసన సభ్యులు మాత్రమేను

18 పడతి గడుసరే కానిమ్ము
నగలన్నచో కడుంగడు సరే
అంటుంది

19 ఎదీ అనుదానికి అదిలేదు

20 మతాలవల్ల బజనే కాదు
విబజన కూడా సంబ
విస్తుందా ఎమి

21 క్షత్ర శక్తి కన్ననూ బలవత్తర మగునట్టిది
నక్షత్ర శక్తి

22. గీతను నేర్చుకోమన్నాడు
తిరిగి తానే గీతను మానమన్నాడు
గాంధీ మహాత్ముడు

23 ఎన్నికలలో అన్ని కల్లలు

24 ఆటంకాలు విడిపోవుటకు
టంకాలు అవసరము

25. ఏర్పాటు వల్ల విద్యుచ్ఛక్తి పుడుతుంది

26. కొన కొమ్మ కాయలు కోయుటకు
ఎత్తుగడ కావాలి

27 దక్షిణాఫ్రికాలో బంటూలు బంటులు

28 "హారా" అని ఆశ్చర్యం కలిగించేది హారా వంతెన

29 అతగాడికి చింతలు చిత్తూరంత

30 టూకీ కావాలి నేటి టాకీ

31 న్యాయంత లేడను కుంటాడు
నియంత



# సెప్టెంబరు

1 జిహ్వపని వాదించుట కాదు
ఆస్వాదించుట

2 చికిత్సలోన ఫలముండ వలయునన్న
విచికిత్స వుండరాదు

3 శనివారం కొందరికి
సినివారం

4 ఆటమిక నాగరికతకు
ఆటవిక నాగరికతకు
అట్టే వ్యత్యాసం లేదు

5 నాలుగు కాళ్ళు ఒకటే అవుతుంది

6 సినిమా నటీమణి ఆశ
మాతగావాలని కాదు
నిర్మాత గావాలని మాత్రమేను

7 నవ నారులకు
వంటలలో కన్న
వడ్డింపులలో నేర్పు

8. నాలుగంటి కాదు సవాలుగంటి

9 ప్రజల నమ్మువారు
ప్రజా నాయకులున్ను ప్రజా
ద్రోహులున్ను

10 మిత్తిన్ జయించునది మత్తు

11 వేనోళ్ళ కొనియాడబడేది
"బబుల్ గం'

12 ప్రీలవ్ వారికి
సెక్సు ఉచితము సదా

13 మనకు అహంబావము పోయి
"హం" బావము వచ్చిన దాకా
గతిలేదు

14 సాహసికుడు కావచ్చు కాని
ఘూర్కాను నిజంగా మూర్ఖా అనాలి

15 సనాతనులు వేదం వల్ల రాజ్య నిర్వహణ
కావాలంటారు
వాదం వల్ల అని అధునాతనులంటారు

16 కలర్లు త్రాగవద్దు; అవి చాలా ఉపద్రవం

17 మంచి దర్జీవాడు
ఎలాగయినా కుట్టగలడు

18 ఈనాటి యువతీ యువకుల్లోన
వ్రీడలేని ప్రేమ

19 ఈనాడు మందబుద్ధిగా వుంటేనేగాని
ప్రజానాయకుడు కాలేడు

20 ఆంధ్ర సారస్వతంలో సంస్కృతం మీద
విహిత భక్తి గోచరిస్తుంది

21 దంతాలు సరిగ్గా లేకున్న
దంతవైద్యుని వద్దకు
పో పలుమారు

22. సత్తుకన్న సత్తువకే
నోరు ఇప్పుడు

23 డాంబికుని మాటలన్నీ
పయి పూతగాని
వేరు కాదు

24 చిట్టి పాపాయి ఇది
చిల్లి పీపాయి

25. ఎ ఆపీసుకు పోయినా
దక్షిణ లేనిదే ఉత్తరం లేదు

26 నిజానికి
కాకా బట్టు వారేను
కాబట్టువారు

27 నత్తివానికి నా వందనాలు

28 కూరలందేకాదు రాకూరులందు కూడా
వంగ చాలా ప్రసిద్ధి

29 మన దేశపు దిగుమతులందు
ఆహార పదార్థాలు ప్రాధాన్యం

30 పత్రికల మధ్య చాలా ప్రతిస్పర్ధ



# అక్టోబరు

1. బ్యాంకు చెక్కుల కన్ననూ నాకు
బామ చెక్కులు ఇష్టము

2 మహాత్మునికి
పాకి వాండ్రన్న పరమ గౌరవము
తుపాకి వాండ్రన్న అసహ్యమున్ను

3 రాటం కన్న రంకుల్రాటం
ఇష్టం నాకు

4. బ్రేజియర్ను బ్రా అంటారు
బ్రా నిజంగా అబ్రకాడబ్రా
చనుకట్టు మీద కనుకట్టు

5 మనుష్యుని పతనానికి కారణం
పాప కార్యం అంటుంది
క్రైస్తవ పురాణం

6. మలబారు నిజంగా
బామల బారు

7. క్షయ వ్యాధికి
అపత్యం కూడదు

8. అండర్ గ్రౌండు ఆక్టివిటీ
అన్ని వేళల ఎర్రల మురాకు

9. దక్షిణిండియాలోన ఇంతమంది
బిచ్చగాంఢ్రు ఉండుటకు కారణం
దాక్షిణాత్యుల స్వబావమే

10 బార్య అందరికీ బర్తనాట్యం
ప్రస్తుతం

11. చిపాన్ చీరలు ప్రసన్నంగా వుంటాయి

12. సుబాసుబోసు
బాబో. ముమ్మంచివాడు

13. సంపత్తికి కారణం నల్లరేగడ

14. వసతికి సతి కావాలి

15 అవిద్య నశించుటకు, విరివిగా
ప్రభుత్వం పెట్టు బడులు
కావాలి

16. దక్షతలో చీమ
డంబాలలో "ఏనుగ"

17. వ్యాపారస్తునికి
శ్రీ దేవి అనుగ్రహంతో సమానం
లావాదేవి అనుగ్రహంకూడాను

18. బర్త్‌కంట్రోలుకు ముఖ్యం బర్త కంట్రోలు

19. కారుకన్నా స్పీడు పుకారు

20 ఉత్తరం ఉత్తరం
దక్షిణం ఉత్తమం

21 తాళ జ్ఞానముండేది నాటూరులకు
నాటకులకు

22 దంపతులకు ప్రేమ్మంచం

23 వానికి పత్రికలో పడాలని ఇష్టం
మరిన్ని వివాహ పత్రికలోన

24. పద్యములనూ మద్యములనూ
సీసాలలో సేవింతురు
రసజ్ఞులు

25 ఆర్య సమాజీకులు తాళికి
ఎగవేసినారు

26. ఆస్తిపాస్తులు బాగ్యవంతులకు ;
బీదవాళ్ళకు అవి
హ్రస్వము

27. అమరుకావ్యములోన
శయ్యాలాలిత్యము
గమనార్హము

28. లంగోటు = కనిష్ఠము
లాంగోటు = గరిష్ఠము

29 చేకావిలికి దుడ్డు కావాలి

30 ప్రపంచ బాషలన్నిటికి
అచ్చు ఆయువు పట్టు

31 చా అంటే తూ అంటుంది ద్రావిడాంగన
చా అంటే తే అంటుంది
ఉత్తరదేశ వాసిని



# నవంబరు

1. పొగాకు పగాకు

2 నిందింపు నిన్ దింపు

3. వాని ఉపన్యాసము ధారా ప్రవాహము కాదు
ఉత్త వాగు మటుకేను

4. రాయి చౌదరి శిల్పి

5. వజ్రాల వర్తకులకు రవంత లాభాలు

6. ఇన్కంటాక్సు వారిని మోసగించేది
లెక్కలేనంత మంది వర్తకులు

7 నాకు రాజకీయ చర్చల కన్న చందన చర్చలపైనే
మక్కువ

8. వంటకానికీ నాటకానికీ మంచి పాత్రలు ముఖ్యం

9. సాపాటు పడాలన్న పాటుబడాలి

10. బోగం పిల్లలు బాగా చర్చ చేస్తారు

11 మగడు వాలేని మగవాడు

12 లబ్బి వారందరూ లిబ్బి వాం(డు

13 ఉప్పెన వల్ల చాలా అలజడి

14 వకీళ్ళ జాడ్యముతో వాడు బాధ పడుచున్నాడు

15 మాటలలో (బహ్మదేవునికి కూడా
ఆ బోటి ముందు మోమోటమి
నలువకన్నా మేటి ఐదువ కదా !

16. క్రియా శూన్యులు కర్తవ్యం మరచి కర్మనే
నిందిస్తారు,

17. మార్వాడి బేరం అంతా మార్వడ్డి బేరం నిజానికి

18. కూర్చో తగ్గది కుర్చీ
ఎక్కు తగ్గది ఎక్కా

19 జాలికి జోలికి చాలా సన్నిహితం

20. ఆంధ్రలో సహకారం అంటే పడి చస్తారు

21 రసహీన మవునట్టి బ్రతుకుకన్నా
నాకు నచ్చినది బయిరాగి బంగి

22 ఇంగ్లండులో చక్రవర్తికి సత్తా ఎమి లేదు
రారాణి అంటే రాతి బొమ్మ అని కూడా
విరుగుతుంది

23 జమునంపు కలిమి కవును లేమి
ఉరోజములు కావడి కుండలు

24 మోక్ష సుఖము శాశ్వతంబగుటచే చప్పగా తోస్తుంది
క్షణబంగుర సుఖంబులే పునః పునరాభిలాష
గలిగించు నిత్య వాంఛనీయముగా నుండేది

25 లేని గుణముల నారోపించడం స్తుతి
ఉన్నవానిని నిర్వచించడం దూషణ

26 అతగాడి కుండేది వెన్నుపూస కాదు అది
వెన్నపూస

27 విక్రమవంతులు కవులు శూరులు

28 అవనిలో అరణ్యాలు తగ్గిపోతున్నవి

# డిసెంబరు

1 ప్రియురాలి రవిక ప్రియునితో
ఏమన్నది ?
"చను విచ్ఛేద" - నని

2 ప్రియురాలి కోక ప్రియునితో ఎమన్నది ?
"నా మర్మాలన్నీ నీవి" అని

3. బారతీయులకు టోపీ వేసినాడు
గాంధీ మహాత్ముడు

4 ప్రపంచములో పడుచూ లేచుట
స్వబావం ప్రతి జీవికి -
కానీ, కొందరు పయికి రావడానికి
పడుచులే కారణం

5 రామాయణంలో వున్నదంతా మాయ

6. బాల, ప్రౌఢ, వారాంగన కానీ అంటారు
అంతకూ, కామిని కాద్యంతాలు కాని అనేదేను

7 మదించిన రామ రమ్మంటుంది

8. సామ్యవాదులది అధన ప్రసంగము

9 కమ్మగాడ్ని కన్న గూడ
గాడ్నికమ్మ నాకు సంతోషం కూరుస్తుంది

10 ముస్లింలీగువల్లనే మన దేశం
జిన్నా భిన్నం చేయబడింది

11 మంగుళూరు సుమంగుళ్ళూరు

12. ఇంగ్లండులోన తథా ప్రజా యథా రాజా

13. కాసుల రాబడి తప్ప మరేమి
తలంచనివారు, నిజంగా రాకాసులు

14 జనతా గణితాలలో
కూడు కూడు కూడు అని గోడు

15. పఠాను పయిజమ్మాలు
ఠాను పయిజమ్మాలు

16. జవహర్‌లాల్ బహదూరుకు జై

17. ప్రజానీకంతో ప్రొహిబిషన్
శాఖ తాగుడు మూత లాడుతుంది

18. పేరులో పట్టి అయినా
వేరులందు మేటి వట్టివేరు

19 ఆది ఆది మీ ఆదాముకోరిక
అవ్వకావాలి బువ్వకావాలి

20. ఏం ఆర్భాటం !
ఏ ఐ సీ సీ నిజంగా ఎ ఐ ఛీ ఛీ !

21 రోజాలకన్న అందం ఉరోజాలు

22. ఆసవల్ల ప్రయాస

23. చతురంగ బలాలలో ఒక అంగముగు
పావుబంట్లకు కాల్బలంబని
వేరు పేరు

24. దాక్షిణాత్యులకు చాలా
రస పిపాస

25 నటచిత్రకళను విచిత్రకళ
అనాలి

26. మూర్ఖుని తల చిల్లి కుండట్లుబోలు

27 పెళ్ళి ముమ్మొళ్ళు కాన
బ్రహ్మచారిదే పూలబాట

28 జన్మపుట్టెడు దుఃఖం

29 ఋషికి పరమాత్మతో తప్ప
పరులతో పనిలేదు
వారిది స్వయం ఋషి

30 ఏరిండియాలో పోవు
ప్రయాణీకులకు టాటా చెప్పు

31 చైనాది ఆటంశక్తి
మనది రాటంశక్తి



పఠాభి -

జననం 1919 ఫిబ్రవరి 19న నెల్లూరులో. మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలోనూ, శాంతి నికేతన్‌లోనూ, కొలంబియా విశ్వవిద్యాలయం లోనూ విద్యాభ్యాసం. స్నేహలతా పావెల్‌తో తన జీవిత లతను అంటుగట్టుకొన్న సంస్కారి. నమ్మిన సిద్ధాంతం కోసమూ, చేరదలచిన లక్ష్యం కోసమూ, అడ్డంకులనూ, అవరోధాలనూ లక్ష్యపెట్టని సాత్విక సాహసి. అను నిత్యం నూతనత్వం కోసం అన్వేషించే తృషితుడు. అంతరాంతరాల్లో అచ్చమయిన విప్లవ కవి. అప్పుడప్పుడు సరదా సరదా కథకుడు. 'ఫిడేలు రాగాల డజన్', 'కయిత నా దయిత', 'పఠాభి పన్‌చాంగం' అన్న మూడు కావ్యాలూ ముద్దినుసు శ్రుతుల్లో పేలిన మూడు ఫిరంగులు. ఆ శతఘ్ని త్రయమే ఈ పుస్తకం!